# శ్రీమాతృవాక్కులు

అనువాదకులు:

బ్రహ్మశ్రీ తి. వి. కపాలిశాస్త్రిగారు.

# విషయసంగ్రహము

## వాఙ్ముఖము పుట—౧-౬:

దైవసామ్రాజ్యము భూమియందు ప్రతిష్ఠజెందుటకు అనుకూలముగ మానుష్యకముయొక్క కర్తవ్యము, కార్యవిధానము.

## మొదటి భాగము

౧ పుట—౯: దైవముతో నైక్యముం బొంది, దైవముమూలమున నితరులతో సంబంధ ముంచుకొనుట యవశ్యము; ఆ స్థితి ప్రాప్తమగునంతవఱకు ఆప్తవచనానుసారముగ నాచరణ యుండవలె ననుట. ౨ పుట—౧౧: మొదట ఒక్కొక్కడును తన్ను తెలిసికొని వశమున నుంచుకొనవలసినది యవశ్యము; ఒక పరమధర్మము లభించుటకు మునుపు, ఉన్నధర్మముం గీసివేయరాదు. ౩ పుట—౧౪: నియతిస్వరూపము, వైద్యశాస్త్రము, ధర్మశాస్త్రము; దైవకృపయు, ధర్మనియతియు. ౪ పుట—౧౭: ప్రపంచము బహువిధ ద్వంద్వసంకరము, దైవప్రజ్ఞయందే చిక్కు విడును. ౫ పుట—౧౮: పునర్జన్మముకు స్వీకరించువాడు చైత్యపురుషుడు. ౬ పుట—౧౯: దైవమునకు సమర్పణ జేయువానికి ఇతరకర్తవ్యములు ముఖ్యములు కావు. పుట ౨౨—౪౨: సూత్రప్రాయములైన యుపదేశములు, ప్రార్థనలు.

## రెండవ భాగము

మొదటి ప్రకరణము—పుట ౪౫-౫౦ :— ఇందు, యోగముయొక్క ప్రయోజనము, యోగమునకు అధికారి, యోగమునకు తయారగుట, హృదయధ్యానముయొక్క ప్రాధాన్యము, భూమియం దీశ్వరావిర్భావము తత్సామ్రాజ్యము నే యీ యోగముయొక్క

ముఖ్యలక్ష్యము, మానవుల పరిపాకానుసారముగ గ్రహణశక్తికి సరి నట్లు దైవకృపచేత వారు లాభమొందుదురు—ఇత్యాదులు గలవు.

రెండవ ప్రకరణము—పుట ౫౧-౭౨:—ఇది, తపస్య ప్రపత్తి యని రెండు మార్గములను మర్కటకిశోరన్యాయముచేతను మార్జారకిశోరన్యాయముచేతను వివరించును. యోగమునందు గల యపాయములను తన్నివారణోపాయములను గుర్తించును. పురుషుని సర్వాంశములయందును ప్రపత్తి పరిపూర్ణ మగుట కుపాయములు, దాగి యుండిన దురాశాబీజమువల్ల శక్తిని ప్రకటించి ఒక యోగి పడిన బాధ, భగవత్సంకల్పము నెఱుగుట కుపాయము, తదనుసారముగ నాచ రించవలసిన యావశ్యకత; ఇది కోరదగినది, ఇది కోరరానిది అని దైవేచ్ఛానుసారముగ దెలిసికొనకుండుట పొరబాటని ఒక బాలుని కథను దృష్టాంతముగ నుదాహరించుట—ఇత్యాదులను వెల్లడించును.

మూడవ ప్రకరణము—పుట ౭౩-౯౫:— ఇందు, దర్శనములు పలు కక్ష్యలయందు గల్గును, వానికి గూఢార్థములు గలవు, అని నిజముగ నొకరికి గల్గిన దర్శనమును దృష్టాంతముగ దీసికొన్న వివరణము కలదు; స్వప్నములు వేఱు, వానిలో సత్యములు అసత్యములు రెండు విధములును గలవు అనియు, సవిస్తరముగ చెప్పబడును. ప్రపత్తియందు సాధనయొక్క స్థానము, దైవధ్యానము సహజస్థితిగ నుండుటయే అధ్యాత్మజీవనమునకు లక్షణము. హృదయమున లోనికి వెళ్లి దైవమునందు మునుగుటయే యథార్థమైన అధ్యాత్మజీవితమున కారంభమగును—ఇత్యాదులు గలవు.

నాల్గవ ప్రకరణము—పుట ౯౬-౧౧౯:— సమర్పణ విధానము, పూర్ణయోగమందు అల్పము అని ఏదియు త్యాజ్యము కాదు,

సకలము నుపయుక్త మగును. యోగప్రజ్ఞయం దుండగా నేకార్యములం బ్రవర్తించినను బాధ కల్గదు. సర్వమును దైవవిధానమందు పూర్వమే నిర్ణీతము, విధియు స్వాతంత్ర్యమును, స్వేచ్ఛయు, నియతియు, అన్యోన్యవిరుద్ధములుగ నవివేకదృష్టికి కనబడును. కర్మచక్రమునుండి బయట పడి స్వాతంత్ర్యముం బొందుట యోగకార్యము ; సృష్టియొక్క లక్ష్యమును చిత్రపట దృష్టాంతముచేత వివరించుట—ఇత్యాదు లిందు గలవు.

అయిదవ ప్రకరణము—పుట ౧౨౦-౧౪౦:—బుద్ధికి ఉచితమైనస్థానము,స్థూలదృష్టికి అస్పృశ్యములయ్యును, ఆసుర రాక్షసాది శత్రుశక్తులు జీవించుచు స్పర్శయోగ్యములుగ నున్నవి; వీని నెఱుంగుట యెట్లు? ఇవి యెట్లు ఎచ్చటనుంచి ఒకనిపై పడుచున్నవి? ఈ విషయము లిందు ఉపన్యస్తములు. మఱియు శ్రద్ధయొక్క ప్రభావము, మరణమును కూడ జయించ నగును. భూకంప-జలప్రళయ-యగ్నిదాహాది - మహోత్పాతములకు కారణములు, ఒక బాల్య ప్రజ్ఞావిశయందు జన్మాంతరస్మృతి గలది—ఇత్యాదులు చెప్పబడియున్నవి.

ఆఱవ ప్రకరణము—పుట ౧౪౧-౧౫౮:— కొన్ని భూతప్రాయులైన మనుజుల స్వరూపము, భూత-ప్రేత-పిశాచాదుల స్వరూపవ్యాపారములు, ప్రాణలోకవాసులైన యీ సత్త్వములతో వ్యవహరించుట యపాయకర మైనను, ఆ లోకమునందు చరించుటకు ఆవశ్యకములైన సదుపాయములు. ఆ భూతాదులకు సత్త్వము కలదు; స్థూలశరీరము గొప్పరక్ష - దీనిని సయుక్తికముగ సాధించుట, ఇత్యాదు లీ ప్రకరణమందు వ్యాఖ్యాతములు.

ఏడవ ప్రకరణము—పుట ౧౫౯-౧౭౭ :— సంకల్ప బలము, విద్యావ్యాపారపద్ధతి, ఆ తంత్రము తెలిసినచో గొప్ప ప్రయో

జనము కలదు. యోగమును ఆరంభించువారలకు కలుగు ప్రతికూల పరిస్థితులకు కారణములు. రోగములు, తత్కారణము లనేకములు అవి ప్రాప్తమగు పద్ధతి: ఆరోగ్యవిధియందు గల బాధనష్టములు—— వీనిని యీ ప్రకరణము వివరించును.

ఎనిమిదవ ప్రకరణము—పుట ౧౭౮-౨౦౨:——సర్వమును విశ్వగతదైవేచ్ఛ యగునేని పురుషుని యిచ్ఛకు స్థాన మెక్కడ? ఇది సవిస్తరముగ నిందు చెప్పబడును. అసురాది శక్తులకు ఎంతదూరము మానసలోకమందు వ్యాపారముండును ననుట, "చైత్య" ప్రపంచపు పరిస్థితులు, అసురాదిశక్తులు దానిని సమీపించుట శక్యము కాదు. ఆధ్యాత్మికవ్యక్తికిని చైత్యవ్యక్తికిని గల భేదము. అసురశక్తులు లేకుండ పోవుటకు ఒక కాలము రానగును.——ఇత్యాదు లిందు విచారితములు.

తొమ్మిదవ ప్రకరణము—పుట ౨౦౩-౨౧౯:——దైవప్రేమయొక్క స్వరూపము, తద్వికారము మానుషప్రేమ యనునది. ఈవిషయము సవిస్తరముగ విస్పష్టము. దైవప్రేమ కుపకరణముగా ప్రాణమును వర్ణించుచు తన్మహిమను ఇందు వెల్లడించుచున్నారు.

పదియవ ప్రకరణము—పుట ౨౨౦-౨౪౧:——మతమునకును ఆధ్యాత్మజీవితమునకునుగల సంబంధము. అది యెట్లు అనుకూలమగును, ఎట్లు ప్రతికూలమగు నని, చెప్పుచు మతముల మూలపురుషుల సత్యదృష్టికిని మతానుసారుల పద్ధతికిని గల అజగజాంతర-తారతమ్య-నిరూపణమూలమున నాధ్యాత్మికోత్కర్షను ప్రతిపాదించుట.

పదునొకండవ ప్రకరణము—పుట ౨౪౨-౨౬౦:——

పురుషుని ఉపకరణములయందు గల వైషమ్యము శారీరకరోగముగ

పరిణమించు ననియు, శరీరమునం దే భాగమున రోగలక్షణము స్పష్టమగునో, అది లోపలనున్న వైషమ్య మెటువంటిదని తెలుపు ననియు, మనుష్యునకు రక్షగా నున్న యొక సూక్ష్మమైన యావరణమును జీల్చుకొనియే బాహ్యమునుండి రోగశక్తులు శరీరముం బ్రవేశించు ననియు, ఆదేహరక్షకమయిన యావరణమునకు దార్ఢ్యముం గాని దౌర్బల్యముం గాని యొసంగెడి పరిస్థితులును దృష్టాంతోదాహరణపూర్వకముగ నిందు ఉపపాదించబడినవి. రెండువందల సంవత్సరములకు పైగ జీవించిన యొక గొప్పయోగికి గూడ సర్వరోగములును నివారణము కానందులకు కారణములును ఇం దుదాహృతము.

పండ్రెండవ ప్రకరణము—పుట ౨౬౧ - ౨౭౯ :— యోగియొక్క సర్వజ్ఞాన మెటువంటి దనియు, సర్వలోకవృత్తాంతముల నత డెఱింగియుండుటయే సర్వజ్ఞాన మని చెప్పుటయందుగల యుక్తాయుక్తవిచారము ఇందు విశదింపబడినది. ప్రకృతిశాస్త్రవేత్తల స్ఫూర్తిజ్ఞానమునకును మనస్సుకు చాలదూరమున పైగా నున్న విజ్ఞానతత్త్వమునకును ఏ సంబంధమును లేదనియు, పరప్రజ్ఞను బొందిన వైజ్ఞానికపురుషునకు జగద్విషయమందు అక్కఱయున్నను అది వేఱువిధ మనియుం అవి యవివేకుల యభిరుచివంటిది కాదనియు వ్యాఖ్యాతమైనవి. అభీష్టసిద్ధికై శారీరక లోపనివృత్తి మొదలయినవానికై యుండు నత్యంత దృఢసంకల్పము, దైవసంకల్ప మట్లున్న దనుటకు లక్షణము, ఏకాంతధ్యానము, సాముదాయికధ్యానము, వీని పరిస్థితులు, ప్రయోజనము—ఇత్యాదులు ఇం దుపన్యస్తములు.

పదమూడవ ప్రకరణము—పుట ౨౮౧ - ౨౮౭ :— కొన్ని జంతువులయందు మన జుగుప్సకు హేతువులు, ఈశ్వరుడు

ప్రేమమయుఁ డయినను, అతడు సృజించిన యీ భూమియందు చెట్టు లుండుట యసంగతము గదా యను ప్రశ్నను సవిస్తరముగ విచారించి యుత్తరమును నిశ్చయించుట; లోకసంస్థానములయందు ఈ జడలోకముయొక్క స్థానము, దాని గుణాగుణములు, ప్రయోజనము ఇత్యాదులు ఇందు విచారితములు.

పదునాల్గవ ప్రకరణము—పుట ౨౭౮-౩౧౨ :— కళకును ఆధ్యాత్మజీవితమునకును గల సంబంధము: రామాయణ-మహాభారతాది - కావ్యకళ ఋషులచేత, యోగులచేత, రచితమయినది, విదేశీయ-కావ్యకళకు తీసిపోయినది కాదు. కళాభినివేశము గలవారగల కళ యోగముచేత పెంపొందును, కొందఱకు అభినివేశ ముండియున్నను యోగముచేత నది తొలగును. ఇందులకు కారణములు. ఇత్యాదులు ఉపన్యసించబడియున్నవి.

పదునైదవ ప్రకరణము—పుట ౩౧౩-౩౩౨:—ప్రవృత్తికిని త్యాగమునకును గల భేదము; ధర్మమునకును ఆధ్యాత్మికత్వమునకును గల భేదము సవిస్తరముగ విచారింపబడినది; మానుషగుణములైన ఔదార్యలోభాదులు,దివ్యగుణములయొక్క వికారములు; మానవులనుకొను గుణదోషములు రెంటికిని దైవసృష్టియందు మదింపు ఒక్కటే; ఈశ్వరార్పణచేత అవి మార్పుజెందు నపుడు దివ్యములై దైవమునకుపయుక్తములగును—ఇత్యాదుల వివరణ మిందుగలదు.

# అవతారిక



శ్రీ మాతృవాక్కులు— గ్రంథనామము, దీని వివరణ: శ్రీ అరవిందులు యోగనిష్ఠనూని చిరకాలముగ బాహ్యప్రపంచముతో సాక్షాత్సంబంధ ముంచుకొనకుం డుట జగద్విదితము. శ్రీవారి నాశ్రయించి తద్యోగము ననుసరించు సాధకుల బాహ్యాభ్యంతరభారమును దించి యాశ్రమకార్యనిర్వాహమును సాధించి శ్రీ అరవిందుల నిష్ఠకు సాయపడువారే శ్రీమాత. వీరి వాక్కులే "శ్రీ మాతృవాక్కులు" అను నీ గ్రంథము.

శ్రీమాత పలుసంవత్సరముల క్రిందట మానుష్య కముం గుఱించి తాము కర్తవ్యముగ గైకొన్న కార్య విధానమును వ్రాతలో నుంచియుండిరి. ఈ లిఖితమే వాఙ్ముఖ మనుపేర నీ గ్రంథమునకు మున్నుడిగా నున్నది. ఇందు రెండుభాగములు గలవు. వీరు అప్పుడప్పుడు ఆశ్రి తులకు అనుగ్రహించిన వాక్కులు, అర్థపుష్టియుక్త ములై సూత్రప్రాయములై యున్నవి కొన్ని, ప్రార్థనరూప

ములుగను తత్త్వాభిధాయకములుగను నున్నవి మఱి కొన్ని—వీని కూర్పు మొదటి భాగము: రెండవ భాగమందు పదునైదుప్రకరణములు గలవు. శ్రీ మాతతో ననేకసంవత్సరములకు మునుపు సాధకులు కొందఱితో నడచిన సంభాషణలలో ప్రశ్నలకు శ్రీవా రనుగ్రహించిన యుత్తరము లివి.

సాధకుల కనుగ్రహించిన వాక్కులు అన్నందువలన, యోగసాధనయం దున్నవారలకు, అందువలన నొకవిధముగ విషయప్రవేశము గలవారల కని భావ మగును కాని, యిప్పటికి సాధనయం దుండనివారైనను జిజ్ఞాసువులై యున్నవారలకు గూడ నుపయుక్తముగా నగు నని, జిజ్ఞాసోత్తేజకమైన నీ గ్రంథము ప్రకాశిత మైనందున, ఆంగ్లమునుండి దీని తెనిగింపు ఆంధ్రలోకమునకు ప్రీతిదాయకమైన పావనసేవ యగు నని యీ కర్తవ్యముం బూనినాడ.

ఇక గ్రంథమందలి గహనవిషయము సుబోధ మగుట కావశ్యకములైన విషయముల నల్పోపన్యాసమున నిట ప్రస్తావింప దలగొంటిని.

మనుజుని జ్ఞానము తన్ను గుఱించియు తన్ను జుట్టి యున్న జగమును గుఱించియు, ఇంద్రియములపై

నాధారపడిన బుద్ధివల్లనే కల్గును. ఈ బుద్ధి అతిమితమై యున్నందున మానవుడు వెలుపల జగత్తును గాని లోపల తన్ను గాని బొత్తిగ నెఱుంగ నసమర్థుడు. ఈ బుద్ధి కతీతమైన యొక ప్రజ్ఞావిశేష ముదయించినచో ప్రత్యక్షముగ నున్న ప్రపంచముయొక్క సూక్ష్మతత్త్వములును అపరోక్షముగ నున్న తన్ను గుఱించిన సూక్ష్మరహస్యములును బోధమగును. అటువంటి దశ సిద్ధించుటకు మునుపు సాధారణముగ మనుజునకు అతీంద్రియార్థములగు లోకాంతరస్థితులు జ్ఞానదశావిశేషములును అభావప్రాయములై యుండును. ఇందచ్చెరువొంద నవసర మేమియు లేదు. ఇందుల కుదాహరణము మన యొజ్జలు వక్కాణించు కూపస్థమండూకదృష్టాంతమే. అథవా, అత్యుష్ణస్థితి గల నిర్జలప్రదేశమున బుట్టి పెరిగి యావజ్జీవము జీవితము గడుపుచున్న యొక ప్రాకృతపురుషుడు ద్రవమై యున్న జలము ఘనము గావచ్చునని నమ్మలేడు. అధ్యాత్మ విషయమందు జొరవ లేక లోకాంతరములకును ఈ లోకమునకును గల సంబంధముల నెఱుగక, నెఱుగ నిచ్ఛగించకయు నున్న మానవుని యపక్వస్థితి యా ప్రాకృతుని స్థితిం బోలి యుండును.

కాని, "గోబి" "సహారా" ఎడారివంటి మరుభూమియందు వసించువాడు వేసమిత్తమున నైన హిమా

చలమువంటి శీతలప్రదేశమున కేతెంచినచో జలము యొక్క ఘనభావముం దానే కనుగొనును. మఱియు, తత్పూర్వము ఆ జ్ఞానము గల మనిషిని ఆగా జూడ సంభవించునేని తత్సాహాయ్యమువలన నాజ్ఞానముం బొందవచ్చును. ఈవిధముననే, జ్ఞానముగల మహాపురుషుని యనుగ్రహమువలన పామరుడైన పురుషుడు ప్రజ్ఞావిశేషముం బొంది లోపలను బయటను ఉండెడి సామాన్య బుద్ధి కగోచరము లగు రహస్యముల నెఱింగి కృతార్థతం గాంచవచ్చును. అనగా, అతీంద్రియవిషయముల నెఱుగ ప్రత్యక్షానుమానములు పనికిరావనియు, ఆప్తవాక్యమైన శబ్దప్రమాణ మవశ్య మనియు సిద్ధించును. అందువలన, సాక్షాత్కృతధర్ము లగు మహాత్ములు, జ్ఞానులు, అవతారపురుషులు — వీరల వాక్కులు అనుభవార్థము లగుటంబట్టి యథార్థాత్మవిషయంబున నుత్తమప్రామాణ్యమ్ముం బడయుచున్నవి. అతీంద్రియార్థములయందు ఆప్తవాక్యము శరణ మని ఫలితార్థము.

ఇట్లు అతీంద్రియార్థ జ్ఞానము పరిపాకవిశేషము వల్ల లభించును. పురుషునకు దీర్ఘకాలనిర్వాహ్యమైన పరిపాకమును యోగసాధన స్వల్పకాలమున సాధించును. అటువంటి యోగము నధికరించిన విషయములే శ్రీమాతృవాక్కులు.

కాని, యోగపద్ధతు లనేకములు గలవు. కావున నీ యోగమందలి విశిష్టాంశముల గొన్నింటిని లఘువుగ నిచ్చుట గుర్తింతము. యోగ మనగా, నీశ్వరునితో జీవుడు కూడియుండుట, ఐక్యము, అని సామాన్యముగ జెప్ప వచ్చును. ఈ ఐక్యముయొక్క విశిష్టస్వరూపమును నించుక వివరించెదము.

మనః ప్రాణశరీరములతో బహిర్ముఖులై యుండెడి మనకు అంతరమున నున్న పురుషునియందు ప్రబోధమయి, బాహ్యమునకును ఆంతరమునకును మధ్య నేదియు నడ్డ పడకుండ, నంధకారాహంకారాది వాసనా ప్రతిబంధ ములు లేకుండ, వెలుపలిది లోపలిదానిని దెలిసికొనుచు, లోపలిది వెలుపలిదానిని నిరాటంకముగ నడిపించుచు, ఉభయమునను, అనగా, బాహ్యాభ్యంతరములకు నిరంత రముగ సిద్ధించు ప్రకాశావస్థితి, ఏకధారావస్థితి, ఐక్యము– ఇది ఈ యోగమందలి ప్రథమసోపానం బగును.

ఇంక మఱియొక భాగము గలదు: క్రిందనున్న పురుషుడు పైకి ఆరోహించి అందలి పైనజ్యోతిని బొంది, దానికిని మనః ప్రాణశరీరములతో క్రిందనున్న తనకును నడుమ ఏ యభ్యంతరమును లేకుండ, క్రిందనున్నది పై దానితో కలసి పైనున్నది క్రింది కవతరించి పురుషుని

యహంభావస్థానమున తాను ప్రతిష్ఠ బొంది, భౌమము లైన దేహప్రాణమనస్సులకు దివ్యపరిణామం బొసం గుట— ఈ ఐక్యము యోగమందలి పరమాంశము.

మఱి యొక ముఖ్యాంశము గలదు: మనము సాధారణముగ మనుష్యు డనునప్పు డతడేమో యొక యత్యంత స్వతంత్ర వ్యక్తిగ నున్నట్లు తలచెదమే కాని, యతనియందు అనేక భాగములు సంకీర్ణములై యున్నవని గమనించము. అందఱకు సర్వసాధారణముగ తెలిసిన కొన్ని యంశముల నిచ్చట సూచించెదము. మొదట శరీ రము—ఇది కందమూలఫలాదులపరిణామము, అన్నమయ మని పేర్కొనబడినది, పాంచభౌతికమైన స్థూలదేహము; ఇట్లు తత్త్వ మరయువారలకు ఒక దేహము సమస్తమైన స్థూలజగము నాధారముగా గొని తదంతరవర్తిగను, తదంశముగను ఉండి ఆజగమును విడిచి పృథక్సత్త లేని దిగను దెల్లమగును. ఇట్లే స్థూలదేహముకంటె సూక్ష్మ మైనదియు తత్కార్యముల నడుపు క్రియాశక్తిస్వరూప మైన ప్రాణము గూడ ప్రాణలోకమునకు జేరినదై తదా ధారముగనే దానినివిడిచి పృథక్సత్త లేనిదిగనే చింతకు లకు దేటపడును. మఱియు దేహప్రాణములకంటె సూక్ష్మ తరమును సేంద్రియముగను నిరింద్రియముగను జ్ఞాన

వ్యాపార మొనర్చు మనస్సు గూడ మనోలోకమునకు జేరినదై దానిని విడిచి పృథక్సత్త లేనిదై విచారకులకు విశదమగును.

ఇట్లు, కలసి మెలసి సంకీర్ణములై యున్న మనః ప్రాణశరీరములను ఉపకరణములుగ బెట్టుకొని లోకయాత్రయందలి పురుషుడు తన స్వరూపము నెఱుగక, ఆ యుపకరణములకు దాసుడై, నిజముగ ఆయాలోకములను జేరినవానిని, అన్నప్రాణమనస్సులను, తనవి యనియు అవియే తాననియు నవివేకము పొల్పడి యుండుట లోకవ్యవహారసిద్ధము. ఇట్టి యవివేకముం దొలంచి స్థూలశరీరాదుల జిక్కు విడదీసి వానిని ఉండవలసినట్లు సంస్కరించి యథాస్థానమున బెట్టి, తత్స్థూలస్థానము లగు తత్తల్లోకములతో, ననగా, అన్న ప్రాణ మనో లోకములతో సాక్షాత్సంబంధమును వ్యక్తములుగ బొందుపడ నిచ్చి, పురుషుని యహంకారస్థానమున పైవానిధ్యానమును సాధించుట—ఇదియును యోగమందలి ముఖ్యాంశము.

ఇక నీపద్ధతి నెఱుగువారల కుపయోగ్యమైన యొక తత్త్వము నిచ్చుట గుర్తించుట యుక్త మగును. చిత్తు, చేతన, చైతన్య మను పదములచే వ్యవహృత మగు

## అవతారిక

నఖండప్రజ్ఞ సర్వవ్యాపకమైన సచ్చిదానందమే ఏక స్వరూపమే యయ్యును, అది ఎల్లలోకములయందును తన్ను ఒకేవిధమున నావిష్కరించుకొనదు, ఒకే బల ప్రమాణములతో ఎల్లసృష్టియందును స్పష్టపడదు; అందు వలననే, సర్వసృష్టియు వివిధభేదములతో చైతన్యము యొక్క దశావిశేషములుగాను తత్ క్షేత్రములైన లోక ములుగాను నిష్పన్నమయినవి. కావున, నిచ్చెనవంటి యీ సృష్టిక్రమమందు ఊర్ధ్వాధోలోకములు, సత్యలోకము మొదలుకొని భూలోకమువఱకు చైతన్యమునే యా ధారముగ గొని దాని యావిర్భావవిశేషములుగ నమరి యున్నవి. వీనియందు శక్తులు వేఱుపడును, గుణములు వేఱుపడును, ప్రమాణములు వేఱుపడును. చిత్తుయొక్క స్పష్టభావము సమానముగ నుండదు, అది పైనుండి క్రమక్రమముగ తగ్గుచు వచ్చి క్రింద జడమునందు అంతః స్థితమై దాగియుండును; క్రింద నీ జడమునుండి క్రమ క్రమముగ చిత్తుయొక్క స్పష్టభావము వృద్ధియగుచు పైకి పోవును. ఒక మహాపర్వతమునందు కొండనెత్త ములు ఒకటిపై నొకటిగా ననేకము లున్నట్లు, ఈ సర్గ క్రమమందు చిత్తుయొక్క యారోహణావరోహణములను పలు ప్రస్థములు, అనగా, సమభూములు, ఎగుడును దిగు

వరుసను మెట్టులవలె నున్నవి. వీనిని ఆంగ్లమందు 'ప్లేన్' లందురు. మనము భూమిక లనవచ్చును గాని, యిచ్చట కక్ష్య లని వీనికి నామ మిడి వాడియున్నాము. పైకక్ష్యలు క్రిందికక్ష్య లని ప్రయోగించునపుడు, అన్నప్రాణమనో లోకము లుండు చిత్కక్ష్యలను క్రిందికక్ష్యలనియు, వానికి పై పరతరమనస్సు, అధిమనస్సు, విజ్ఞానము, మొదలైన తత్త్వములకు జేరినవానిని పైకక్ష్య లనియు వాడి యున్నాము.

ఇంకొక ముఖ్యవిషయము; చైత్యపురుషుడు—అంతఃకరణమును బాహ్యకరణములగు స్థూలప్రాణదేహములను నుపయోగించి తదనుభవసారములను గ్రహించి దేహాంతరగమనము పునర్జన్మమును స్వీకరించు పురుషుని చైత్యపురుషు డందుము. ఇతడు హృదయస్థుడే యయ్యును సర్వభూతహృదయమందగాధతలమున నున్న ఈశ్వరుడు కాడు; మఱి స్వతంత్రుడై తత్సంబంధియై బాహ్యాభ్యంతర దేహములకును లోకముల నున్న దైవమునకును మధ్యవర్తియై యిచ్చట జీవవ్యక్తికి మూలభూతుడై యున్న పురుషుని చైత్యపురుషు డని యీ మార్గమందు వ్యవహారము. (ఆంగ్లమున "సైకిక్ బీయింగ్")

# అ వ తా రి క

"చైత్య" పదము వంగవైష్ణవగ్రంథములయం దీ యర్థమందు ప్రయుక్తమై యిచ్చట వాడుకలో నున్నం దున నీ వివరణ మవశ్యమైనది. సంస్కృతశాస్త్రముల యందు ఈ ప్రయోగము మృగ్యమే.

ఇక నుపసంహారము: పాఠకులు విషయసంగ్రహ ముం దిలకించి తామే గ్రంథమందలి యమూల్యరహస్య ముల నరసి తెలిసికొందు రను విశ్వాసముతో విషయముల నిచ్చట ఉపన్యసించక, విషయప్రవేశమున కనుకూలము లైన కొన్ని యంశములను మాత్రము సంక్షిప్తముగ నివే దించినాడ.

పాఠకులు పాఠ్య మగు గ్రంథవిషయమం దవత రించుట కీ యవతారిక యొకింతయేని యుపయోగపడు నేని . యీ యాంధ్రానువాదపరిశ్రమము చరితార్థం బగును.

శ్రీ అరవిందాశ్రమము,
పుదుచ్చేరి,
విషుసంవత్సరము ఆషాఢపున్నమ,
మంగళవారము.

తి. వి. కపాలిశాస్త్రి.
౮-౭-౪౧.

# శ్రీ మాతృ వాక్యాలు

## వాఙ్ముఖము

---

(౧౯౧౨-వ సంవత్సరమున లిఖితము.)

మనము సాధించవలసిన సామాన్యలక్ష్య మేది యన, ఉత్తరోత్తర మభివృద్ధి బొందు విశ్వగత సామరస్యము యొక్క రాకయే.

(సామరస్యము, సంవాదము, స్వరమునకును తాళమునకును గల పొందిక వంటిది, వీని కన్నింటికి భావ మొక్కటి. ఇపుడు జగత్తు యొక్క అపక్వదశయందు సామరస్యము లేదు. అట్లు సృష్టియందిచ్చట సంవాదము లేమింజేత, అనర్థము లుప్పతిల్లుచున్నవి. దానికి నివృత్త్యుపాయము సామరస్య ప్రాప్తి యందున్నది. అది వచ్చిన క్షణమున సర్వానర్థ నివృత్తి కాకపోయినను, క్రమక్రమముగ వృద్ధిజెందు నప్పుడు, సార్వత్రికమైన యది యనర్థ నిబర్హణం బొనరించును. అట్టి దాని యాగమనమే మనకు లక్ష్యము, అని భావము.)

# శ్రీ మా తృ వా క్కు లు

ఈ భూమికి సంబంధించినంతవఱకు, ఈ లక్ష్యసిద్ధి కుపాయ మేమన, లోపల నేకమైన దైవము అందఱివద్దను మేలుకొని యందఱిచేత నావిష్కృతమయి తన్మూలమున మానుష్యకము యొక్క ఏకీభావమును సాక్షాత్క రించుటయే.

మన యందఱిలోపలనున్న ఈశ్వరసామ్రాజ్య మును స్థాపించుటవలన నేకత్వమును సృజించుట—యని వేఱువిధముగ దీనిం జెప్ప నగును.

కావున నత్యంతోపయుక్తమైన కర్తవ్యము ఇదియే:

౧. ఒక్కొక్కడును ప్రత్యేకముగ తన లోనున్న దైవసాన్నిధ్యము నెఱింగి తద్భావమును బొందియుండుట.

౨. మనుజునియం దింతవఱకు ఎప్పుడును చేతన లేక యుండి వచ్చిన స్థితివిశేషములను ప్రత్యేకపఱచి, దాని మూలమున భూలోకమున కింతవఱకు తెలియకుండ ముద్రితములై యుండిన బ్రహ్మాండశక్తియొక్క తోటలలో నొకటితోనైన ననేకములతోనైన సంబంధ మేర్పఱచుట.

(శాస్త్రమునందు అన్నమను నది జడము, భౌతికము. మానవుడు ఒక వ్యక్తిగ నున్నను, అతనికి అన్నమయము ప్రాణమయము మనో మయము మొదలైన అనేక భాగము లున్నవి. వీనిలో ననేకములు

ఒకవ్యక్తి నాశ్రయించి యుండినను. అప్రకాశములై స్వబోధలేక సంకీర్ణములై యున్నవి. వీనిని ప్రత్యేకపఱుచుట యనగా ఒక్కొక్క భాగమును స్వబోధగలదై ఒకవిధమైన వ్యక్తిగ నగును అని భావము. ఒక మానవునియందు అన్నమయపురుషుడు, ప్రాణమయపురుషుడు, మనోమయపురుషుడు, విజ్ఞానమయపురుషుడు మొదలైన వ్యక్తులు ప్రత్యేకస్థితిం బొందుట ఒక గొప్పకార్యమునకు సాధన మగును. బ్రహ్మాండశక్తియొక్క విశిష్టాంశములతో భూలోకమునకు సంబంధ మేర్పడును. ఇంతవఱకు భూమితో సంబంధ మేర్పడకున్న ఆశక్తియొక్క మూలస్థానములతో భూమికి సంబంధ మేర్పడవలయును. దానికి ఉపాయము మానవవ్యక్తియందు గల అనేక భాగములు ప్రకాశ మొంది ప్రత్యేకముగ వ్యక్తమగుటయే. పిండాండమునందు ఏస్థితి వ్యక్త మగుచున్నదో దానికి అనుగుణముగనున్న బ్రహ్మాండశక్తితో దానికి సంబంధము సిద్ధించుట సహజము.)

3. తాత్కాలిక మనోభావమునకు తగినట్లు నూతన రూపమున సనాతనమైన వాక్కును వచించుట.

అది మానుష్యకముయొక్క సకల జ్ఞానముయొక్క సంయోగ మగును.

4. సాముదాయికముగ (చేయవలసిన దేమనగా), ఒక నవ్య వంశము, ఈశ్వరకుమారుల వంశము, ఉద్భవిల్లి వికసించుట కొరకు భవ్యస్థలమున నాదర్శభూతమైన సంఘమును స్థాపించుట.

*  *  *

భూలోకమునందు ఏర్పడవలసిన పరివర్తనము (మార్పు)సమరసత్వమును రెండు విధానములచేత సాధ్యము కానగును; అవి రెండు నొకటికొకటి విరుద్ధముగ దోచినను పరస్పరము చేరి వ్యాపరించి పరస్పరపూరకములు కావలెను.

౧. ప్రత్యేక వ్యక్తియొక్క పరివర్తనము, దైవ సాన్నిధ్యముతో నైక్యమునను గొనిపోవు సంతర రభివృద్ధి.

౨. సాంఘికపరివర్తనము, పురుషవ్యక్తి యభివృద్ధి బొంది వికసించుట కనుకూలమైన చుట్టుప్రక్కల పరిస్థితిని యేర్పరచుట.

పరిసరము (చుట్టుప్రక్కనుండు బాహ్య పరిస్థితి) పురుషవ్యక్తి యందు వ్యాపరించుటవలనను, పరిసరము యొక్క మదింపు వ్యక్తియొక్క మదింపుపై నాధారపడి యున్నందునను, (పైజెప్పిన) రెండు కార్యములును (ఏక కాలమున) ప్రక్కప్రక్కనే నడవవలెను.

అయినను, ఇది కర్మలను విభజించుటవలన సాధ్యమగును. దానికి, సాధ్యమైనచో, నధికారక్రమాధీనమైన ఒక వర్గము ఏర్పడవలసినది యావశ్యకము.

ఆవర్గమునం దంగములుగ నున్నవారి కార్యము త్రివిధముగ నుండవలెను:

౧. పొందవలసినలక్ష్యమును తనలోనే తాను సాక్షాత్కరించుట: అచింత్యము (బుద్ధికి అగోచర మగు పరవస్తువు)యొక్క సకలగుణములతోను, విశేషములతోను ప్రకారములతోను దాని యావిర్భావమునకు భూమి యందు పరిపక్వమైన ప్రతినిధి యగుట.

౨. ఈ లక్ష్యమును ప్రవచనముచేత బోధించుట, కాని, అన్నిటికంటె, దీనిని అనుభవములో తాము ఎఱిగి (పరులకు) విమోచనము నుద్ఘోషించుటకు సిద్ధముగ నున్న వారలను గన్పట్టుటకై తమ యాచరణచేత బోధించుట.

౩. ఒక యాదర్శసంఘమును స్థాపించుట, లేనిచో, నిప్పటికున్న సంఘములను సంస్కరించి వ్యవస్థపఱచుట.

* * *

ప్రతి పురుషవ్యక్తికిని, ఏకకాలమున అన్యోన్యోప కారకము అన్యోన్యపూరకము నగు ద్వివిధ కార్యమున్నది:

౧. లోపలి యభివృద్ధి, క్రమశః దివ్యజ్యోతిస్సుతో నైక్యము, ఈ యొక్కస్థితియందే విశ్వజీవితముయొక్క

మహాప్రవాహముతో మనుజుడు సమరసభావమును బొంది యుండగలడు.

౨. ఒక బాహ్యకర్మ నొక్కొక్కడును తన సామర్థ్యానుసారముగ తన రుచికి దగినట్లు వరించవలెను; తనస్థానమును తాను కనుగొనవలెను. (జీవిత మనెడి) సామాన్యమైన సంగీతమునందు తన (విశేష)స్థానమును తాను పొందవలెను, దానికై తన్ను సంపూర్ణముగ నిచ్చుకొనవలెను. (భూలోకజీవిత మనెడి) సంవాదమునందు తా నొక స్వరము నే వాయించును, అట్లయినను సమస్తము (సంగీతము) యొక్క సంవాదమునకు తన స్వరము అనివార్యము, దానియొక్క (విలువ)మదింపు తన యుక్తతపై నాధారపడి యున్నది, అనియు మఱవగూడదు. (యుక్తత యనగా అపస్వరాదులు లేకుండ ఎట్లుండవలెనో యట్లుండుట.)

౧

మనలోని దైవమునకు బొత్తిగ నివేదితముకాని సర్వమును, మనయందలిది, ఖండఖండములుగ మనలను చుట్టియున్న సర్వవస్తు సముదాయములకు సొంతమగుచున్నది; అవి(వస్తువుల సముదాయములు) "మనము" అని అన్యాయ్యముగ అనుకొను వానిపై సాక్షాత్తుగ మనస్సుమూలముగ సూచనవల్లనో మధ్యస్థమైన ఇంద్రియ ద్వారముననో పడి వ్యాపరించుచున్నవి.

స్వాస్థ్యమును బొంది యెఱుకగలపురుషు డగుటకు ఒక్కటే మార్గము; ఎల్లరయెడ నున్న ఈశ్వరాత్మతో నైక్యమును జెందియుండుటయే యది. అందులకు, ఏకాగ్ర ధ్యానమువలన మనలను బాహ్య ప్రవృత్తుల నుంచి ప్రత్యేకపఱచుకొనవలెను.

నీవు లోపలనున్న దైవముతో నేకుడవైయున్నప్పుడు, నీవు అన్నివస్తువులతోను వానిలోతులయందును చేరి యేకుడవైయున్నావు దాని మూలముననే, దాని

చేతనే, వానితో సంబంధమును గలిగించుకొనవలెను. అపుడు నీవు రాగవిరాగములు లేకుండ ఏది దానికి (దైవమునకు) సమీపమున నున్నదో దానికి సమీపముగను, ఏది దానికి (దైవమునకు) దూరముగనున్నదో దానికి దూరముగను ఉన్నవాడ వగుదువు.

పరులమధ్య జీవితము నడుపుచు వారలకు నీవు ఒక దివ్యనిదర్శనముగ నుండవలెను; దివ్యజీవనమార్గము నెఱింగి యందు వారు ప్రవర్తించుటకు నీవొక అవకాశముగ నుండవలెను. ఇంతకంటె నధిక మేదియు లేదు. వా రభివృద్ధి బొందవలెనను కోరిక కూడ నుండగూడదు, ఏలన నదియుగూడ నొకవిధముగ స్వచ్ఛందాచరణ మగును.

నీలోనున్న దైవముతో సునిశ్చితముగ నేకీభూతుడవగు వరకు నీకు బాహ్యముతోడి సంబంధములయందుత్తమపద్ధతి యేమనగా, ఈ ఐక్యానుభవముగల వారి యొక్క యేకకంఠోపదేశానుసారముగ నాచరించుటయే.

ఎల్లప్పుడును పరహితేచ్ఛను నియమముగ బెట్టుకొని, దేనిచేతను బాధితుడుకాక, ఇతరుల బాధకు కారణముగ నుండక, సాధ్యమైనంతవఱకు ఇతరులకు వేదన నియ్యకుండుటయే (పై జెప్పిన యుపదేశము).

ఒక్కొక్క ప్రాణియు తన్ను తెలిసికొని తన్ను సంపూర్ణముగ వశము జేసికొనినయెడల నది యొక యమూల్యమగు స్వామ్య మగును. తన్ను తెలిసికొనుట యనగా తన క్రియలయొక్కయు ప్రతిక్రియలయొక్కయు నుద్దేశములం దెలిసికొనుట. ఒక్కొక్క సంభవమును తన యెడ నెందులకు ఎట్లు సమావేశ మగుచున్నదని యెఱుం గుట. తన్ను వశపఱచుకొనుట యనగా, తాను తీర్మానిం చిన దానిని జేయుట, దానిం దప్ప మఱి దేనినిం జేయ కుండుట, దాని కన్యములైన ప్రేరణలను కోరికలను కల్పనలను వినకుండుట, అనుసరించ కుండుట.

ఒక బాలునకు ఆచరణనియమము (నీతివిధిని) నుప దేశించుట ఆదర్శభూతమైన విషయము కాదనుట స్పష్టమే; కాని యట్లు చేయకుండుట చాల కష్టము. బాలుడు

పెరుగునపుడు, సాంఘికధర్మములు నైతికవిధులు నన్నియు సాపేక్షములు (దేశ కాల నిమిత్తముల నపేక్షించినవి, స్వతంత్రములు నిత్యములు కావు), అని వానికి బోధింప దగును. అందువలన వాడే తనలోనే దానికంటె ఉత్తమ మైనదియు సత్యమైనదియు నైన విధిని గనుగొనవచ్చును. కాని, ఇచ్చట చాల పర్యాలోచనపూర్వకముగ, సత్యమైన ధర్మమును కన్పట్టుటయందు గల కష్టమును ఊర్జితముగ జెప్పవలెను. మానుష్యకముయొక్క విధులను దూరీక రించి తమ 'ఇచ్ఛానుసారముగ జీవించుటకు' తమ స్వాతంత్ర్యమును తీర్మానము నుద్ఘోషించువారలలో భూరి సంఖ్యాకులు సామాన్య జీవనప్రవృత్తులకు నణగియే యట్లు చేసెదరు; వానిని దాచుకొని తమదృష్టికి లేకపోయిన నితరుల దృష్టికైన అది (ఆ తమ తీర్మానము) న్యాయ్యమని చూప యత్నించెదరు. కేవలము తమ పశువృత్తిప్రేరణలకు విఘ్నముగ నున్నదనియే ధర్మమునకు (నీతికి) పాద ప్రహార మిచ్చెదరు.

నైతిక సాంఘిక ధర్మములకు పైగ వెళ్లి సుఖా సీనుడై యుండిన గాని ఎవడును వానిపై తీర్పు చేయు

టకు అధికారము గలవాడు కాడు. వానిస్థానమునకు వాని కంటె నుత్కృష్టమైన దొకదాని నుంచినగాని వానిని ఎవ డును నదలివేయ లేడు. అది యంత సులభము గాదు.

ఎట్లయినను, ఒక బాలునికి ఒసంగదగిన యుత్తమ బహుమతి ఏమనగా వానికి, తన్ను తాను దెలిసికొని, తన్ను స్వవశునిం గావించుకొనుటకు నేర్పుటయే.

# 3

ప్రపంచమునందలి ప్రకృతియొక్క ప్రవృత్తులకు దృఢముగ న్యాయయుక్తమయిన నియతవిధి యున్నది; అదియే ధర్మ మనబడును.

అన్నమయ శరీరమునకు సంబంధించిన నియత విధియే (శారీరక)వ్యాధులు. దుర్నివారమైన యీనియత ధర్మము నాధారముగా నుంచుకొని వైద్యశాస్త్రము న్యాయానుసారముగ మంచి యారోగ్యము నియ్యగల స్థితులను సాధించుటకు బూనుచున్నది.

ఇదేప్రకారము ధర్మవిషయకప్రజ్ఞ సంఘశరీరము నందును, తపస్య అధ్యాత్మవిషయమునందును ఆచరించు చున్నది.

ఈ విశ్వగతధర్మముయొక్క పోకడను, మధ్య ప్రవేశించి మార్చుటకు దైవకృప కొక్కటికే సామర్థ్య మున్నది. దైవకృపను భూలోకమందు ఆవిష్కరించుటయే అవతారముయొక్క గొప్ప కార్యము. అవతారముయొక్క శిష్యుడుగ నుండుట దైవకృపకు ఉపకరణ మగుటయే. విశ్వగత ధర్మముయొక్క సంపూర్ణవిధానముతో నేకీభావము మూలమున (దానివిషయమై) పూర్ణజ్ఞానముతో గూడిన శ్రీమాత, దైవకృపతో నైక్యము మూలమున దానిని (ఆ కృపను) వినియోగించునదియై యున్నది.

(ఐక్యము ఏకీభావము తాదాత్మ్యము, ఇవి ఏకార్థములు. ఎది జ్ఞేయమో దానితో నైక్యము వల్లనే తద్జ్ఞానము పూర్ణముగ గల్గును. మాతకు ధర్మవిధానముతో నైక్యము కలదు. కావున, తద్జ్ఞానము పూర్ణముగ గలదు; అట్లే దైవకృపతో నైక్యము కలదు. ధర్మవిధానము న్యాయపరతంత్రము, దైవకృప స్వతంత్రము, కారుణ్యపరతంత్రము. ఇవి పరస్పర విరుద్ధములుగ ఉన్నను, రెంటితోను ఐక్యము జ్ఞానమును గలది మాత.

ధర్మవిధానము న్యాయము ననుసరించినది, అనుల్లంఘనీయము, అందఱును దానికి లోబడవలసినదే; దానికి లోబడనిది దైవకృపయే. మాతకు రెంటితో నైక్యరూపమున రెంటిజ్ఞానము ఉన్నందున, ధర్మవిధానమును అతిక్రమించి దైవకృపను వినియోగించుటకు సామర్థ్యము కలదు.)

దైవోన్ముఖముగ ఆర్జవముతోను దృఢప్రత్యయముతో నుద్గమించు ఉత్కాంక్షయొక్క ఒక్కొక్క ఉద్యమమును దైవకృపను (ప్రార్థనను) ప్రత్యుత్తరముగ నిచ్చుటకే ప్రాప్తముం గావించును. ఓప్రభూ! ఎవడు నీసమక్షమున నిలిచి "నే నేతప్పును చేయలే' దని హృదయపూర్వకముగ జెప్పగలడు? ఒకనాడు ఎన్నిమాఱులు నీకార్యమునకు విరుద్ధముగ తప్పులు చేసెదము, నీ కృపయు నెల్లప్పుడును వానిని మాపుటకు వచ్చుచున్నది!

నీకృప అనవరతము మధ్యప్రవర్తించనిచో, విశ్వగతధర్మముయొక్క చట్టమనెడి కత్తికి ఎవడు అడుగడుగునకు లోబడడు?

ఇచ్చట నొక్కొక్కడును సాధనీయమైన యొక యసాధ్యమయినదానికి ప్రతినిధి; కాని నీ దివ్యకృపకు అన్నియు సాధ్యము, సమస్తమందును వ్యస్తమందును అసాధ్యముల నన్నింటిని దివ్యసాక్షాత్కారరూపములుగ మార్చి నెరవేర్చుటయే నీకార్య మగును.

౪

ఈ జగత్తు ఒక సంకరము! ఇందు తమః ప్రకాశములు, సత్యాసత్యములు, జీవిత మరణములు, కురూప సురూపములు, ప్రేమ ద్వేషములు, ఇవి (ఇటువంటిద్వంద్వములు) ఒకటితోనొకటి దట్టముగ నల్లుకొని చిక్కుకొని యున్నవి. వానిని ఒకటినుండి మఱియొక్కటిని ప్రత్యేకముగ నెఱుగుటయే బహుశః అసాధ్యము. వానిని ప్రత్యేకపఱచి (విడదీసి) పరస్పరసమాశ్లేషమును అంతరింపజేయుట దానికంటె నసాధ్యతరము. అది (ద్వంద్వముల సమాశ్లేషము) ఒకదారుణమైన యుద్ధము, ఘోరమైనది, విశేషముగ మానవప్రజ్ఞయందు గూఢముగ నున్నందున అత్యంత తీవ్రముగ నున్నది. మానవప్రజ్ఞయందు ఈ పోరాటము, జ్ఞానము, శక్తి, జయము, వీనికై మనుజుడు పడు వేదనగ మారుచున్నది; దుఃఖప్రదము నప్రకాశము నగు నీద్వంద్వయుద్ధమున కంతమే లేనట్లు తోచుచున్నందున ఘోరతరము. కాని దానికి ఒక నివారణోపాయము శక్యము. అది ఇంద్రియజ్ఞానములకును, సుఖదుఃఖాద్యుపలబ్ధులకును, మనోవృత్తులకును, పైన మనోభూమికి ఆవల ఈశ్వరప్రజ్ఞయందే (ఉన్నది).

౫

పునర్జన్మమునందు, మరల బుట్టువాడు బాహ్య పురుషుడు కాడు. అనగా, తల్లితండ్రుల చేతను, చుట్టుప్రక్క నుండు పరిసరము చేతను, సందర్భ విశేషముల చేతను రూపెత్తు మనఃప్రాణశరీరములు కావు. చైత్యపురుషుడు మాత్రమే దేహమునుంచి దేహమునకు ప్రయాణించువాడు. కావున, న్యాయము ననుసరించగ, మనోమయుడు గాని ప్రాణమయుడుగాని అతీతజన్మలను జ్ఞప్తిపఱచుకొనుటకో, లేక, ఒక పురుషవిశేషుని జీవితప్రకారమువల్లనో, గుణమువల్లనో, తన్ను గుర్తెఱుంగుటకో వలనుపడదు. చైత్యపురుషుని కొక్కనికే జ్ఞప్తిసామర్థ్యము కలదు. చైత్య పురుషుని ఎఱుంగుట చేతనే, మన పూర్వజన్మవిషయమై యున్నది యున్నట్లు తెలిసికొనగలము. అదియు గాక, మనము ఏదిగ నుంటిమో దానిపై దృష్టినుంచుటకంటె నేది కాగోరెదమో దానిపై దృష్టినుంచుట మిగుల ముఖ్యము.

# ౬

దైవమునకు తన్ను అర్పించుకొన్నవానికి, ఆ నివేదనమును ఉత్తరోత్తరము పూర్ణముగ జేయుటకంటె వేఱొకధర్మము (కర్తవ్యకర్మ) లేదు. ఈలోకము, అందు వసించువారును దైవమునకై ఆచరించవలసిన ధర్మముకంటె సంఘమునకు కుటుంబమునకు సంబంధించిన మనుజధర్మమును ముఖ్యముగ నెంచి దాని కగ్రస్థాన మిచ్చెదరు. దైవార్థధర్మమును అహంభావమని దూషించెదరు. ఈశ్వరవాస్తవానుభవశూన్యులైన వారు ఎట్లు వేఱువిధముగ నిర్ణయింతురు? అయినను ఈశ్వర దృష్టియందు వారి యభిప్రాయమునకు మదింపు లేదు. వారి ఇచ్ఛాబలమునకు వీర్యము లేదు. ఇవి అవిద్యాప్రవృత్తులు, మఱేవియు కావు. నీవు (అటువంటివారలను) సమాధానపరచుటకు ప్రయత్నించగూడదు; దానికంటె ముఖ్యము, నీవు (వారిచేత) అబాధ్యుడవై, అధృష్యుడవై యుండవలెను. నీవు ఆత్మనివేదన మను దృఢమైన దుర్గమందు జాగ్రత్తగా నిన్ను రక్షించుకొని, దైవమువద్దనుంచియే సాహాయ్యము, రక్ష

ణము, మార్గోపదేశము, సమ్మతి, వీనిని ప్రతీక్షించవలెను. దైవముయొక్క సమ్మతియు, ఆలంబము నున్నవని యెఱుంగు వానిని లోకమంతయు నిరాకరించినను, వానికి అదియంతయు నలక్ష్యముగనే యుండును.

మఱియు మానవజాతి తనస్థితిని చక్కగ వ్యవస్థపఱచి పెట్టుకొనుటకు బొత్తిగ నసమర్థముగా నున్నదని నిరూపించియుండలేదా? రాజ్యాంగముల కనంతరము రాజ్యాంగము, పరిపాలనల కనంతరము పరిపాలనలు, శతాబ్దముల కనంతరము శతాబ్దములు గడచుచున్నవి; కాని మానవదుఃఖము మాత్రము శోచనీయమై యట్లే నిలిచియున్నది మనుజుడిపుడున్నట్లు అంధుడై అజ్ఞుడై అధ్యాత్మ సత్యమునకు నిమీలితుడై యున్నంతకాలము అది ఎల్లప్పుడును అట్లే నిలుచును. * రూపాంతరపరిణామము మానవ

---

* రూపాంతర పరిణామము : ఉన్నరూపము పరిపాకవశంబున వేఱురూపము అగుట. అజ్ఞత్వాదులు ఏ మానుషరూపమున గలదో దానికి పాకవశమున మార్పు గలుగునపుడు అజ్ఞత్వాదు లుండవు.

మానవప్రజ్ఞా ప్రకాశనము: చీకటియందుండు మానవచేతనను వెలిగించుట; ఇది దైవజ్యోతియొక్క కార్యము: మానవచేతన ప్రకాశితము కానప్పుడు రూపాంతర పరిణామము సిద్ధించదు.

ప్రజ్ఞాప్రకాశనమును మాత్రమే మానుష్యకముయొక్క యీస్థితికి శ్రేయస్సును సాధించును. ఈవిధమున, మానవ జీవితమునే ముఖ్యముగ నుంచుకొనిచూచినను మనుజుని ప్రథమకర్తవ్యము ఈశ్వరజ్ఞానము నన్వేషించి పొందుటయే యని సయుక్తికముగ నేర్పడును.

దైవమును వర్జించి జీవితము దుఃఖప్రదమయిన యొకభ్రమ, దైవముతో నంతయు నానందము.

*　　　*　　　*

దైవముయొక్క బాహువులయం దాశ్రయము నవలంబించుటచేత నన్నికష్టములును తీరిపోవును, ఏలన, ఈబాహువులు సంతతము ప్రేమతో మనకాశ్రయమిచ్చుటకై విస్తృతములై యున్నవి.

*　　　*　　　*

దైవాభిముఖముగ దిరుగుము, నీ సర్వపీడలును తొలగును.

*　　　*　　　*

దైవమునకు హృదయపూర్వకముగ నాత్మనివేదన మొనర్చుటవలన, మానవులకు సహజమైన మన బాధల నుండి మనము నిర్వృతిం బొంద నగును.

*　　　*　　　*

శాంతి అమితమై యుండవలెను, అచంచలత గభీరముగ నిష్పన్నముగ నుండవలెను, స్థైర్యము అప్రధృష్యము కావలెను, దైవమునందు నమ్మకము ఎల్లప్పుడును వృద్ధియగుచు నుండవలయును.

*　　　*　　　*

దైవమునెడ కృతజ్ఞతను జూపుటకు నెమ్మదిగ సంతుష్టితో నుండుటకంటె వేఱు చక్కనిమార్గము లేదు.

*　　　*　　　*

దైవముచేత నీకియ్యబడుదాని నెప్పుడును సంతోషముతో నంగీకరించుము.

*　　　*　　　*

సర్వమును స్వర్ణము స్వర్ణము స్వర్ణము; అవిచ్ఛిన్న ధారగ వర్షించు హిరణ్మయజ్యోతిస్సుయొక్క ప్రవాహము; దేవతలమార్గము సూర్యప్రకాశజ్వలితము, అందు కష్టములకు యాథార్థ్యములేదనుజ్ఞానమును అది ప్రవాహము తనతో దెచ్చుచున్నది.

ప్రవేశింప గోరుదుమేని మన ముందట యుండు మార్గ మటువంటిది.

*　　　*　　　*

మబ్బులపై సూర్యునివ్యాపార మెట్టిదో, అట్టిదే కష్టములపై మందస్మితముయొక్క వ్యాపారము; అది వానిని చెదరగొట్టును.

శత్రువునెడ జూపు చిఱునగువు వానిని నిరాయుధునిం గావించుట.

* * *

జితాత్మతయే (ఆత్మస్వామ్యము) అత్యుత్తమమైన జయము, అది సకల శాశ్వత సుఖమునకు ఆధారము.

* * *

స్వసుఖమునకై తలపోయుట అసుఖి యగుటకు సునిశ్చితమైన మార్గము.

* * *

సౌఖ్యము కాదు జీవితలక్ష్యము.

సాధారణ జీవితముయొక్క లక్ష్యము (ధర్మమను) కర్తవ్యమును అనుష్ఠించుట, ఆధ్యాత్మ జీవితముయొక్క లక్ష్యము దైవమును సాక్షాత్కరించుకొనుట.

* * *

మన సౌఖ్యమును అబాధితముగను శుభ్రముగను నుంచుకొన గోరుదుమేని, దానిపై నప్రియ చింతలు

పడి ఆకృష్టములు గాకుండునట్లు యథాశక్తి చూచుకొన వలెను.

*　　*　　*

శాన్తియు నిశ్చలతయు రోగములకు గొప్పచికిత్స. దేహమునందు ప్రత్యణువునకును శాంతిని దెచ్చుటకు శక్తుల మగుదుమేని, మనము స్వస్థులము కాగలము.

*　　*　　*

మనస్సునుండి యెంత తీవ్రముగ నస్వతమును బహిష్కరించెదమో, అంత తీవ్రముగ దేహము రోగమును బహిష్కరింపవలెను.

*　　*　　*

ఇప్పటికిని సౌఖ్యమును ఆరోగ్యమును ఈ లోకమునకు సాధారణ స్థితులు కావు.

వానిని తత్ప్రతిద్వంద్వల (విపక్షముల) దురాక్రమమునుండి జాగ్రత్తతో రక్షించవలెను.

*　　*　　*

చైత్యము నిరంతరసౌఖ్యమునకు మూలస్థానము.

*　　*　　*

శ్రీ మాతృ వాక్కులు

భూలోక జీవియందు చైత్యము తప్ప మరేదియు శాశ్వతము కాదు.

*　*　*

దివ్యజీవితమందు కళను ఒకింత నావిష్కరింపవలయునేని, అందును విశాలమును ప్రకాశము నగు శాంతి స్పష్టము కావలెను.

*　*　*

దైవమునందు మన నమ్మకము వెలుపలి సందర్భములపై నాధారపడ రాదు.

*　*　*

దైవము నెఱుగుటకు నేమాత్రము మనకు స్వాభిరుచి యుండరాదు.

*　*　*

దైవమును యథార్థముగ ప్రేమించుటకు మనము సంగముల నతిక్రమించి పైకి వెళ్లవలెను.

*　*　*

దైవప్రేమయొక్క స్వరూపము బోధమగుటకు మనము ఇతరప్రేమ నంతను బరిత్యజింపవలెను.

*　*　*

పాపము దైవము! అతనిపై ఎన్ని ఘోరము లారోపితము లగుచున్నవి!

ఈ దూషణలే వాస్తవము లగునేని, ఎవడు, వాస్తవముగ కారుణ్యమయుడో, అతడే ఎటువంటి ఘోరుడుగా (రాక్షసుడుగ) నుండ బోలును!

*　　*　　*

సాగరమునకేసి నది ప్రవహించునట్లు దైవమున కేసి మన మనోవృత్తులన్నియు, మన భావములన్నియు నడుచును.

*　　*　　*

దైవసాక్షాత్కారము, ఇది యొక్కటియే మన జీవితమున కావశ్యక మగుగాక.

*　　*　　*

నీయాత్మయొక్క విశ్వాసమునకు దైవ మొక్కనినే పాత్రముగ నుంచుకొనుము.

*　　*　　*

ఈశ్వరుని యిచ్ఛయే మనయిచ్ఛగావలెను. ఇదియే ఉత్తమ రహస్యము.

*　　*　　*

దైవమునే ధ్యానించుము, అపుడు దైవము నీతో నుండును.

*　　*　　*

## శ్రీ మాతృ వాక్కులు

మన జీవితమంతయు దైవమున కర్పితమయిన ప్రార్థనగా నుండవలెను.

*　　*　　*

దైవార్థము ఆచరించు కర్మయే కాయికప్రార్థన (శరీరముతో జేయుప్రార్థన).

*　　*　　*

మనము ఈశ్వరకైంకర్యమునందు దక్క, ఇంకే కైంకర్యమునందును వర్తించగూడదు.

*　　*　　*

నీ వెంత దైవమున కర్పించితివో అంతకంటె నీకు ఎక్కువ మదింపు దైవదృష్టియందు లేదు.

*　　*　　*

దైవమున కర్పితమయిన దానిని తప్ప మఱియేదియు సురక్షితము గాదు.

*　　*　　*

యాత్ర యెంత దూరమైనను, యాత్రికుడు ఎట్టి గొప్పవాడయినను నంతమున దైవకృపయే ఏకాశ్రయమై కనబడును.

*　　*　　*

మనకు ఆధ్యాత్మికాభివృద్ధి నిశ్చితమైనప్పుడు, దైవముయొక్క వైరులు అదృశ్యులు తమ వైరనిర్వాహణముకై సంతతము యత్నింతురు; ఆత్మకు కీడు జేయ లేరేని, దేహమును గొట్టుదురు. కాని వారి ప్రయత్నము లన్నియు వ్యర్థములు, దైవకృప మనతో నుండుటవలన కట్టకడపట నవన్నియు పరాజితము లగును.

*　　　*　　　*

దైవకృపనే ఆశ్రయించుటకును, దైవసాహాయ్యమును సర్వసందర్భములలోను పిలుచుటకును మనము నేర్చుకొనవలెను. అప్పు డది యనవరతము అద్భుతములను బన్నును.

*　　　*　　　*

మన యిచ్ఛను దైవకృప కర్పింతము గాక అన్నింటిని నిర్వర్తించునది ఆకృపయే.

*　　　*　　　*

దైవమునందు మనకు ఎంత విశ్వాసము కలదో, తదనుగుణముగనే దైవము మనకై పనిజేసి సాయపడును.

*　　　*　　　*

దైవకృపయందుంగట ఎవఁడు అర్హుఁడు, ఎవఁడు అనర్హుఁడు ?

ఎల్లరును ఒకే తల్లియొక్క బిడ్డలు.

ఆమె ప్రేమయందఱిపైనను సమానముగ వితతమై యున్నది.

కాని ప్రతివానికిని వాని స్వభావము ననుసరించియు, గ్రహణసామర్థ్యము ననుసరించియు నామె యొసగును.

*　　　*　　　*

దైవమునకు మనలను మనము నిశ్శేషముగ నర్పించుకొందము గాక! ఆవిధముననే మనము దైవకృప నత్యుత్తమముగ బడయగలము.

*　　　*　　　*

లోకరక్షార్థము పురుషు (పరమపురుషుఁడు) తన కృపను ఇట నంపియున్నాఁడు.

*　　　*　　　*

ఎప్పుడును ఎగువకు దిగువకు రెండువైపులకును కొండదారి కొనిపోవును—మన వెనుక దేనిని వదలివచ్చెదమో దానిపై నంతయు నాధారపడును.

*　　　*　　　*

అప్రకాశమైన భౌతిక ప్రకృతిపై మనము పొందు నొక్కొక్కజయమును రానున్న మహత్తర జయమునకు దృఢసూచన.

* * *

విశ్వము సంతతము ముందు నడుచుచుండగా, సాధితమయిన సిద్ధి యొక్కొక్కటియు క్రొత్తదియు మిగుల గొప్పదియునైన సాక్షాత్కారమునకు మొదటి మెట్టె యగును.

* * *

కోరికను బూర్తిజేయుటకంటె దానిని జయించుట అధికతరమయిన ఆనందముం దెచ్చును.

* * *

ప్రకటనోత్సాహమును (ఆడంబరమును) బలపఱచు సర్వమును దూరీకరించుటకై మన మెల్లప్పుడును జాగ్రత్తతో నుండవలెను.

* * *

నీవద్దనుండి ప్రచండతను బహిష్కరించినప్పుడే నీవు భీతినుండి బొత్తిగ విముక్తుడవు కాగలవు.

* * *

వాస్తవమైన ధైర్యమునందు ఓర్పులేమిగాని సాహసముగాని యుండదు.

* * *

ధైర్యము ఆత్మయొక్క ఉదాత్తతకు లక్ష్యము.

మఱి యది శాంతముగను స్వాధీనతతోను, ఉదారముగను హితైషిగను ఉండవలెను.

* * *

తన లోపముల గనుకొనుట ఉదారతమమైన ఒక ధైర్యము.

* * *

అపవాదముల రక్షతో నీర్ష్య బలహీనులయొక్కయు అల్పులయొక్కయు కాన్పు.

• అది మనకోపమునకంటె దయకే యర్హము. అక్షోభ్యమైన నిశ్చయముయొక్క ఆనందము ననుభవించు మనము దానిచేత నబాధితులమై (దానికుదాసీనులమై) యుండవలెను.

* * *

తిరస్కార దూషణల కుదాసీనుడై యుండుట మనుజునకు మహత్త్వ మిచ్చును.

*　　　*　　　*

ఎల్లప్పుడును సత్యమును వచించుట యాభిజాత్యమునకు ఉత్కృష్టమైన గౌరవలాంఛనము.

*　　　*　　　*

కళయందు గూడ మన మెప్పుడును శిఖరముల యం దుండవలెను.

*　　　*　　　*

ప్రశస్తమైనరుచి ఉత్కృష్టమైన కలా వైభవమగును.

*　　　*　　　*

(స్థూలము) భౌతికమునందు సౌన్దర్యము, మానసమునందు జ్ఞానము, ప్రాణమునందు బలము, చైత్యమునందు ప్రేమ, వీనిద్వారమున దైవము స్పష్టమగును.

మనము చాలినంతపైకి పోవునప్పుడు (పైజెప్పిన) ఈ నాలుగు అంశములును ఒకటిలోనొకటి కలిసిపోయి ప్రకాశమును, శక్తిమంతమును, సుందరమునై నదియు, సర్వాధారమును సర్వవ్యాపకము నగు ప్రేమభరితమైన

ఒకేచైతన్యము అని గానవచ్చును. విశ్వలీలార్థమే యీ ఒకేచైతన్యము ఆవిష్కారముయొక్క వివిధ పంథలుగ వివిధాంశములుగ విభక్తమగుచున్నది.

* * *

భూమియందు దివ్యసృష్టి సిద్ధించవలెనేని, దేవతలును పరమునకు (పరమపురుషునకు) స్వాత్మసమర్పణము జేయవలెను.

* * *

అవిద్యయందు మానసికాభిప్రాయములు ఎల్లప్పుడును పరస్పరము విరోధించును.

సత్యమునందు అవియే ఉత్తరజ్ఞానములోని పరస్పర పూరకాంశలై యుండును.

* * *

ప్రతియొక్కనికి, ప్రతియొక్కతెకు, గ్రహణశక్తి ననుసరించి విషయములు చెప్పబడును.

కావున నొకరి కియ్యబడిన జ్ఞానము ఇంకొకరికి ఉపయుక్తముగాని శ్రేయస్కరముగాని కాకపోవచ్చును.

ఈ కారణముచేతనే ప్రత్యేకముగ నియ్యబడిన గురూపదేశము అన్యులకు దెలుపరాదు.

*　　　*　　　*

పాత్రను క్రొత్తగ నింపుటకు, అది అప్పు డప్పుడు వట్టిది కావలెను.

మన మత్యధికముగ గ్రహించుటకు సిద్ధమగు నపుడు, ఈ రిక్తత (వట్టిగనుండుట) అనుభవ మగుచున్నది.

*　　　*　　　*

ప్రకృతియొక్క శక్తు లనబడునవి తమ యాకారమానముచేతను తమ యధికారముననున్న సామర్థ్యముల చేతను మనుజునికొలది నతిక్రమించిన సత్త్వవిశేషముల బాహ్య వ్యాపారములే.

*　　　*　　　*

ఒకానొక సూక్ష్మజగ త్తున్నది. అందు చిత్రలేఖనము, నవలలు, నానావిధనాటకములు, "సినీమా" కూడ, వీనికన్నింటికి యోగ్యములైన విషయములను గానదగును.

## శ్రీ మా తృ వా క్కు లు

అచ్చుటనుండియే అనేకులు రచయితలు ప్రేరణను స్వీకరించెదరు.

*　　　*　　　*

విశ్వముయొక్క యద్భుతములకు అంతము లేదు.

మన మీ యల్పమైన యహంతయొక్క యెల్లల నుండి యెంత విమోచనము బొందుదమో, అంత ఈ యద్భుతములు మనకు ప్రకాశము లగును.

*　　　*　　　*

మన యహంతను మించుట సులభమైన కార్యము కాదు.

స్థూలప్రజ్ఞ (భౌతికచేతన) యందు దాని నతిక్రమించిన తర్వాతయు, మఱొకమారు దానినే యాధ్యాత్మిక ప్రజ్ఞయందు బహులీకృతమైనదానినిగ ఎదుర్కొందుము.

*　　　*　　　*

ఉత్కాంతు యను సూర్యుడు అహంతామేఘములను విలయనము జేయుగాక.

*　　　*　　　*

హృదయముయొక్క మౌనమందు స్థిరమైన ఉత్సాహాగ్ని జ్వలించును.

*　　　*　　　*

ప్రతిధ్యానమును క్రొత్తదై ప్రకాశక విశేషముగ నుండవలెను. ఏలన ఒక్కొక్క ధ్యానమందును క్రొత్త దేదో సంభవించును.

*　　　*　　　*

నూతనమైన ఒక్కొక్క ఉషస్సును నూతనాభివృద్ధిని సాధ్యముం గావించును.

*　　　*　　　*

వేగిరపడక ముందునకు చలించెదము, ఏలన భావిని గుఱించి మనకు నిశ్చయబుద్ధి కలదు.

*　　　*　　　*

తాను దేనిని ప్రేమించునో, దానిరూపై తాను మారును.

*　　　*　　　*

మనము ఏవస్తువులంగూర్చి చింతించెదమో, అవియే మనలను జుట్టుకొని యుండును.

*　　　*　　　*

ఎల్లప్పుడును విపత్‌శక్తులను గూర్చి చింతించుటయు భయపడుటయు అత్యంతాపాయకరమైన బలహీనత.

* * *

స్నాయువులను (నరములను)వలె ఏకాగ్రతను సంకల్పబలమును పెంపవచ్చును. అవి విధిప్రకారము శిక్ష చేతను, సాధన చేతను పుష్టి జెందును.

* * *

మన ప్రజ్ఞ పక్షిపిల్లవంటిది. దాని రెక్కల నుపయోగించుకొనుట కది నేర్చుకొనవలెను.

* * *

అహోరాత్ర మనవరతము (దైవ) సాన్నిధ్య మిట గలదు. నిశ్శబ్దముగ మనలోపలికి దిరుగుదుమేని చాలును, దానిం గన్పట్టగలము.

* * *

మనము లేఖిని మూలముననో వాక్కు మూలముననో ఒకయసత్యము, ఎంతయల్పమైనను, బయల్పడుట కొప్పుదుమేని లోపరహితులైన సత్యముయొక్క సందేశహారు లగుట కెట్లు ఆశించగలము? సత్యముయొక్క కింక

రుడు (చక్కగ దేరినవాడు,) అత్యల్పమైనదిగ నున్నను అయథార్థతను, అత్యుక్తిని, వికృతోక్తిని వర్జింపవలయును.

*　　*　　*

ఆర్జవ మం దున్నది జయముయొక్క నిశ్చయము.

ఆర్జవమా! ఆర్జవమా! ఎంత సుభగము నీ సాన్నిధ్యముయొక్క స్వచ్ఛత!

*　　*　　*

సరళతయందు ఒకగొప్పసౌందర్యము కలదు.

*　　*　　*

వేచియుండుట యెట్లో యెఱుగుట యన, కాలమును నీ కనుకూలముగ జేసికొనుట.

సహనముతో నెల్లప్పుడును సిద్ధిం గానవచ్చును.

పట్టుదలగల సంకల్పబలము సర్వవిఘ్నమును జయించును.

*　　*　　*

సిద్ధి యను నది అత్యుచ్చమనిగాని "పరాకాష్ఠా" యని గాని కాదు. అది ఒక సమతాస్థితి, ఒకసామరస్యస్థాపన.

*　　*　　*

సాహస ప్రేరణచేత పనికి దిగవలదు.

స్వవశములేని సాహసికుని జీవితము అవ్యవస్థితమై యుండును.

*　　　　*　　　　*

ఇద్దరు పోరాడునప్పుడు, ఇరువురయందును దోష ముండును.

*　　　　*　　　　*

స్థిరబుద్ధిచేత నెవరికి నెప్పుడును కీడుగల్గ లేదు.

*　　　　*　　　　*

వ్యర్థవచనములు జగత్తును బధిరముగా గావించి యున్నవి.

*　　　　*　　　　*

ఒకని మహత్త్వమును అతని కృతజ్ఞతాసామర్థ్య ము చేతనే కొలవవచ్చును.

*　　　　*　　　　*

ఒక యుపదేశము బొత్తిగ ఋజువై యుండిన మాత్రముననే లాభకరమగును, అనగా, ఆయుపదేశ మియ్యబడుసమయమున,తదనుసారముగ నాచరణ యుండ

వలెను. అభ్యస్తమైన (పలుమారులు చెప్పబడు) వచనములు, పలుమారు బయల్పడు తలంపులు హృదయపూర్వకములు కాజాలవు.

* * *

దైవచైతన్యమునందు లయమగుట కాదు లక్ష్యము. దైవచైతన్యము జడమునుం బ్రవేశించి దానిని మార్పు జేయనిచ్చుటయే లక్ష్యము.

* * *

ప్రభూ, నీవు లేకున్న జీవిత మొకఘోరము. నీప్రకాశము, నీ చేతన, నీ సౌన్దర్యము, నీ శక్తి ఇవి లేకుండ సర్వసత్తయు కుటిలమైన అసంగతమైన యొక ప్రహసనము.

* * *

ప్రభూ, మాగ్రహణమున కతీత మగునట్లు నీ ప్రేమ అంత గొప్పది, అంత ఉదారమైనది, అంత స్వచ్ఛమైనది. అది అమేయము, అఖండము. మేము ప్రణుతులమై దానిని బుచ్చుకొనవలెను; అట్లుండియు, మాలో నత్యంత దుర్బలులుగూడ, ఒకశిశువుగూడ నిన్ను సమీపింపగూడు

నట్లు, అంత మధురముగ దానిని (ప్రేమను) నుంచి యున్నావు.

*   *   *

ఓ ప్రభూ, ఉన్నది, కావలసినది, సర్వమునందును లోతులలో నెప్పుడును మార్పులేని నీదివ్య మంద స్మితము కలదు.

# మొదటి ప్రకరణము

"యోగమునుగుఱించి మా కేదైన జెప్పుదురా ?"

యోగము నీ కెందులకు కావలెను? శక్తిని సంపాదించుటకా? శాంతిని, మౌనస్థితిని బొందుటకా? మానవ సంఘసేవకొఱకా?

ఈ మార్గమునకై వచ్చితి వనుట కీ యుద్దేశములలో నేదియు జాలదు. ఈ ప్రశ్నకు నీవు సమాధాన మియ్యవలెను: దైవముకొఱకై నీకు యోగము కావలెనా? దైవమును విడిచి యుండుట యశక్యమగు నట్లు అంత నది నీ జీవితమందలి పరమసత్యమా? దైవము వినా నీవు ఉండుటకు అర్థము లేదు, అతడే నీ యునికికి హేతువు అని యెఱుగుదువా? అట్లయిన నీమార్గమునకు నీకు పిలుపున్న దనవచ్చును.

మొదట ఆవశ్యకమైనది యిది—దైవము కావలెనని తీవ్రమైన ఇచ్ఛ—ఉత్కాంక్ష.

తరువాత చేయవలసిన దేమనగా, నా ఉత్కాంక్షను జాగ్రత్తతో పెంచి, అలుపులేక మేలుకొని జ్వలించునట్లు చేయవలయును. అట్లు చేయుట కుపాయము ఏకాగ్రధ్యానము, అనగా ఈశ్వరేచ్ఛకును ఈశ్వరోద్దేశమునకును సమగ్రముగ నర్పణ మొనరించు నభిప్రాయముతో నా యీశ్వరుని ఏకాగ్రమనస్సుతో ధ్యానించుట.

హృదయమందు ధ్యానించుము. అచ్చట ప్రవేశించుము, లోతుకు వెళ్లుము, ఎంత దూరము వీలుపడునో అంతదూరము వెళ్లుము, బయట ఎల్లప్రక్కల జెదిరియున్న ప్రజ్ఞయొక్క తంతువులను (చిత్తవృత్తులను) ఒక్కటిగ జేర్చి సమాహరించుకొని లోపల దిగి మునుగుము.

అచ్చట హృదయముయొక్క అగాధమైన నిశ్చలతయందు ఒక అగ్ని జ్వలించుచున్నది. అది నీయందుగల దైవమే, నీయొక్క యథార్థస్వరూపమే. దాని వాక్కును వినుము. దాని యాదేశములను అనుసరించుము.

ధ్యానమునకు ఇతర లక్ష్యస్థానములు కలవు. ఉదాహరణము: శిరమునకు పై నొకటి (దీనిని సహస్రారమునకు పై బ్రహ్మరంధ్ర మందురు), భ్రూమధ్యము మఱియొకటి. ఒక్కొక్కటియు నొక ప్రభావము గలది ఒక ఫలవిశేషము నిచ్చును. కాని, హృదయమునందే మూల(ముఖ్య)పురుషు డున్నాడు, హృదయమునుండియే (దివ్యమైన) మార్పునకు కావలసిన ప్రేరణ, సాక్షాత్కార సామర్థ్యము, క్రియాపరశక్తి - ఇవి యన్నియు సకల ముఖ్యప్రవృత్తులును బయలుదేరును.

"ఒకడు ఈయోగమునకు తయారగుటకు జేయవలసిన దేమి?"

ఎఱుక, మొట్టమొదట ఎఱుక కావలెను. మనలో నొక అత్యల్పభాగమును మాత్రము నెఱుగుచున్నాము. కాని అత్యధికాంశము నెఱుగము. ఈ ఎఱుకలేమియే మనలను అపక్వస్వభావమం దుంచి దానియందు మార్పును రూపాంతర పరిణామమును రానీయక అడ్డపడుచున్నది. ఈ బోధశూన్యతమూలముననే దివ్యములు కాని శక్తులు (దైవమునకు ప్రాయికముగ విరుద్ధములైనవి) మనలో ప్రవేశించి మనలను తమకు దాసులం గావించుచున్నవి.

కాబట్టి నిన్ను గుఱించి నీకు ఎఱుక యుండవలెను. నీ స్వభావమందును, తత్ప్రవృత్తులయందును నీకు ప్రబోధము కావలెను; ఎట్లు ఏల వేనినైనను జేసెదవో విచారింతువో, అనుభవింతువో అవి నీకు దెలియవలెను. నీయుద్దేశములు, నీ ప్రేరణలు, నిన్ను కదలించు శక్తులు, గుప్తములు కాని వ్యక్తములు కాని, అన్నియు నీకు బోధము కావలెను. నిజముగ, ఒక యంత్రమునందు గల పలుభాగములను వేఱుపఱచునట్లు నీయొక్క సకలభాగములను ప్రత్యేకపఱచవలెను. నీకు ఎఱుక కల్గినదనగా, నీవు విషయములను ప్రత్యేకపఱచి విడదీసి ఏశక్తులు నిన్ను క్రిందికి లాగుచున్నవి, ఏవి నీకు సాయపడుచున్నవి అని నీవు వివేచనజేయ నగునని అర్థము. ఇది సాధువు ఇది అసాధువు (సరి, తప్పు), ఇది సత్యము ఇది అసత్యము, ఇది దివ్యము ఇది అదివ్యము అని నీవు తెలిసికొనునపుడు నీవు తెలిసికొన్న ప్రకారమే నీవు తప్పక నడవవలెను. అనగా తీర్మానముగ ఒకటిని (త్యాజ్యమైన అసత్యాదిని) వదలివేసి, మఱియొకటిని (గ్రాహ్యమైన సత్యాదిని) అంగీకరింపవలెను. సాధనమందు ప్రతిపదమున ఈ ద్వంద్వము (సత్యాసత్యాది) ఎదురుపడును; ఒక్కొక్క అడుగునం

దును, (యుక్తమైనదానిని) నీవు వరించవలెను. ఓర్పుతోను స్థైర్యముతోను జాగ్రత్తతోను అభిజ్ఞులు చెప్పునట్లు వినిద్రుడవుగ నీవు ఉండవలెను. దైవమునకు విరుద్ధముగ తదితరమైన దేనికిని ఎట్టి యవకాశము నియ్యరాదు.

"మానుష్యకమునకా ఈ యోగము?"

కాదు, ఇది దైవమునకై. మనము అన్వేషించునది దైవముయొక్క ఆవిర్భావమేగాని మానుష్యకక్షేమము గాదు. మనము ఈశ్వరేచ్ఛను జరుపుటకై యున్నాము; ఇంక యథార్థముగ జెప్పుదుమేని, ఈశ్వరేచ్ఛావ్యాపారమునకు ఉపకరణములై ఈశ్వరుడు క్రమక్రమముగ మూర్తిభవించి యాతని సామ్రాజ్యము భూలోకమందు ప్రతిష్ఠితమగుటకై యున్నాము. మనుష్యసంఘమున నెవరు దేవుని పిలుపును విని యంగీకరించెదరో వారే దైవానుగ్రహమునకు పాత్రులగుదురు.

మానవజాతియంతయు, సాక్షాత్తుగ లేకపోయిన, పరంపరాసంబంధముననైన లాభము బొందునా యనుట మానుష్యకముయొక్క స్థితిపై నాధారపడియున్నది.

కాలాన్నీ లోకస్థితులలంబట్టి నిర్ణయించవలసినచో నెక్కువ అవకాశము లేదు. మానుష్యక ప్రతినిధిగాయున్న సామాన్యమనిషియొక్క మనోభావము, నేడేమి? నిర్వ్యాజమైన దైవాంశముతో సంగము సంఘటించినతోడనే, క్రోధాభిద్రోహబుద్ధితో లేవడా, వాడు? దైవమనగా తన యభీష్టములైన సర్వస్వామ్యముల నాశమే అర్థమని తలచడా? దైవము దేని నుద్దేశించినను సంకల్పించినను దానిని సువ్యక్తముగ ఖండించుటకు అనవరతము నాక్రందించుచుండ లేదా? ఈశ్వరుని యావిర్భావముచేత మానవజాతి లాభము బొందుటకు మునుపు అది చాల మాఱవలసియున్నది.

"మనము (ఇచ్చట) కలసినది యెట్లు?"

మన మందఱము జన్మాంతరములయందు కలసియున్నాము; లేనిచో నీజన్మమందు చేరియుండము. మన మేక కులస్థులము. యుగయుగములుగ దైవజయమునకై భూమియందు దైవావిర్భావము కొఱకు కార్యకారులమై యుండియున్నాము.

# రెండవ ప్రకరణము

"యోగ మందపాయము లెవ్వి? పాశ్చాత్యులకు (తెల్ల వారికి) విశేషముగా నపాయకరమా యోగము? 'యోగము మన వారలకే - ప్రాచ్యులకే - యుక్తము కావచ్చును గాని పాశ్చాత్యుల మనస్సును విషమము గావించి పాడుచేయు' నని యొకరు చెప్పి యున్నారు."

యోగము ప్రాచ్యులకంటె పాశ్చాత్యుల కెక్కువగా నపాయకరము గాదు. ఏభావముతో యోగము నకు గడంగు చున్నావో వానినిబట్టి యంతయు నున్నది. స్వార్థమునకై, ఏదో నీ యభీష్టసిద్ధికై యోగము నపేక్షింతువేని యది యపాయకరమే యగుచున్నది. ఈశ్వర సాక్షాత్కారమే లక్ష్యమని నిరంతరము జ్ఞప్తిలో నుంచుకొని యోగము పవిత్రమనుభావముతో నభ్యసించు వారి కది యపాయకరము గాదు, మఱి అదియే రక్ష, అభయము నగుచున్నది.

భగవదర్థముగాక స్వార్థమునకై యోగము నభ్యసించునపుడు అపాయములును కష్టములును వచ్చుచున్నవి.

యోగ మను వేషముతో శక్తిని సంపాదించి యోగము
తృప్తి: అనః గాంక్షించినపుడు అన్ని కష్టములును అపాయ
ములును వచ్చును. అతికాంక్షను విడనాడ లేవేని యోగ
మును స్పృశించవలదు: దహించు నగ్ని యిది.

యోగమునకు రెండు మార్గము లున్నవి; ఒకటి
తపస్య, మఱొకటి ప్రపత్తి. తపస్యామార్గము కష్టమైనది.
ఇందు నీవు స్వబలముపైననే ఆధారపడి స్వబలము చేతనే
పెడలుచున్నావు. స్వబలప్రమాణానుసారముగా పైకేగి
సాధించుచున్నావు. అందెప్పుడును పతనాపాయము గలదు.
ఒకమారు క్రింద పడినచో నధఃపాతాళమున భగ్నుడవై
పడియుందువు. ఇక చికిత్స దుర్లభము. మఱియొక
మార్గము ప్రపత్తి; అది సురక్షితమైనది, అసందిగ్ధమైన
దియు. ఈ మార్గమునే, పాశ్చాత్యులు, కష్టముగా
నెంతురు. వారు తమ వ్యక్తిస్వాతంత్ర్యమును భంగపఱచు
నదంతయు భయంకరమని నిరాకరణీయమని శిక్షబొంది
యున్నారు. ప్రత్యేకతా (వ్యక్తిత్వ) బుద్ధిని వారు
మాతృస్తన్యపానముతో స్వీకరించి యున్నారు. ప్రపత్తి
యనగా నాస్వాతంత్ర్యము నంతను బరిత్యజించుట గదా.

అనగా శ్రీరామకృష్ణపరమహంస ఉదాహరించినట్లు మర్కట కిశోరమార్గమునో మార్జాల కిశోర మార్గమునో దేనినో ఒకటిని నీ వవలంబించవచ్చును. కోతిపిల్ల తన్ను మోసికొని పోవుటకై తన తల్లిని పట్టుకొనుచున్నది. గట్టిగా పట్టుకొనవలెను. అట్లుగాక పట్టు వదలిపెట్టిన పడి పోవును. ఇక పిల్లికూనయన్ననో తల్లిని తాను పట్టు కొనదు. తల్లియే దానిని పట్టుకొనుచున్నది. దానికి భయ ముగాని బాధ్యతగాని లేదు. తల్లిని తన్ను నోటబట్టు నుండనిచ్చి 'మా', 'మా' యని యఱచుట తప్ప నది చేయవలసిన దేమియు లేదు.

సంపూర్తిగను హృదయపూర్వకముగను ప్రపత్తి పంథ నవలంబించిన నిక నేమాత్ర మపాయము గాని తీవ్రమైన కష్టము గాని యుండదు. విషయ మేమన ఋజు వుగ నుండవలెను. నీ కార్జవము లేకున్నయెడల యోగము నారంభింపకుము. మనుష్యవ్యవహారములలో నీవు వంచన కు గడంగనగును. కాని ఈశ్వరునితో వ్యవహరించు నపుడు కపట మెచ్చటను శక్యము కాదు. హృదయపూర్వ కముగ నవ్యాజముగ దేనిని దాచుకొనకున్నపుడును,

ఈశ్వరుని సాక్షాత్కరించి ఈశ్వరప్రేరితుడ వగుటయే నీ యేకలక్ష్య మగునపుడును ఈ మార్గమున సురక్షిత ముగా వెళ్లగలవు.

కాని యింకొక అపాయమున్నది. అది సంభోగ ప్రవర్తనలకు సంబంధించినది.

యోగము శోధనవిధియందుండగ మనలో దాగి యున్న సాహసప్రవర్తనలను ఇచ్ఛలను అన్నింటిని పైకి దెచ్చి బయటవేయును. విషయములను దాచకుండుట కును యొకప్రక్క విడిచి పెట్టకుండుటకును నీవు నేర్చుకొన వలెను, వాని నెదుర్కొని జయించి వానికి పునస్సం స్కార మొనర్పవలెను. ఎట్లయినను యోగముయొక్క మొదటి కార్యము మనస్సుయొక్క యధికారమును దీసి వేయుట. అందువలన నిద్రితప్రాయములై పడియుండిన భోగేచ్ఛలన్నియు దటాలున విడుదలబొంది (మేలుకొని) పురుషుని (ఆధారము) పై దండెత్తును. మానసాధి కారము పోయి ఆస్థానమునకు దైవాధికారము రానంత కాలము ఒక సంధిసమయము. అప్పుడు నీ యార్జవమునకు ప్రపత్తికిని పరీక్షా కాలము. భోగవిషయేచ్ఛాదులనంటి

సాహసప్రవర్తనలకు సాధారణముగ బల మేర్పడుట జనులు వానిని అధికముగ లక్ష్యపెట్టుట వల్లనే. వారు వాని విషయమై తమ యసమ్మతి నుగ్రముగ తెలుపుచు నిగ్రహించి నిర్బంధముతో వశపఱచ యత్నించి లోపలనే యుంచి త్రొక్కిపెట్టుదురు. కాని, ఒకవిషయము నెంత యెక్కువగ చింతించుచు "నాకు వల దది, నాకది వలదు" అని చెప్పుదువో అంత యెక్కువగా దానికి గట్టువడెదవు. నీవు చేయవలసిన దేమనగా దానిని దూరమున బెట్టి దానినుండి నీవు ప్రత్యేకపడి, చాలినంతవరకు గమనించ కుండవలెను, ఒక వేళ యాతలంపు వచ్చెనేని తటస్థుడవుగ దాని సంబంధము లేనివాడవుగ నుండవలెను.

యోగముయొక్క సంఘట్టనచేత పైకివచ్చు నీషణ ప్రేరణలను నీకు బాహ్యమైనవని బాహ్యప్రపంచముం జేరినవని శాంతుడవై నిస్సంగుడవై నీవు ఎదుర్కొన వలెను. దైవము వానిని దీసికొని పరివర్తన మొనర్చుటకై వానిని దైవమున కర్పించవలెను.

నీవు దైవమునకు ఉన్మీలితుడవై భగవచ్ఛక్తి పైనుండి నీలో దిగి పనిచేయ నారంభించిన పిదప నీవింకను

ప్రాణవాసనలను (శక్తులను) నిలుపుకొన బ్రయత్నింతు వేని కష్టోపద్రవాపాయములకు నీవే తయారు చేసికొనెదవు. నీ కామపూర్తికి ఈశ్వరుని వ్యాజముగ బెట్టుకొనకుండ జాగ్రత్తతో చూచుకొనవలెను. కొందఱు తామే ఆచార్యపట్టమును గట్టుకొనియున్నారు. వారు తమ యాశలను బూర్తిగావించుకొనుట తప్ప మతేమియు జేయరు. నీ వాపథమున బోయి కొంతజ్ఞానమే కలిగి శక్తి యంతగా లేనపుడు (ప్రాణలోకవాసులైన) ఒకవిధసత్త్వముల చేత పట్టుకొనబడి వాని చేతులలో యుద్ధోపకరణముగానై తుదకు వారికి భక్షణముగా నగుటయు సంభవించును. కాబట్టి వేష మెచ్చట నున్నదో యచ్చట నపాయ మున్నది. ఈశ్వరుని నీవు వంచింప జాలవు. నీవు "దేవా! నీ సంయోగమే నాకు కావలెను" అని పైకి చెప్పుచు లోపల మాత్రము "నాకు శక్తి కావలెను, భోగములు కావలెను" అనుచు ఈశ్వరుని కడకు వచ్చెదవా? జాగ్రత్త! పర్వతశిఖరమునకు వెళ్లి అధఃపాతాళమున బడుదువు. ఇట్టి మహావిపత్తు ఏదియు రాకుండ జేసికొనుట మిక్కిలి సులభమే. చిన్నబిడ్డవలె నగుము. తల్లి

కర్పించుకొనుము. నిన్నా మెయే తీసికొని వెళ్లనిమ్ము. ఇక నే యపాయము నుండదు.

శరణు జొచ్చిన తరువాత ఇతరవిధకష్టములను నీ వెదుర్కొన నవసర ముండదని యర్థము కాదు. లేదా, నీ వెదిరించి జయించుట కేయాటంకములు నేమాత్రము లేవని గాదు. ప్రపత్తి సరళమును అవ్యాకులమునగు ఎడ తెగని అభివృద్ధిని నిశ్చయించదు. అనగా దీనికి కారణము, నీవు సమాహితుడవై కాక విభక్తుడవై యున్నావు. నీ అర్పణము పూర్ణమును అనన్యమును గాదు. నీయందలి యొక భాగముమాత్రమే శరణుజొచ్చినది. ఈ నాడొక భాగము, మఱునాడు మఱొకభాగము. భిన్న భిన్న మార్గములందు ప్రవర్తనగల పలుభాగములను కూడ గట్టుకొని యొకచో ప్రవృత్తి కలుగ జేసి ఐక్యముగావించు టయే యోగముయొక్క సంపూర్ణప్రయోజనము. అంత వఱకు కష్టములు లేకుండ నుండజాలవు. కష్టము లనగా సంశయము, అనుత్సాహము, వితర్కము, ఇటువంటివి. ప్రపంచమంతటను ఈవిషము నిండియున్నది. ప్రతి శ్వాసముతోను దీనిని (విషమును) లోపలికి తీసికొను

చున్నావు. ఒక యస్పృహణీయ మనుష్యునితో సంభాషణ చేసినను నీప్రక్కన అటువంటివాడు వెళ్లినమాత్రము నను ఆతనినుండి యా యంటువ్యాధి నిన్నంటుకొనవచ్చును. "ప్లేగ్" అంటువ్యాధి యుండు స్థలమునకు వెళ్లిన చాలును; ఆవ్యాధివిషము నీ కంటును. అది యా స్థలమున నున్నదని కూడ నీకు తెలియనక్కఱలేదు. నీవు సంపాదించుటకు మాసములుబట్టినదానిని కొన్నిక్షణము లలో పోగొట్టుకొనగలవు. నీవు మనుష్యసంఘమునకు జేరి సాధారణజీవితమును గడుపుచున్నంత కాలము ప్రపంచపు మనుష్యులతో కలిసిమెలసి తిరిగినను అంత బాధకము లేదు. కాని దివ్యజీవితమును నీవు గోరుదువేని నీ సహవాసవిషయమందును, పరిసరవిషయమందును నీ వత్యంత జాగ్రత్తతో నుండవలయును.

"మనంగాని వివిధాంశములను మనఃప్రాణాదులకు ఐక్యమును సాజాత్మ్యముగు స్థాపించుట కుపాయ మేమి?"

దృఢబుద్ధితో నుండుము. వక భాగములను విధే యతలేని బిడ్డలవలె చూడుము. అనవరతము ఓర్పుమెయి వానిని దిద్దితీర్పుము. వానితప్పుల నవియే యొప్పుకొను నట్లు చేయుము.

నీ ప్రజ్ఞయొక్క లోతులందు చైత్యమున్నది. అదియే నీలోని దైవముయొక్క ఆలయము. ఈకేంద్రమును (ముఖ్యస్థానమును) జుట్టియే నీయొక్క భిన్న భిన్న భాగములకును విరుద్ధప్రవృత్తులకును ఏకీభావ మేర్పడవలయును. చైత్యపురుషప్రజ్ఞను బొంది తదభీప్స నెఱుగుదువేని యీ సందేహములను కష్టములను ధ్వంస మొనర్పవచ్చు. కొద్దిగనో గొప్పగనో కొంతకాలము పట్టవచ్చును. కాని కడపట జయము మాత్రము నిశ్చయమే. నీ వొకసారి దైవమున కభిముఖుడవై "నేను నీవాడను గాగోరెదను" అని చెప్ప దైవ మందులకు 'అట్లే కాని' అని చెప్పినపిదప సకలప్రపంచము నిన్ను దానికి దూరస్థునిగ జేయజాలదు. కేంద్రసత్త (ప్రధానపురుషుడు) శరణు జొచ్చినపుడు ముఖ్యమైన కష్టము నివృత్తమైనది. బాహ్యభాగ మొక బెరడువలె నున్నది. సామాన్యజనులయం దీ బెరడు గట్టిగా మొద్దుగా నున్నందున తమలోని పురుషుడైన దైవమును వా రెఱుగ లేకున్నారు. ఒక్కపర్యాయము, ఒకక్షణమాత్రమేనియు, ఈయంతరాత్మ "నే నిదిగో ఉన్నాను, నీవాడనే నేను" అని చెప్పినయెడల

నేదోయొక వంకతోన గట్టినట్లయినది. ఇక కొద్దికొద్దిగా బెరడు సన్నగిల్లి రెండుభాగములు నొక్కటిగా గలసి బాహ్యాభ్యంతరములు నొకటిగా నగును.

యోగులను జెడుపునది యతికాంక్షయే. దూషకమైన యీకీటము చాలకాలము దాగియుండ గలదు. ఈ విషయము నేమాత్రము నెఱుగకయే యనేకులు యోగమార్గమున దిగుచున్నారు. కాని కొన్ని శక్తులు లభించినతోడనే వీరికాంక్ష పైకుబుకుచున్నది. అది మఱింత తీవ్రముగ లేచుచున్నది. ఏలనన, ప్రారంభములోనే యది నిరాకరింపబడలేదు.

అద్భుతశక్తులను సాధించిన యొకయోగిని గుఱించిన కథ యొకటి గలదు. ఆయనను శిష్యులు భిక్షకు బిలిచిరి. ఎత్తు తక్కువైన పెద్దమేజాపైన భిక్ష పెట్టిరి. ఏదో యొకవిధమున తమసిద్ధిప్రభావమును జూపుడని గురువును గోరిరి. అట్లు చూపగూడదని ఆయనకు తెలియును. అయినను దురాశాబీజము లోపలనుండినది, కాబట్టి 'ఇంతకు నది బాధకమైన విషయముగాదు. మఱియు వారి కిట్టు వంటిది సాధ్యమని నిరూపించి ఈశ్వరమహిమను బోధించ

వచ్చును' అని తలంచి యిట్లనెను.—"మేజా పైనున్న వస్త్రమును, దానిపైనున్న తట్టలను ఆహారపదార్థములను అట్లే యుండనిచ్చి మేజాను మాత్రము తీసివేయుడు." శిష్యు లనిరి "అట్లు చేయజాలము. అంతయు క్రిందబడి పోవును" అని. కాని గురువు నిర్బంధించగా శిష్యులు వస్త్రముక్రిందనుండి మేజాను తీసివేసిరి. ఆహా, అద్భుతము! క్రింద మేజాయుండియున్నట్లే వస్త్రము, దానిపైనుండిన సర్వము నిలిచియుండెను. శిష్యు లాశ్చర్యపడిరి. కాని తటాలున ఆయోగి బయటకు దుమికి వెళ్లి యిట్లు అరచుచు నేడ్చెను, "ఇక నెన్నడు నాకు శిష్యుడు వలదబ్బా, ఏనాటికిని వలదు, 'న కదాపి,' అయ్యో నా దుఃఖము. నా దేవునికి ద్రోహముచేసితిని." అని. ఆయోగి యొక్క హృదయ మగ్నిలోపడినట్లయినది, స్వార్థమునకై యాతడు దైవశక్తులను వినియోగించెను.

శక్తులను ప్రకటనజేయుట ఎప్పుడును తప్పు. అట్లని వాని కుపయోగము లేదని యర్థము కాదు. అవి యెట్లు వచ్చినవో యట్లే వాని వినియోగముకూడ. అవి దైవముతోటి నైక్యమువలన వచ్చినవిగదా. వానిని దైవే

చ్ఛానుసారముగానే వినియోగించవలెను కాని బహిరాడంబరములకు గాదు. గ్రుడ్డివానిని నొకనిని నీవు చూచుట తటస్థించెనేని, వానికి దృష్టినియ్యగల శక్తి నీకున్నచో, ఆతనికి దృష్టి కలుగవలెనని దైవసంకల్ప మున్నయెడల 'ఆతనికి దృష్టిరానిమ్ము' అని నీవు చెప్పిన మాత్రమున అతడు చూచును. కేవలము నీ వాతనిని స్వస్థపఱచవలెనని కోరుచుండుట చేతనే నీవాతని చూడగలుగునట్లు ఆసింతువేని అపుడు నీయాశను తృప్తిపఱచుటకై ఆశక్తి నుపయోగించుచున్నావు. తఱచుగ నిటువంటి విషయములందు నీశక్తులను బోగొట్టుకొనుటయేగాక ఆమనిషిలో ఎక్కువ అలజడిని బుట్టించుచున్నావు. అయినను పైకిచూచుటకు రెండువిధములు నొకటిగనే యుండును; కాని, ఒకదానియందు భగవదిచ్ఛయను కారణమువలన నీవుచేసెదవు, మఱొకదానియందు స్వార్థోద్దేశముతో చేసెదవు.

భగవదిచ్ఛ మనలను పనిచేయించునపుడు, అది భగవదిచ్ఛయని మన మెట్లెఱుగుదుమని నీవడుగవచ్చును. భగవదిచ్ఛను గుర్తించుట కష్టముగాదు. అందు తప్పుటకు

వీలులేదు. యోగమార్గమున జాలదూర మభివృద్ధిజెందు టకు మునుపే దైవసంకల్ప మిదియని నీ వెఱుగగలవు. దాని వాక్కును మాత్రము వినవలెను. అది(యిచ్చట) హృదయముననుండు సూక్ష్మవాక్కు. నీ వట్లు (ఆ వాక్కును) విన నలవాటుపడినపిదప, ఈశ్వరేచ్ఛకు విరుద్ధముగ నాచరించుదువేని నీకు అశాంతి కల్గును. అట్లే కాపథమున నీవు విడువకుండ పోయినయెడల నీవత్యంతక్షోభముం బొందుదువు. అట్లయ్యును ఆ నీ క్లేశమునకు కారణముగా నేదోయొక బాహ్య (భౌతిక) సమాధానమును (నెపమును) ఇచ్చి ఆమార్గముననే వెళ్లుదువేని క్రమక్రమముగా దర్శనసామర్థ్యముని—వాక్కును వినుశక్తినే—పోగొట్టు కొందువు. కట్టకడపట నన్నివిధముల తప్పులను నీవొనర్చుచు బోవచ్చును, ఏచంచలతను నీ వెఱుగకపోవచ్చును; కాని నీ వతిస్వల్పక్లేశమునుగూడ నొకపరి పొందినపుడే యాగి "దీనికి కారణ మేమి?"యని నీ యంతరాత్మను ప్రశ్నించినచో యథార్థమైన యుత్తరము నీకు లభించితీరును, అంతయు చక్కగా విశదమగును. నీకు కొద్దిగా ననుత్సాహమో, స్వల్పముగ ఆకులతయో కలుగునపుడు

దానికి భౌతిక కారణ మియ్యబూనవలదు. నీ వాగి కారణ
మును వెతకునపుడు కారణ మేమా యని యాలోచించు
నపుడు, నీవు సంపూర్ణముగా సరళముగను ఋజువుగను
ఉండుము. మొదట నీ మనస్సు యథార్థముగ దోచ
దగిన చక్కని సమాధానమును గల్పించును. దాని నొప్పు
కొనక ఆవల చూచి "ఈ వ్యాపారమునకు వెనుక
నున్న దేమి? దీని నే నెందులకు చేయుచున్నాను" అని
యడుగుము. తుద కొక మూలయందు దాగియున్న చిన్న
యలను (క్షోభ) నీవు కనుగొందువు— నీకష్టమునకు
వ్యాకులతకు కారణమైన నీ మనోభావమందు గల మెలి
కను ఇంచుక తప్పిదమైన పోకను కనుగొందువు.

అతిశాంతియొక్క యత్యంత సామాన్యరూప
ములలో మానుష్యకసేవయను భావము ఒకటి. అటువంటి
సేవపట్లనో కర్మపట్లనో గల సంగము (మమత్వము)
పురుషుని స్వాభిలాషకు లక్షణము. ఏగురువు, మానవ
సంఘమునకు తాను బోధించవలసిన గొప్పసత్య మొకటి
యున్నదని విశ్వసించుచున్నాడో, అనేక శిష్యులను
గోరుచున్నాడో, శిష్యులు వెళ్లిపోయినపుడు సంకటపడు

చున్నాడో, ఎవడు వచ్చినను వానింబట్టుకొని శిష్యుని గా జేయ యత్నించునో ఆతడు (గురువు) స్పష్టముగ తన యత్యాశనే తప్ప మఱిదేనిని యనుసరించలేదు. నీవు దైవాజ్ఞ ననుసరించుటకు సిద్ధుడవేని నీ కొసంగబడిన యే కార్యమునేని, మహత్తర కార్యమైనను, చేయుటకును, ఆమఱునాడే, నీ వెంతనిశ్చలత్వముతో దానిని తీసికొంటివో అదే నిశ్చలతతో దానిని వదలిపెట్టుటకును, బాధ్యత నీది యని భావించకుండుటకును, సమర్థుడవు కావలెను. నీ వత్యంత స్వతంత్రుడవుగ నుండవలెను. ఏ విషయముపట్లగాని లేదా యేజీవితపద్ధతిపట్లగాని, నీవు సంపూర్ణముగా నిస్సంగుడవై యుండవలెను. వాస్తవమైన యోగిదృష్టిని గోరుదువేని దైవమువద్దనుండి వచ్చు ప్రతి దానిని అంగీకరించుటకును, దానినే సులభముగ విచారము లేకుండ బోనిచ్చుటకును నీవు సమర్థుడవై యుండవలెను. "నాకేదియు వలదు" అని చెప్పు సన్న్యాసియొక్క భావము "నాకిది కావలె" నని చెప్పు లౌకికుని మనోభావము నొక్కటియే. తన స్వామ్యముపట్ల రెండవవాని కెంత మమత్వమో మొదటివానికి తన సన్న్యాసముపట్ల నంత మమత్వ ముండవచ్చును.

## శ్రీ మాతృ వాక్యములు

దైవమునుండి వచ్చునవన్నింటిని — వానినిమాత్రమే — నీ వంగీకరింపవలెను. ఏలన, విషయములు గూఢములైన కోరికలనుండి కూడ వచ్చును. కోరికలు మగ్న చేతనయందు (స్పష్టముగా లోపలనే క్రింద మగ్నమైయుండునదియందు) వ్యాపరించుచు విషయములను నీకు దెచ్చి యిచ్చును. వానిని నీవు గుర్తెఱుంగక పోయినను అవి దైవమునుండి వచ్చినవి మాత్రము కావు. అవి ప్రచ్ఛన్న కామనలనుండియే వచ్చునవి.

ఒక విషయము భగవంతునుండి వచ్చునప్పుడది నీకు సులభముగా తెలియగలదు. నీవు చింతారహితుడవై సుఖముగ శాంతితో నుందువు. ఏదైన నొకటి సంభవించునపుడు 'ఆహా! తుదకు నాకది లభించినది' అని దుముకి క్షోభతో నత్యుత్సాహమును జూపుదువేని అది దైవము నుండి వచ్చినదిగాదని నిస్సంశయముగా నీ వెఱుగగలవు. సమతాస్థితియే దైవముతో నేకీభవించి ఆ ఐక్యముతో వ్యవహరించుటకు సారభూతమైన నియమము.

"కొన్ని సమయములందు దైవము మనకోర్కెలం బూర్తి జేయదా?"

నిస్సంశయముగ జేయును. ఒకబాలుడు యోగము జేయగోరెను. వానితండ్రి నీచుడు, క్రూరుడు, యోగము జేయనీయక యడ్డపడ బ్రయత్నించెను. తనవిషయమున తండ్రియొక్క ప్రవేశమునుండి విముక్తు డగుటకు బాలుడు తీవ్రముగ నభిలషించెను. తోడనే తండ్రి ఘోరముగ జబ్బుపడి చనిపోవుట కుండెను. అంతట బాలుని స్వభావమున మఱొకభాగము బయల్పడి వాడు తన దురదృష్టమును గుఱించి దుఃఖించి "హా, పాపము నాతండ్రి ఎంతో జబ్బుపడియున్నాడు. ఇది యెంత దుఃఖ కరము ?. అయ్యో, నే నేమి చేయగలను" అని అఱ చెను. తండ్రి స్వస్థుడయ్యె. బాలుడు సంతుష్టుడై మరల యోగమునకు గడంగెను. తండ్రియు మరల ద్విగుణించిన బలాత్కారముతో విరోధించి బాధపెట్ట నారంభించెను. పుత్రుడు (పాపము) తనకేశములను ఛిన్నభిన్నముల జేయుచు "పూర్వముకంటె నిపుడు ఎక్కువగ నడ్డపడు చున్నాడే నా పిత" యని యాక్రందించెను. విషయ మంతయు నేమనగా, ఒకడు తన కేమి కావలెనో దానిని ఉన్నది యున్నట్లు తెలిసికొనవలెను.

## శ్రీ మాతృ వాక్కులు

దైవము సాన్నిధ్యమగు నపు డెప్పుడును సంపూర్ణ నిశ్చలతను శాంతిని దెచ్చును. ఒకవిధమైన భక్తులవర్గము వారు సాధారణముగా వేఱు రూపమున గన్పుడుదు రనుట సత్యమే. భక్తి భావావేశమున అని వారనునట్లు, గంతులు వేయుచు, ఏడ్చుచు, నవ్వుచు, పాడుచు నుందురు. కాని వాస్తవముగ నట్టివారు దైవమునందు నివసించరు. వారెక్కువగా ప్రాణలోకమున నివసింతురు.

శ్రీ రామకృష్ణ పరమహంసులకు భావోద్రేకజన్య క్షోభసమయము లుండినవనియు, చేతుల బైకెత్తుచు నాడుచు బాడుచు వెళ్లుచుండెననియు జెప్పుచున్నావా? ఈ విషయమున సత్యమిది; అంతరపురుషుని ప్రవృత్తి పక్వమై యుండవచ్చును, కాని నీబాహ్యసత్త మార్పు జెందక దుర్బలముగ నుండునేని, అది నిన్ను భావోద్రేక సంక్షోభముల చేత నింపునటువంటి శక్తులను గ్రహించు దశయందు ఉంచును. బాహ్యసత్త అంతస్సత్తకు ప్రతిబంధ మొనర్చుచు ఆనందమును పూర్ణముగ భరించ జాలదేని, ఇటువంటి వ్యాకులతయు అవ్యవస్థయు నా విష్కరణమందు సంభవించును.

నీకు దేహము దృఢముగను, నాడులు (సన్నసరములు) దృఢముగను నుండవలెను. నీ బాహ్యాసక్తి యందు సమత యనెడి దృఢమైన పునాది యుండవలెను. ఈ పునాదియున్నచో, భావమయమైన యొక ప్రపంచమును నీయందు ఇముడ్చుకొనదగును, అపుడు అఱచి బయల్పఱచ నక్కఱలేదు. (భక్తి)భావమును వెలువరించ గూడదని అర్థము కాదు, సుందరముగ సామరస్యముతో (సంహాటముతో) వెలిపఱచవచ్చును. రోదనాక్రందన నటనములు స్వభావమునందు—ప్రాణమందో, మానసమునందో, శరీరమునందో—గల దౌర్బల్యమును నిరూపించును. ఏలన, ఈమట్టముల యందు క్రియావ్యవసాయము స్వార్థతృప్తికై జరుగును. నాట్యమాడి దుముకి అఱచు వానికి ఏవిధముననో తనసంభ్రమమందు తాను సహజముగ లేదని యనుభవమగును; వాని ప్రాణస్వభావమున కందు అధికసుఖ ముండును.

నీవు దైవముయొక్క యవతరణభారమును భరించ గల్గుదువేని బలిష్ఠుడవై శక్తుడవయ్యు నుండవలయును. అట్లు కానిచో ఖండఖండములుగ క్షోభితుడ వగుదువు.

కొందరు "ఏల దైవ మింకను సాన్నిధ్యము జేయు లేదు?" అని యడిగెదరు. ఏలన, నీవింకను తయారు కాలేదు. ఒక చిన్న చుక్క నిన్ను ఆడ పాడ నేర్పజేయు నేని పూర్ణముగ నదియే వచ్చిన నేమగును?

కాబట్టి కొందరికి మనఃప్రాణదేహములయందు బలముగను దృఢముగను విశాలముగను ఆధారము(పునాది) లేదో, వారికి ఇట్లు చెప్పెదము "(శక్తిని బలాత్కరించి) లాగవలదు" అనగా, "శాంతముగను నిశ్చలముగను కాచుకొనియుండుడు" అని. ఏలన వారు అవతరణమును భరించ నశక్తులు. మఱి కొందరికి ఆవశ్యకమైన యాధారము, పునాది, యున్నదో, వారికి "తీవ్రముగ కాంక్షించి గ్రహించుడు" అని చెప్పెదము; ఏలన వారు గ్రహించుటకు శక్తులు, దైవమునుండి యవతరించు శక్తులచేత వారు విపర్యాస మొందరు.

"కొందఱకు, దైవోన్ముఖులకు, సకలలౌకికాశ్రయము వారికి ప్రియమైన సర్వమును నాశ మగుచున్నది; వారు ఎవరికైన ప్రేమించిన వారును గతించెదరా?"

ఇట్లు అందఱకును సంభవించుట లేదు, యోగము నకై యెవరి కాహ్వాన మున్నదో వారికే యట్లు సంభవించును.

ప్రాచ్యులకును పాశ్చాత్యులకును అధ్యాత్మ జీవిత సంబంధమై యే భేదమున్నను, అది అంతరపురుషునియందో అంతర స్వభావమందో లేదు; అంతరము మార్పులేక ఎల్లప్పుడు నొకరీతిగనే యుండును. కాని యా భేదము మనస్సుయొక్క శీలమునందును, బాహ్యమున ప్రకటించు పద్ధతులయందును ప్రదర్శనప్రకారములయందునుగలదు; ఇవి విద్య, చుట్టుప్రక్కలనుండు పరిస్థితి, బాహ్య సందర్భములు వీనిఫలితములు. జనులందఱును, ప్రాచ్యులు కాని పాశ్చాత్యులుకాని, అగాధమైన భావములయందు సదృశులైయే యున్నారు. ఆలోచనపద్ధతియందే వారు వేఱుపడుదురు. ఉదాహరణముగ, ఆర్జవము: ఈగుణము ఎచ్చటను ఏకరూపమైనదే. ఋజువుగనుండువారు ఏ జాతికి జేరినవారైనను ఒక రీతిగనే ఋజువుగ నుందురు. కాని యీ యార్జవము వెలుపడు ప్రకారములు మాత్రము భిన్నములైయుండును. మనస్సు భిన్నభిన్న

జనులయందు భిన్నభిన్న మార్గముల బనిచేయును, హృదయము మాత్రము ఎచ్చటను ఏకరూపమైనదే. హృదయము సత్యతరమైన వాస్తవము; భేదములు బహిర్భాగములకు (పైగనుండు స్థూలభాగములకు) సంబంధించినవి. నీవు చాలినంత లోతుగ వెళ్లినపుడు సర్వమునందును ఏకమైయున్న ఒకదానిని కలిసెదవు. అందఱును దైవమునందు సమాగమము కలదు. భౌతిక (స్థూల) ప్రకృతియందు సూర్యుడు ఈశ్వరునకు సంకేతము. మేఘములచేత ఆసూర్యుని రూపు (నీదృష్టికి) మాఱవచ్చును, కాని మేఘములు పోయినపుడు ఎచ్చటను ఎప్పుడును అదే సూర్యుని జూతువు.

ఒకనితో నీకు ఏకత్వభావము శక్యముకాదన్న, నీవింకను లోతుగ భావమునందు పోలేదని యర్థము.

# మూడవ ప్రకరణము

“ దర్శనములు గొప్పయధ్యాత్మ పదవికి చిహ్నమని సాధారణ ముగ నొక యభిప్రాయ మున్నది. ఇది వాస్తవమా ?”

అవశ్యము కాదు. అదియుగాక దర్శించుట ఒకటి, దర్శించినదానిని తెలిసికొని దానియర్థము నవగాహనము చేసికొనుట మఱియొకటి; ఇది చాల కష్టము. సాధారణ ముగ నిచ్చట పొరబాటుకు కారణ మేమన, దర్శనమయిన దానిభావమును తమ యాశాభీష్ట పక్షపాతానుసార ముగ నెఱుంగుచున్నారు. మఱియు దర్శనము లెన్నో * కక్ష్యలయందు కలుగుచున్నవి. మానసిక కక్ష్యలోని

* కక్ష్య యనగా “ ప్లేన్ ”. ఒక సౌధమందు మేడపై మేడ యుండునట్లు ఈ విశ్వమందు నొక లోకపుకక్ష్యపై మఱియొక లోకపు కక్ష్య యున్నది. ‘ చిత్ ’ (ప్రజ్ఞ) పృథివి మొదలు సత్య లోకమువఱకు లోకముపై లోకమునందు, కక్ష్యపై కక్ష్యలయందు అనేకదశలు లేక అవస్థలు స్థితులు కలదై యున్నది. ముఖ్యముగ మన మిచ్చట మూడుకక్ష్యల నుదాహరరించి, స్థూలమైన భూలోకము,

ప్రజ్ఞను దర్శనము కానవచ్చును, ప్రాణకక్ష్యలోని ప్రజ్ఞకు కానవచ్చును, ఈ లోకపు జాగ్రత్ప్రజ్ఞకు సమీపమున నుండు కక్ష్యలోను దర్శనములు కానవచ్చును. ఈ కక్ష్యలోని దర్శనము స్థూల ప్రపంచమునకు సంబంధించిన అత్యంతభౌతిక రూపములలోను, సంకేతములలోను స్పష్టముగ నిజముగ ప్రత్యక్షయోగ్యముగ నున్నట్లు కనబడును; భావమును తెలిసికొనుట కుపాయ ముండినచో అతిస్పష్టముగ మనుష్యులయొక్క లోపలిస్థితులను, ఇతర సందర్భములను తెలిసికొనవచ్చును—ఈ సమీపకక్ష్య దృష్టిచేత.

ఉదాహరణార్థమై నిజముగ నొకరికి వచ్చిన దర్శనమును దీసికొని (దాని భావమును) చూపెదను.

---

దానిపై సూక్ష్మమైన ప్రాణలోకము, దానిపై నింకను సూక్ష్మమైన మనోలోకము అని మూడు కక్ష్యలను జెప్పితిమి. వానికి పైగను లోక కక్ష్య లున్నవి. లోకము ప్రజ్ఞాప్రవృత్తికి క్షేత్రము, భూమి, తెలివికి గోచర మగు విషయము. ఒక్కొక్క పొరలోను, కక్ష్యలోను లోక మెప్పుడును జూచుటకు బాహ్యములె కనబడును, చూచునది మాత్రము ప్రజ్ఞ. ఇది యనేక కక్ష్యల యందు, అనేక దశలు గలదిగ నుండును.

ఉన్నతముగ దురారోహమై చఱియగల పర్వతప్రాంత మందు ఒకమార్గము పైకి పోవుచున్నది, అందు పూర్ణో జ్జ్వలమైన సూర్యప్రకాశము కలదు. అచ్చట భారా క్రాంతమయిన యొకబండి ఆఱుగుఱ్ఱములచేత లాగ బడినదై చాలశ్రమతో పోవుచున్నది. మెల్లగ నయి నను దృఢముగ పైకి బోవుచున్నది. పరిస్థితిని జూచి ఒకమనిషి బండివెనుక వెళ్లి దానిని త్రోయుచున్నాడు, లేదా, కొండపైకి త్రోయుటకు దొడంగుచున్నాడు. అపుడు జ్ఞానముగల (విషయము తెలిసిన) మఱియొకడు వచ్చి "ఎందులకు వృథాప్రయాస? నీప్రయత్నమేమైన సఫలమగునని నీవు ఎంచెదవా? ఇది నీకు అసాధ్య మయిన కార్యము, ఇది గుఱ్ఱములకే కష్టమే" అని చెప్పుచున్నాడు.

ఇపుడు ఈ దర్శనముయొక్క భావము నెఱుంగు టకు ఆఱు గుఱ్ఱములు అను బింబమునందు (మార్గదర్శక) సూత్రమున్నది. అశ్వములు శక్తికి సంకేతములు, ఆఱు అను సంఖ్య దివ్యసృష్టిని సూచించును. కనుక ఈ ఆఱు గుఱ్ఱములు దివ్యసృష్టియొక్క శక్తులను గుర్తించును.

దేనిని సాక్షాత్కరించి సాధించి జ్యోతిర్నివాసస్థానమైన ఉత్తుంగశిఖరమునకు గొనిపోవలయునో, దానిని, ఆ సాక్షాత్కారమును సూచించును బండి. ఈ సృష్టిశక్తులు దివ్యములుగ నున్నను, వానికీ ఈ సాక్షాత్కారమును సమాప్తము గావించుట యత్యంత ప్రయాసగ నున్నది; ఏలన అవి అత్యధికబలముగలదానిని, క్రిందికి క్రుంగ దీయుచుండు ప్రకృతియొక్క యత్యధిక బలము నంత నెదిరించి పని చేయవలసియున్నది. అంతట మానవుడు దర్ప వివేకముల పాలయి మితమైన మానస శక్తులతో తానొక దేమో చేయగల డని తలంచి వచ్చుచున్నాడు. వానికి అత్యుత్తమ కార్య మేమన బండిలోపల ప్రవేశించి సుఖాసీనుడై గుఱ్ఱములను బోనిచ్చుటయే.

స్వప్నములు వేలు, వాని వివరణము చాల కష్టము. ఏలన, ప్రతిమనిషికిని విశిష్టముగ స్వప్న కల్పనాప్రపంచము వేఱు. కొన్ని స్వప్నములకు అంతగా నర్థము లేదు, అవి అత్యంతబాహ్యమైన భౌతిక ప్రజ్ఞాస్తరమునకు (జాగ్రదవస్థా ప్రపంచమునకు) జేరినవి, అసంబద్ధమైన తలంపులు, ఆకస్మికమైన వాసనలు, యంత్రప్రాయపు మనో

వృత్తులు, లేక, ప్రతిఫలించు వ్యాపారవిశేషములు— వీని కార్యములు. వీనికి నియతమును వ్యవస్థితమును అగు రూపము ఆకృతి అర్థమును లేవు; అవి జ్ఞప్తిలో నుండుట చాల కష్టము, ప్రజ్ఞయందు ప్రాయికముగ సంస్కారమును ఉంచవు. ఇంతకంటె కొంత లోతున గలుగు స్వప్నములు కూడ స్పష్టములు కావు; ఏలన అవి పురుషవ్యక్తికి విశిష్టముగ సంబంధించినవి, అనగా, స్వాప్నికపురుషుని యనుభవములను వాని స్వాభావిక రుచులను ఆశ్రయించి రూపెత్తును. దర్శనములు కూడ కొన్నింటివి సంకేతాత్మకములై యున్నవి. ఆసంకేతములు జగమంతట వ్యవహారము నందుండ నక్కఱలేదు. జాతి, ఐతిహ్యము, ధర్మము(మతము) వీని ననుసరించి సంకేతములు వేఱుపడును. ఒకసంకేతము విశిష్టముగ క్రైస్తవునకు, మఱొకటి హిందువునకు, ఇంకొకటి మూడవది ప్రాచ్యుల కందఱకును సమానముగ నుండును, నాల్గవది పాశ్చాత్యులకు మాత్రమే యుండును. స్వప్నము లట్టివి కావు. అవి పురుషవ్యక్తికి మాత్రము సంబంధించినవి, ప్రతిదినసంఘటనల పైనను సంస్కారముల పైనను

ఆధారపడియున్నవి. ఒకని స్వప్నమును మఱొకడు విచరించుటయో వ్యాఖ్యానించుటయో అత్యంతకష్టము. ఒక్కొక్కడును మఱొక్కొక్కనికి అవిదితమైన వృత్తము;* కాని ప్రతిమనిషియు తనస్వప్నములను విచారించి చిక్కు విడదీసి తదర్థముల నెఱుంగవచ్చును.

ఇక స్వప్నములు స్వప్న ప్రపంచము, వీనితో వ్యవహరించుటకు విధానము; మొదట నీ స్వప్నములను గుఱించి మెలకువగ నుండుము. స్వప్నములకును జాగరణమందలి సంభవములకును గల సంబంధమును గమనించుము. నీకు రాత్రి జ్ఞాపకముండునేని, రాత్రియందు నిద్రలో జరుగు వానిని జ్ఞప్తినుంచుకొన్నచో దినము యొక్క స్థితి రాత్రిస్థితినుండి యెట్లు ఘటించినదని కనుగొనవగును. నిద్రయందు ఏదేని యొక వ్యాపారము, మానస కక్ష్యయందో, ప్రాణకక్ష్యయందో మఱియొదో యొక కక్ష్య యందో యెల్లపుడును జరుగుచున్నది. ఉదాహరణము:-

* వృత్తము, వస్త్రువయైనది. దానిలోపల నున్నది బాహ్యులకు తెలియదు; అట్లు, ప్రతిమనిషి లోపలనున్నది మఱియొక్కనికి తెలియదు.

కొంచెము సిద్ధిగాంచుటకు చాల ఉత్సుకులై దినమందు గొప్ప ప్రయత్నము చేసెదరు. వారు నిద్రకువెళ్లి మఱునాడు లేచునపుడు పూర్వదిన పరిశ్రమఫలముల గుఱుతే కనబడదు. మరల వారు పూర్వము చేసిన దానినే చేయవలసియున్నది. అనగా వారి ప్రయత్నము తత్ఫలితముగా వారు పొందినదియు నత్యంత బాహ్యాంశములకు (పై భాగములకు) చేరినవే గాని లోతున నిద్రితములైన భాగముల స్పృశించ లేదని యర్థము. నిద్రయందు నీవు ఎఱుక లేని యీ ప్రదేశముల పాల్పడితివి. అవి నోరు తెఱచి నీవు జాగ్రదవస్థయందు చాల శ్రమపడి సాధించిన (నిర్మించిన) వాని నన్నింటిని మ్రింగివేసెను.

ఎఱుకతో నుండుము! దినమం దెట్లో అట్లే రాత్రి యందును ఎఱుక యుండవలెను. మొదట ప్రజ్ఞను బొందవలెను, పిదప వశమును. స్వప్నముల జ్ఞాపక ముంచుకొను నీకు కలగను నప్పుడే యది కలయను యనుభవముకలిగి యుండవచ్చును. భౌతిక ప్రపంచమునకు సంబంధించని యనుభవ మది యని నీకు తెలియును. అట్లొక మారు తెలిసినచో నచ్చట (స్వప్నలోకమందే) భౌతిక ప్రపంచ

మునందువలె (జాగరణమునందువలె) నడచుకొననగును; కల గనుచున్నపుడే నీ ప్రజ్ఞాబలమును ప్రయోగించి స్వప్నానుభవముయొక్క గతినే మార్చవచ్చును.

మఱియు పదే పదే ఎఱుక ఎక్కువకాగా పగటి యందువలె రాత్రియందును నీ యాధారముపై నీను వశముండును, ఒకవేళ యెక్కువగా నుండదగును. రాత్రియందు దేహదాస్యమునుండి (దేహరూపరచనకు దాస్యమునుండి) ఏకదేశముగనైన విడుదలబొంది యుం డును. శరీర ప్రజ్ఞాపద్ధతులను వశపఱచుట చాల కష్టము. ఏలన అవి మనఃప్రాణపద్ధతులకంటె కఠోరమైనవి, మార్పు జెందుటకు అల్పతరముగానే వశపడును.

మనోమయమును ప్రాణమయమును, విశేషముగ ప్రాణమయము, రాత్రియందు చుఱుకుగ నుండును. దిన మందవి కట్టువడియున్నవి. భౌతికప్రజ్ఞ (జాగరితస్థాల జ్ఞానము) వాని వ్యాపారమును ఆవిష్కృతిని అప్రయత్న ముగనే ప్రతిరోధించుచున్నది. నిద్రయందు ఈ నిగ్ర హము నివృత్తమగును; కావున అవి స్వాభావికము లయిన స్వేచ్ఛాప్రవృత్తులతో వెలువడును.

"నిఃస్వప్ననిద్ర యెటువంటిది?"

సాధారణముగ సుషుప్తి యనుకొనబడునది, రెంటిలో నొకటి; స్వప్నము జ్ఞప్తిలేకుండపోవుట, లేదా, ఏ యెఱుకయు బొత్తిగ లేని స్థితియందు బడుట. ఈ యవస్థ ప్రాయికముగ మరణమే, మృతిని రుచిజూచుటయే; మఱియొక గాఢనిద్ర కలదు; అందు నీవు సకలభాగములతోను అత్యంతమౌనమునందు, అచలతయందు, శాంతియందు ప్రవేశింతువు. సచ్చిదానందస్వరూపమందు సంపూర్ణముగ మునుగుదువు. దానిని నిద్ర యనరాదు; అందు అత్యధికముగ జ్ఞానము కలదు. ఆస్థితియందు కొన్ని నిముసములే యుండవచ్చును. కాని యాకొన్ని నిముసములు పలుగడియల నిద్రవల్ల గల్గు విశ్రాంతిసుఖముకంటె నధికము నిచ్చును. ఇది యాదృచ్ఛికముగ రాదు, దీర్ఘకాలాభ్యాస బలమువల్లనే లభించును. (దీర్ఘకాలాభ్యాసము నపేక్షించినది.)

"స్వప్నమున కొందఱను జూచి తెలిసికొని వెనుక జాగ్రత్ ప్రపంచమున వారిసే కని యెఱుగుచున్నాము, ఇది యెట్లు?"

అది యేలన, గొందఱను గలయునట్లు చేయు నాకర్షణలవల్లనే; ఇవి ప్రాణలోకమందో మనోలోకమందో

గయున్నవి. జనులు భూలోకమునందు కలయుటకు మునుపే తెలియనిగ సికటిస్థలములయందు కలసెదరు, అచ్చట కలసి భాషించి భూమియందు కాగల యన్ని సంబంధముల నేర్పఱచుకొనవచ్చును. కొందఱ కా సంబంధములు తెలియును, కొందఱకు తెలియవు; కొందఱకు, అనేకులకు నట్లే, అంతస్స్మృతి అంతస్సమాగమమును తెలియకయుండును. అట్లుండియు వారు క్రొత్తముఖమును బాహ్యప్రపంచమున జూచునపుడు, అది ఎట్లో పరిచితముగను సువిదితముగను గనబడును.

“అబద్ధములైన దర్శనములు కలవా?”

పైచూపునకు అబద్ధములుగా గనబడు దర్శనములు కలవు. క్రీస్తును జూచితిమని చెప్పువారు వందలు వేలు కలరు. ఆసంఖ్యలో నిజముగ నాతనిం జూచిన వారు పండ్రెండుగురుకంటె తక్కువగా నుండబోలు. వారి విషయమునగూడ వారు చూచినదానిం గురించి చాల చెప్పవలసియున్నది. ఇతరులు చూచినది ఒక ఆవిర్భావముగ నుండవచ్చును, లేక ఒక సంకల్పమో, లేక స్మృతిలో నుండిన బింబమో. మఱి కొందఱు గలరు; వారికి ఒక శక్తియో

వ్యక్తియో దృఢసంస్కారము నిచ్చెడిదియు, జ్ఞప్తిలో నున్నదియునైన ప్రకాశమైన యొక బింబమో, దర్శన మయి యున్నది. వారు దేనినో యొకటిని జూచిరి; అది లోకాంతరమునకు సంబంధించినది, సామాన్య స్వభావమున కతీతమైన ఒకవ్యవస్థను చేరిన దని వారి తలంపు. కావున నది వారియందు భీతిభావమునో, విస్మయాకుల భావమునో, హర్ష భావమునో గల్గించినది. వారు క్రీస్తువు నందు నమ్మకము గలవారైనందున వేఱు దేనిని గాని తల చక అది అతడే అందురు. అదే దర్శనము గాని అను భవము గాని హిందు మహమ్మదీయాదీతర మతముల యందు విశ్వాసముగలవారికి గల్గినయెడల వేఱు నామ రూపములం దాల్చును. దృష్టమైనదిగాని అనుభూతమై నదిగాని, మూలమున నొక్కటిగనే యుండవచ్చును; కాని గ్రహించు మనస్సుయొక్క వేఱువేఱు వ్యవస్థను బట్టి వేఱువేఱుగ కల్పిత (రూప) మగుచున్నది. ఎవరు నమ్మకములు, మతములు, పురాణగాథలు, ఐతిహ్యములు, వీనిం దాటి పోగలరో, వారలకే వానివాస్తవము ఇది యనుటకు సాధ్యపడును. అటువంటి వారు కొందఱే, చాల

కొందరే. నీవు చూచినది ఇది యని ఎఱుగుటకుమునుపు, మానవ కల్పనలనుండి విముక్తుడవయి, దేశకృతము, లేక, కాలకృతము అయిన పక్షమునుండి నిష్కృష్టుడవు కావలెను.

ఆధ్యాత్మికానుభవ మనగా తనలోపల దైవముతో సంపర్కము. (లేదా, బాహ్యమునందు సామాన్యము, వెలయ, అధ్యాత్మవిషయమందు రెండును ఒక్కటియే) అనుట. అది యెప్పటను ఎల్ల దేశములయందును ఎల్లజనులయందును, ఎల్ల కాలములయందును ఏకరూపమైన యనుభవము. నీకు దైవముతో సమాగమ ముండునేని అది యెప్పటను ఎప్పుడును ఒకవిధముగ నుండును. అనుభవమునకును దానిని వెలిపఱచు రూపునకును ఇంచుమించుగ నగాధమైన పల్లమున్నందున, భేదము కలుగుచున్నది. ఎప్పుడును అంతఃప్రజ్ఞలో గలిగెడి యొక యాధ్యాత్మికానుభవము ప్రాప్తమయిన మాత్రమున, అది బాహ్యప్రజ్ఞకు మార్చబడి నీయొక్క విద్య మతము మనస్సుయొక్క శీలము, వీని ననుసరించి వేఱైన నొకవిధమున నిర్వచనము బొందుచున్నది. సత్యమేకమే, వాస్తవమేకమే; అది ఆవిష్కృతమగు నాకారము లనేకములు.

## మూడవ ప్రకరణము

### " 'జోన్ ఆఫ్ ఆర్క్' యొక్క దర్శన మెటువంటిది?"

మనము చెప్పు దేవతల లోకమునకు సంబంధించిన సత్త్వవిశేషములతో 'జోన్ ఆఫ్ ఆర్క్'కు స్పష్టముగ సంబంధ ముండెను. (సన్న్యాసుల లోకమని 'కత్తోలిక్' క్రైస్తవులందురు, కాని రెండును ఒకటి కాదు). ఆమె తాజూచిన సత్త్వములను ప్రధానదేవదూత లనెను. ఈ సత్త్వములు పరమనస్సునకును విజ్ఞానమున (సూప్రా మెంటల్)కును మధ్యనున్న, శ్రీ అరవిందులు చెప్పు "అధి మనస్సు" (ఓవర్మైండు)నకు జేరినవి. ఇది నిర్మాతల లోకము (కల్పకుల ప్రపంచము).

'జోన్ ఆఫ్ ఆర్క్'కు ఎప్పుడును గనబడుచు ఆమెతో సంభాషించుచుండిన ఇద్దఱను ఒక ఇండియను జూచినయెడల, వారు అతనికి వేఱు రూపమున గనబడుదురు. ఏలన, ఒకడు చూచునపుడు వానియొక్క మనో రూపములు బయటికి వచ్చుచున్నవి. నీవు దేనిని జూచెదవో దానికి నీవు చూడగోరు దాని రూపము నిచ్చెదవు. క్రైస్తవులు, బౌద్ధులు, హిందువులు, షింటోమతము వారలు అందఱు గూడియున్న యొక సమాజమునకు ఏక

కాలమున నొక సత్త్వము కనబడునేని, దానికి అత్యంత భిన్న నామములు ఇవ్వబడును. ఆసత్త్వముయొక్క రూపమును గుర్తించి, దీని నిట్లున్నది దాని నిట్లున్నది అనుచు జనులు అభిప్రాయమునందు వేఱుపడుదురు; కాని, అది మాత్రము ఒక్కటే ఆదిస్థానము ఇండియా లోని మీరు ఒకదర్శనము కలని, దానిని మీరు మాతృ దేవి యందురు, కత్తోలిక్కులు మేరి కన్య యందురు; జపానీయులు 'క్వానోన్' దయాదేవత యందురు, ఇతరులు ఇతరనామములతో పిలుతురు. ఒక్కటే శక్తి, ఒక్కటే ప్రభావము; కాని, దానినుండి నానామతముల యందు నానారూపములు కల్పితము లగుచున్నవి.

**"ప్రపత్తియందు సాధనయొక్క లేక శిక్షణయొక్క స్థానమెయ్యది?" ఒకడు శరణుజొచ్చిన, సాధన నియమము లేకుండ ఉండలేడా?"**

కావచ్చును. కాని, సాధనకును లేక అభివృద్ధి విధానమునకును, దృఢేచ్ఛతో గూడిన కర్మకును భేదము కలదు. సాధన వేఱు; నేను చెప్పునది దృఢసంకల్పితమైన కర్మ. నీవు ప్రపత్తిజేసినయెడల ప్రయత్నమును వదల

వ్వలెను; అనగా, దృఢసంకల్పిత కర్మనుగూడ వదలవలె నని కాదు. మఱి ఈశ్వరేచ్ఛకు నీయిచ్ఛ నిచ్చుకొనుట వలన సాక్షాత్కారమును త్వరపఱచవచ్చును. అదియు గూడ ప్రపత్తియొక్క రూపాంతరము. నీయందు అపేక్షిత మేమనగా, నీవు శిలవలె నగు నిష్క్రియ ప్రపత్తి గాదు; మఱి, ఈశ్వరేచ్ఛావశమున నీ యిచ్ఛ నుంచవలెను.

"ఈశ్వరునితో నైక్యానుభవము ప్రాప్తమగుటకు మునుపు ఇది యెట్లు సాధ్యము?"

నీకు ఇచ్ఛాబల మొకటి యున్నది. నీవు దానిని దేవున కర్పించవచ్చును. రాత్రులయందు (నిద్రయందు) జాగరణ ముండవలె నను నుదాహరణముం దీసికొనుము. నీ మనోభావము నిష్క్రియ ప్రపత్తిగా నున్నయెడల "నాకు ఎఱుకయుండవలెనని ఈశ్వరేచ్ఛయుండినచో నట్లే కాగలదు" అని చెప్పుదువు. కాని, నీయిచ్ఛను దైవమున కర్పింతువేని నీవు దృఢముగ నిచ్ఛగించి "రాత్రులయందు ఎఱుకతో నుండగలను" అని చెప్పుదువు. అది అట్లు కావలెనని నీకొక దృఢసంకల్పమున్నది,

కావున నలసుడవై సోమ్పాడి కాచుకొనియుండవు. "నాయిచ్ఛను నైజమున కిచ్చుకొనెదను ; రాత్రులయందు ఎలుక యుండవలెనని తీవ్రముగ నేను కోరెదను, కాని దానిని సాధించుటకు నాకు జ్ఞానములేదు, నైవేచ్ఛ నాకొఱకు దానిని సాధించనిమ్ము" అను నీవృత్తియందే ప్రవృత్తమంతయు వెలువరించును. నీయిచ్ఛ స్థిరముగ వ్యాపారము చేయుచునుండవలెను ; ఒక క్రియావిశేషమును జరిపించుటకేగా గాక, ఒకవిషయమును అర్థించుటకేగా గాక, సాధనీయమైన లక్ష్యముపై నేకాగ్రమైన తీవ్రేచ్ఛారూపమున (నీసంకల్పబలము పనిచేయవలెను). ఇదియే మొదటి మెట్టు. నీవు జాగరూకుడవై యుండిన, నీవు తీవ్రముగ గమనించిన, కర్తవ్యమును గురించి యూపశ విశేషరూపమున నేదైన నిస్సంశయముగ నీకు గ్రాహ్యమగును. దానిని జేయుటకు తక్షణమున నీవు ప్రవర్తించవలయును. 'శరణు' జొచ్చుట యనగా, నీక్రియకు ఫలము వేరుగనున్నను, నీ వెదురుచూచుట కన్యముగ నున్నను, దానిని నీ వంగీకరించవలయును. అట్లు కాక, నీ శరణము నిష్క్రియమగునేని, నీ వేమియు జేయవు,

చేయుచుండవు; ఊరక నిదురపోదువు. అద్భుత మేదైన ఘటించవచ్చునని కాచుకొనియుందువు.

నీసంకల్పముకాని యిచ్ఛకాని, ఈశ్వరేచ్ఛాను సారముగ నున్నదా, అని యెఱుగుటకు, నీకు ఉత్తరము (జబాబు) కలదా లేదా యనియు, నీకు ఆదరువు కనబడు చున్నదా, ప్రతిరోధము కనబడుచున్నదా యనియు నీవు గమనించి చూడవలయును; మనః ప్రాణ శరీరములచేత గాదు, అంతరమున హృదయమున ఎల్లప్పుడునుండు అని ర్వచనీయమైన (దైవసన్నిధి) దానిచేత (గమనించి చూడ వలెను).

"ధ్యానమునకై ఉత్తరోత్తరప్రయత్నము అవశ్యము కాదా? ఎంత యెక్కువకాలము ధ్యానము జరుగునో అంత యెక్కువ యభి వృద్ధి కల్గుననుట నిజము కాదా?"

ధ్యానమున గడుపు గంటలసంఖ్య ఆధ్యాత్మికాభి వృద్ధిం ప్రమాణము కాదు. ధ్యానమునకై ప్రయత్న మావశ్యకము కాకుండుటయే అభివృద్ధికి నిరూపణము; మఱియు నప్పుడు ధ్యానమును నిలుపుటకే ప్రయత్నము కావలసియుండును; ధ్యానమును నిలుపుట కష్టసాధ్య

మగును, దైవచింత లేకుండుట కష్టసాధ్యమగును, సాధారణప్రజ్ఞను విడుట కష్టసాధ్యమగును. ఎప్పుడు దైవముపై నేకాగ్రత నీజీవితమున కావశ్యక మగునో, ఎప్పుడు అది లేకుండ నీ వుండుటను సాధ్యపడదో, ఎప్పుడు ప్రాతఃకాలము మొదలు సాయంకాలమువరకు నీ వే పనిలో నున్నను అది స్వాభావికముగ నిరంతరముగ నుండునో, అప్పుడే నీ యభివృద్ధి నిశ్చితము; నీవు నిజమైన యభివృద్ధిని గాంచితివి. నీవు ధ్యానమున గూర్చున్నను ఎక్కడకైన వెళ్లి యేదైనపని జేసినను, నీకు ముఖ్యముగ గావలసినది ప్రజ్ఞ. అది ఒక్కటియే యావశ్యకము— దైవమును అనవరత మెఱింగి యుండుట.

"ధ్యానమున గూర్చుండుట అనివార్యమైన సాధన కాదా? అది దైవముతో నధికముగ నగాధమును ఏకాగ్రమును అయిన ఐక్యము నియ్యదా?"

అట్లు కావచ్చును. మనము కోరునది సాధన యనియే (సాధనకొఱకే సాధనయని) కాదు. మనకు కావలసిన దేమనగా, మనము చేయు నన్నింటియందు నెల్లప్పుడును సకలకార్యములయందును, ఒక్కొక్క ప్రవృత్తియందును

దైవము నం దేకాగ్రత బొంది యుండుట. ఇచ్చట కొందఱున్నారు, వారికి ధ్యానము చేయుడని చెప్పియున్నాము; మఱికొందఱకు ఏ ధ్యానమును జేయవలెనని చెప్పియుండలేదు. కాని, వీరు అభివృద్ధి కాలేదని తలంచకూడదు. వారుకూడ సాధన జేసెదరు, కాని అది వేఱుప్రకారము. కర్మ చేయుట, భక్తితో నాచరించుట, ఒక యంతర్నివేదనము, ఇదికూడ ఒక ఆధ్యాత్మికసాధనయే. కడపటి లక్ష్యమేమనగా దైవముతో నిరంతర మేకీభవించియుండుటయే, ధ్యానమునందు మాత్రము కాదు, సకల సందర్భములయందును, క్రియాపరమైన సకల జీవితమందును.

కొందఱున్నారు, వారు ధ్యానమున కూర్చుండియున్నప్పుడు ఒకదశను బొందుచున్నారు, అది సొగసుగను ఆనందకరముగను ఉన్నట్లు ఎంచెదరు. అందు తృప్తిజెంది సుఖాసీనులై జగత్తును మఱచెదరు; కాని వారలకేదైన స్వల్పబాధ కలుగునేని, ఆస్థితిని వదలి వచ్చి క్రోధక్షోభముల పాల్పడుదురు. ఏలన వారి ధ్యానమునకు అంతరాయము కలిగినది. ఇది యాధ్యాత్మికమయిన అభివృద్ధికి గాని సాధనకుగాని లక్షణము కాదు. కొందఱు

గలరు; ధ్యానమున దైవమునకు తీర్చవలసిన అప్పు అని వా రనుకొన్నట్లు ప్రవర్తింతురు, కనబడుదురు. వారిని మనకు ఒకమారు ఆలయమునకు వెళ్లి దానితోనే దైవమున కియ్యవలసిన యప్పును దీర్చునట్లు అనుకొను (క్రైస్తవ) జనులవంటివారు.

ధ్యానమునకు బోవ యత్నము నీకు అవశ్యమైనచో నధ్యాత్మ జీవనమును గలుగు సామర్థ్యమునకు ఇంకను చాలదూరమున నున్నావు. ధ్యానమునుండి బయటికి వచ్చుటకు ప్రయత్న మవశ్యమగు నేని, నీవు ఆధ్యాత్మజీవితమం దున్నావనుటకు నీధ్యానము నిజముగ నొక సూచన యగును.

హఠయోగ రాజయోగాది సాధన లున్నవి, ఒకడు వాని ననుష్ఠించియు నధ్యాత్మజీవితముతో సంబంధము లేకుండ నుండవచ్చును. పూర్వము (హఠయోగము) ప్రాయికముగ శరీరవశము నిచ్చును, పరము (రాజయోగము) మనోనిగ్రహమును. కాని అధ్యాత్మజీవితముం బ్రవేశించుట యనగా సముద్రమునందు దుముకి మునుగుటవలె దైవమునందు మునుగుట. మఱియు

నది ప్రారంభమే కాని అంతముగాదు. ఏలన నీవు మునిగిన తరువాత దైవమునందే వసించుటకు నేర్చుకొనవలయును. దాని నెట్లుచేయుట? "ఎచ్చట పడుదునో ఏమగునో నాకు?" అని యేచింతయు లేక తిన్నగ లోపలికి దుముకవలెను. మనస్సుయొక్క వితర్కపూర్వమైన చింతయే నిన్ను అడ్డగించుచున్నది. కేవలము నిన్ను నీవే పోనియ్యవలయును. సముద్రమున మునుగుటకు గోరుచు "హా, ఇచ్చట ఒకఱాయి యుండును, అచ్చట యొకటి యుండును" అని యూరక చింతించుచుందువేని నీవు మునగలేవు.

"కాని నీవు సముద్రముం జూచెదవు. అందువలన తిన్నగ వెళ్లి అందు దుముకవచ్చును. ఆధ్యాత్మజీవితమందు ఎట్లు మునుగుట?"

నిజమే, ఎట్లు సముద్రమున దుముకుటకుమునుపు దానింజూచి దానింగుఱించి నీకేదైన తెలిసియుండవలెనో యట్లు దైవవాస్తవమునుగుఱించి యీషన్మాత్రమైన నీకు దెలిసియుండవలెను. చైత్యప్రజ్ఞ మేలుకొనుట యే సాధారణముగ ఆ ఈషన్మాత్రదృష్టి. కాని యేదైన నొక సాక్షాత్కారము నీకు ఉండవలెను. అగాధమైన చైత్యమందు

గాఢముకాకున్నను, సమగ్రముగ నుండకపోయినను, దృఢముగ మనస్సునందైననో ప్రాణమందైననో ఒక సంబంధము (స్పర్శము) దైవముతో నీ కుండవలెను. దైవసాన్నిధ్యము నీ లోపలనైనను నిన్ను జుట్టియైనను, దృఢముగ పెనగియుండవలెను. దైవలోకపు ఉచ్ఛ్వసితము నిన్ను స్పృశించి యుండవలెను. విపక్షమునున్న సాధారణ లౌకికశ్వసితము పీడాకరమైన వాతావరణముగ నీకు అనుభవమై యుండవలెను. దానినుండి తప్పించుకొను ప్రయత్నమునకు అది నిన్నాకర్షింపవలయును. అది నీ కుండునేని, నీ విక దైవసత్యమును నిశ్శేషముగ శరణు జొచ్చి దానియందు మాత్రమే తత్సాహాయ్యశక్తుల యందే జీవించవలయును. నీ సాధారణజీవితమందు నీ యాధార (మనఃప్రాణశరీరముల) పు కొన్ని భాగముల యందో, ఆంశికముగనో (అపూర్ణముగనో) కొన్ని వేళల లోనో, కొన్ని సందర్భములలోనో దేనిని జేసియుందువో, దానినే తుట్టతుదకు సంపూర్ణముగ జేయవలెను. ఇదియే నీవు ఆచరించవలసిన మజ్జనము. ఇట్లు చేయకపోయిన, సంవత్సరములు యోగమభ్యసించినను నిజమైన యధ్యాత్మ

జీవనముంగురించి యేదియు నీకు దెలియకుండును. సమగ్రమైన సంపూర్ణమైన మజ్జనముం గైకొనుము, బాహ్యవ్యాకులతనుంచి విడుదలబొందుదువు, అధ్యాత్మజీవితపు యథార్థానుభవము నీకు ప్రాప్తమగును.

# నాల్గవ ప్రకరణము

"యోగమునం దభివృద్ధి చెందవలెనని మనయందున్న సర్వమును సమర్పణము చేయుము సర్వమును ఎంత స్వల్పమైనను దైవమున కర్పణ చేయవలయు ననుచున్నారే, దీని వాస్తవమైన భావ మేమి?"

యోగ మనగ దైవముం జేరి కూడియుండుట, ఈ ఐక్యము అర్పణమూలమున ఫలిత మగును—దైవము నకు నీ స్వాత్మ సమర్పణపై నది యాధారపడియున్నది. ప్రారంభమున, సర్వమును ఒకేసారిగ నర్పించునట్లు, సామాన్యముగ నర్పించ వొడంగుదవు. "నేను దైవ కింకరుడను; నా జీవితము దైవమునకు సంపూర్ణముగ నియ్యబడియున్నది; దివ్యజీవితమును సాక్షాత్కరించుటకే నా ప్రయత్నము లన్నియు" అని చెప్పుదువు. కాని యది ప్రథమ సోపానము; ఏలన, అది చాలదు. తీర్మానము చేసికొన్నప్పుడు దైవమునకే నాజీవిత మంతయు నర్పిత మని నీవు నిశ్చయించినప్పుడు, ఇంకను ప్రతిక్షణమును జ్ఞాపక

ముంచుకొని, నీ జీవితమందు సవిస్తరముగ (ప్రతిలేశ మందును) దాని నాచరించవలయును. ఒక్కొక్క మెట్టు నను దైవముం జేరిన వాడను నేనని నీ కనుభవ ముండవలెను. నీవు దేనిం జింతించినను జేసినను దైవ ప్రజ్ఞయే నీమూలమున జేయుచున్నదను అనుభవము సంతతము ని కుండవలయును. నాది అని యనుకొనుటకు నీ కిక నేదియు లేదు. అంతయు దైవమునుండి వచ్చు చున్నదని యనుభవించెదవు; కావున దానినంతయు మరల తన్మూలమునకే యొప్పగించవలెను. ఎప్పుడు దాని నట్లు ఎఱుగ గల్గుదువో, అప్పుడు నీవు ఎక్కువగ లక్ష్య పెట్టక, గమనించకుండు నత్యల్పవిషయము కూడ నల్ప ముగ దోచక అర్థము గలదిగా నగును. అర్థపూరితమై యావల విశాలమైన దిగంతముం(జూపును) దెరచును.

ఇట్లు సామాన్యముగ (మొత్తముగ) జేయు నర్ప ణను విస్తరమున (ప్రతిలేశమందును) ఒక్కొక్క యర్పణ యందును నడపవలెను. నిరంతరము ఈశ్వరసాన్నిధ్యమందు వసించుము; ఈ సాన్నిధ్యమే నిన్ను కదలించుచు నీవు చేయుదానినంతను జేయుచున్నదను భావముతో జీవిం

చుము. నీ సకలప్రవృత్తులను దాని కప్పగించుము, ఒకొ్క-
క్క-మానసక్రియను, తలంపును, సంవేదనమును మాత్ర
ము కాదు, భోజనాదులవంటి సాధారణమైన యత్యంత
బాహ్యక్రియలనుగూడ; నీవు భోజనము జేయునపుడు
దైవము నామూలమున భుజించుచున్నదని నీకు సంవేదన
ముండవలెను. ఎప్పుడు ఈ విధమున నీ సకల వ్యాపార
ములను ఆ ఏకజీవితమందు చేర్చి కూర్తువో, అప్పుడు నీ
యందు, విభక్తాంశముల స్థానమందు, (అవిభక్తమగు)
ఏకత్వము సిద్ధించును. తర్వాత నీ స్వభావమునందు ఒక
భాగము దైవమున కియ్యబడి, యితరభాగములు సాధా
రణరీతుల సాధారణ విషయములందు మగ్నములై యుం
డవు; నీ జీవితము పూర్ణముగ దీసికొనబడి, ఒకసమగ్ర
మైన పరివర్తన (మార్పు) నీయందు క్రమక్రమముగ
సిద్ధించును. ఈ పూర్ణయోగమందు, జీవితము సమస్త
మును, వ్యస్తముగ అల్పతమమైన లవముకూడ, మార్పు
జెందవలెను, దివ్యమయము కావలెను. ఇచ్చట అర్థహీన
ముగనో, తటస్థముగనో ఏదియు లేదు. "నేను ధ్యాన
ము జేయునప్పుడు, తత్త్వశాస్త్రముం జదువునప్పుడు, లేక,

ఈ సంభాషణల నాలకించునప్పుడు జ్యోతిక్కేసి తిరిగే తదా ధ్యానమున కున్మీలితుడనై యుండు దశలో నుండగలను, బయట వెళ్లి తిరుగుటకో మిత్రములం జూచుటకో పోవు నప్పుడు దీని నంతయు మఱచిపోనగును" అని నీవు చెప్ప రాదు. అటువంటి మనోభావముతోనే నీవు యుందువేని, ఎప్పుడును మార్పు జెందక, నిజమైన ఐక్యముం బొందక నిలిచిపోదువు; ఎప్పుడును విభక్తుడవుగానే యుందువు. ఎక్కువగానైన, ఈమహాత్తర జీవితమును గుఱించి నీకు దృష్టిలేశములు మాత్రమే గలుగవచ్చును. ఏలన, ధ్యానమునందో యంతఃప్రజ్ఞయందో కొన్ని యనుభవములు గాని సాక్షాత్కారములుగాని నీకు రావచ్చును; కాని నీ దేహమును బాహ్యజీవితమును (యథాపూర్వముగ) మార్పు జెందకయే యుండును. దేహమునుగాని బాహ్య జీవితమునుగాని గమనించకుండెడి యొక యంతఃప్రకాశ మున కెక్కువ ప్రయోజనము లేదు, ఏలన నది లోక మును, ఉన్నది యున్నట్లే, విడిచిపెట్టును. ఇదియే ఇంత వరకు ఎప్పుడును జరిగియున్నది. మహాత్తరము బలవత్త రము నగు సిద్ధిం గాంచినవారు కూడ అంతఃశాంతియందు

నిశ్చలతయందు నిర్బాధమై యుండుటకొఱకు జగత్తు నుండి నివృత్తులయిరి; జగత్తు తన పద్ధతి ప్రకారము పో నీయబడినది. మృత్యువు దుఃఖము మాంద్యము అజ్ఞానము, ఇవి భౌతికసత్యయందు (ఈలోకమందు) అబాధితములై యేలుచు వచ్చినవి ఇట్లు లోకమునుండి ముముక్షువులను ఈక్షోభమునుండి తప్పించుకొనుటయు, ఈకష్టమునుండి పరారగుటయు స్థానాంతరమున (మఱియొచ్చటనైన) సుఖ స్థితింగాంచుటయు, సంతోషకరమై యుండవచ్చును; కాని వారీ జగత్తును జీవితమును దిద్దకుండ మార్పకుండ విడి చెదరు; మఱియు వారి బాహ్యప్రజ్ఞనుగూడ మార్పు జెందించక, శరీరమునకు ఉద్ధారణ లేకుండ యథాపూర్వ ముగ నుంచి వదలివేసెదరు. వారు మరల భౌతికలోకము నకు (ఈప్రపంచమునకు) వచ్చినప్పుడు సామాన్యజనుల కంటె నింకను తక్కువవారై యుండుటకు సంభవమున్నది. ఏలన, భౌతికవిషయములపై వారు తమవశమును బో గొట్టుకొనిరి. లౌకిక జీవితమందు వారి వ్యవహారము తత్ప్రవృత్తులయందు అవినీతమై అవశమై చలించుచు నుండెడి ప్రతిశక్తియొక్క యధికారమునకు లోబడి పో నగును.

ఈ విధమైన లక్ష్యము ఎవరికి గావలెనో, వారికి అది మంచిది కానచ్చును, కాని అది మన యోగము కాదు. ఏలన మనకు కావలసినది దివ్యమైన జగజ్జయము, జగత్ప్రవృత్తుల నన్నింటిని జయించి దైవము నిచ్చటనే సాక్షాత్కరించుట. అయిన, నిచ్చట దైవముయొక్క శాసనముం గోరుదుమేని, మన మేదియై యున్నామో మనయుం దేది కలదో మన మిచ్చట దేనిం జేసెదమో దాని నన్నింటిని దైవమున కొసగవలెను. దేనినైన నప్రధానమునియో బాహ్యజీవితమునకును దాని కవశ్యములైన సాధనములకును దివ్యజీవితమందు భాగము లేదనియో తలంచగూడదు. అట్లు తలంతుమేని, ఇంతవఱకెచ్చట నుంటిమో యచ్చటనే నిలువవలసినదే, వెలుపలి జగత్తు జితము కానేరదు; స్థిరముగ నుండున దేదియు సాధితము కాదు.

"చాల వృద్ధిజెందినవారు తిరిగి యీ కక్ష్యకు (భూమికి) వచ్చెదరా?"

వచ్చెదరు. ఈ కక్ష్యను మార్చవలెనని యిచ్ఛ (దృఢసంకల్పము) వారికుండు నేని, అప్పుడు ఎంతయొక్క

వగా ఆరూఢులో అంత నిశ్చితముగా మరల వచ్చుదురు. వారు, మఱియు పాఱిపోవలెనను నిచ్ఛగలవారుకూడ ఆప్రక్కకు వెళ్లినప్పుడు తమ పలాయన మంతగా నప్పటికిని ఉపయోగకరము కాలేదని గనుకొనవచ్చును.

"అనేకులకు తాము ఆప్రక్క వెళ్లి తిరిగి యిచ్చట వచ్చితిమని జ్ఞాపక ముండునా?"

ప్రజ్ఞయం దొక యవస్థావిశేషముం జెందునపుడు స్మరణ యున్నది. ఈదశను ఆంశికముగ స్వల్పకాలము కొంత స్పృశించుట (బొత్తిగ కాదు) అంతకష్టము కాదు; ధ్యానమునందో, స్వప్నమునందో, దర్శనమునందో, ఈ జీవితమును మునుపు నడిపినట్లును ఈ యుపలబ్ధి యుండియున్నట్లును, ఈ సత్యము తెలిసియుండినట్లును ఒకనికి సంవేదనమో సంస్కారమో కలుగవచ్చును. కాని అది పరిపూర్ణమైన ఉపలబ్ధి కాదు. అది ప్రాప్తమగుటకు, మనలోనున్న శాశ్వతప్రజ్ఞను బొందియుండవలెను, అది సంతతస్థాయి, మనయొక్క భూతభవిష్యద్వర్తమానస్థితులను జేర్చి పట్టుకొనియున్నది.

## నాల్గవ ప్రకరణము

"మనము మనోవృత్తులయందుగాని బుద్ధివ్యాపారములయందు గాని ఏకాగ్రముగ నున్నప్పుడు కొన్నిసమయములయందు దైవమును మఱచిపోదుము. లేక, దైవసంబంధమునే (స్పర్శనే) పోగొట్టు కొందుము. ఇది ఎందులకు!"

సంబంధము తప్పిపోవుటకు కారణ మేమనగా, నీ ప్రజ్ఞ యింకను విభక్తమై యున్నది. నీమనస్సునం దింకను దైవము నెలకొని యుండలేదు. నీవు దివ్యజీవిత మునకై సంపూర్ణముగ నివేదితుడవు కాలేదు. అట్లు కానియెడల, నీ వెంతమట్టుకైనను అటువంటి విషయ ములయం దేకాగ్రుడవై యుండదగును, అయినను దైవము చేత నుపకృతుడను ఆదృతుడను అను బుద్ధి నీ కుండును.

సకలప్రవృత్తులందును, బుద్ధివిషయములందు కాని క్రియావిషయములందు కాని, "జ్ఞాపక ముంచుకొని యర్పించుము" అనునది యాదర్శవాక్యముగ నీ కుండ వలయును. నీవు దేనిం జేసినను అది దైవమున కర్పణ ముగ నుండనిమ్ము. ఇది నీకు ప్రశస్తమైన యొకసాధన నియమముగ నుండును. నిష్ప్రయోజన మూఢకృత్య ముల జేయనీయకుండ నిన్నది నివారించును.

" తఱుచుగ నొకకార్యము నారంభించునపుడు ఇట్లు చేయ దగును. కాని యొకడు కర్మయందు మగ్నుడుకాగా విస్మరించును. స్మరణ యెట్లు సాధ్యమగును?"

దైవము లేకుండ ఏకర్మను జేయుట యసాధ్య మను నొక ప్రజ్ఞయే మనకు లక్ష్యముగ నుండవలసిన దశ, (జ్ఞానస్థితి) యోగముయొక్క నిజమైన నిష్పత్తి; అదియే అంతమున సిద్ధి, ప్రాప్తి; తక్కిన దంతయు దానికై తయారుచేయును; ఏలన, అట్టిస్థితిలో నీవు దైవము వినా ఉండుదు వేని, నీకర్మకు మూలమే ఉండకపోవుచున్నది; జ్ఞానము, శక్తి, సర్వము గతించినదగును. కాని ఉపయో గించు శక్తులన్నియు నీకు సొంతమైనవని నీవు తలంచు వఱకు, దైవముయొక్క యాదరము లేదను జ్ఞానము కూడ నీకుండదు. నీవు యోగము నారంభించునప్పుడు అడుగడుగునకు దైవమును మఱచిపోవచ్చును. అయి నను, నిరంతర తీవ్రేచ్ఛచేత నీస్మృతి వృద్ధిజెంది విస్మృతి తగ్గును. కాని, దేనినైనను కఠిననియమముగనో, కర్తవ్య కర్మయనియో చేయరాదు; సంతుష్టిప్రేమల ప్రవృత్తిగ నది యుండవలెను. పిదప ఒకస్థితి(దశ)వచ్చును. అప్పుడు

నీవు ప్రతిక్షణమును దేనిం జేయుచుండినను దైవసన్నిధి ననుభవించక పోయినయెడల తత్క్షణమున నేకాకివిగానై దుఃఖితుడ వగుదువు.

దైవసాన్నిధ్యముం గమనించకయే (ఎఱుగకయే) నీవొక పని జేసి సంతుష్టుడవై యుండగలవని నీకు ఎప్పుడైన గనబడినచో, నీ (సత్త)యందు ఆ భాగము ఇంకను దైవమునకు నివేదితము కాలే దని నీవు తెలిసికొనవలయును. దైవము అవశ్యమని వేదనమే లేని సాధారణ మానుష్యకముయొక్క పద్ధతి యది. కాని దివ్యజీవితము నన్వేషించువానికి పద్ధతి వేఱు. ఎప్పుడు నీకు దైవముతో పూర్ణముగ నైకోపలబ్ధి కలుగునో, అప్పుడు, దైవము ఒకక్షణము నిన్ను విడిచి మరలినయెడల నీవట్లే మృతుడవై పడెదవు; ఏలన దైవము ఇప్పుడు నీప్రాణమునకు ప్రాణము "ప్రాణస్య ప్రాణః". నీయొక్క సకలసత్త అద్వితీయమైన పరిపూర్ణమైన నీయొక్క యాదరము. దైవ మచ్చుట లేక పోయిన నేదియు మిగిలియుండదు.

"యోగముయొక్క యారంభదశలలో సాధకుడు సాధారణ (లౌకిక)మైన పుస్తకముల జదువవచ్చునా?"

నీవు పావనగ్రంథముల జదువవచ్చును, అయినను దైవమునకు చాలదూరమున నుండవచ్చును. అత్యంత మాధుర్యమయగ్రంథములం జదువుచు దైవసంపర్కము నుంచుకొనవచ్చును.మార్పుయొక్క రుచి నీకు దెలియుటకు మునుపు మార్పుజెందిన ప్రజ్ఞను గుఱించియు, తద్వ్యాపారములం గుఱించియు నొకభావ మేర్పడుట యసాధ్యము. దైవముతో నైక్యము ప్రాప్తమయిన ప్రజ్ఞ యందొకపద్ధతి కలదు; అందు నీవు గమనించున దంతయును రసించునట్లే చదువునదంతయును రసించవచ్చును, నిస్సార గ్రంథములనుగూడ రుచికరముకాని వస్తువులను గూడ. గుణముగల గానమును వినవచ్చును, ఎటువంటి గానమును వినిన నొకడు బాఱిపోవుట కిచ్చగించునో,అట్టిదానిం గూడ. దానిని రసించవచ్చును, దానిబాహ్యరూపుకై కాదు, దానివెనుక యేదియున్నదో దానికై. సాధ్వసాధు గీతముల భేదజ్ఞానమే నాశమగుచున్నదని కాదు; వానిలో దేనిమూలమున నైనను అవి యావిష్కరించుదానిం బ్రవేశింతువు; ఏలన దైవమునందు ఆధారములేనిదై పరమైన వాస్తవములేనిదై జగత్తునం దేదియు నుండ

లేదు. బయటగనబడు స్థూలమును, ధర్మ్యమును, రమణీయమును అగు రూపముతో నాగిపోక ఆవలపోయి చైతన్యముతో పదార్థములందు దివ్యాత్మతో సంపర్కమొందుదువేని,క్షుద్రముగను పీడాకరముగను విసంవాదిగను మాత్రమే ఏది సాధారణబుద్ధిని బాధించుచున్నదో దానిమూలముననే సౌందర్యమును ఆనందమును బొందగలవు.

"ఒకని జీవితమందు జరిగినదంతయు న్యాయ్యము అనుటకు జరిగినదంతయు జరుగవలసినదే యని అనవచ్చునా?"

జరిగినది జరుగవలసిన దనుట స్పష్టమే; అట్లు ఉద్దిష్టము కాకయుండనిచో జరిగియుండదు. మనము చేసిన పొరపాటులు, మనకువచ్చిన దుర్దశలునుగూడ సంభవించి నందులకు కారణ మేమన, వానికి ఆవశ్యకత యుండెను, మనజీవితములకు (వానివలన) ఏదో ప్రయోజన ముండెను. నిజముగ ఈ విషయములను మనస్సుచేత (మానవ బుద్ధికి తగినట్లు) వ్యాఖ్యానము జేయ నలవికాదు, చేయను దగదు. ఏలన, సంభవించినదంతయు నవశ్యమయ్యె, మన మనస్సు అనుకొను హేతువుంబట్టి కాదు, మఱి మనస్సు

దేనిని కల్పించుకొనుచున్నదో దాని కతీతమై యొకదానికి దీసికొనుపోవుటకు గాను. అయినను, వ్యాఖ్యానము చేయ వలసిన యవసర మేమున్నది? ప్రతిక్షణమును ప్రతి యొక్కదానిని సర్వజగత్తును వివరణ జేయుచు నున్నది. సమస్తజగత్తుయొక్క స్వభావమునందుండు రీతింబట్టియే ఒక్కొకవిషయము సంఘటించుచున్నది. అనగా అలంఘ్య మైన ప్రకృతియొక్క నియతిని మనము గ్రుడ్డితనముతో నొప్పుకొనుటకు బద్ధులమని యర్థము కాదు. అతీతమును భూతార్థముగ నొప్పుకొని దానియందున్న యావశ్య కతను నీవు చూడవచ్చును; అయినను అది (అతీతము) నీకిచ్చిన యనుభవమును వర్తమాన భవిష్యత్తులను నిర్ణ యించి నడుపుటకు కావలసినశక్తిని జ్ఞానపూర్వకముగ సంపాదించుకొనుట కుపయోగించుకొనవచ్చును.

"ఒకసంభవముయొక్క కాలముకూడ దైవముయొక్క విషయవిధానమందు పూర్వమే నిర్ణీతమై యున్నదా?"

అంతయు ఏ కక్ష్యలోనుంచి చూచెదమో దానిని అనుసరించి యున్నది. దైవచైతన్యపుకక్ష్య యొకటి యున్నది, అందు సర్వమును పూర్ణముగ విదితము. విష

యముల సకలఘటనయు పూర్వమే వీక్షితమైనది, పూర్వమే నిర్ణీతమయినది. అటువంటిదర్శనము విజ్ఞానమయ కక్ష్యయొక్క యున్నతతర ప్రదేశములయందు కలదు. అది పరమపురుషుని స్వీయదృష్టి. కాని మనకా ప్రజ్ఞ లేనప్పుడు, ఆప్రాంతమునకే యుక్తమైనవియు, వ్యవహారమందు సార్థకమైన మనదృష్టిపద్ధతికి సంబంధించనివియు, నైన యాభాషలలో భాషించుట వ్యర్థము. ఏలన, క్రిందటికక్ష్యపు ప్రజ్ఞయందు ఏవియు నిర్ణీతమై సిద్ధముకాలేదు, అంతయు సాధింపబడు పద్ధతియందే యున్నది. ఇచ్చట సిద్ధములైన భూతార్థములు ఏవియు లేవు. సాధ్యము లెవ్వియో వానివ్యాపారమే యున్నది. సాధ్యముల సంఘర్షణలవలన నేది ఘటించవలెనో అదియే నిష్పన్నమగుచున్నది. ఈకక్ష్య(భూకక్ష్య)యందు మనము వరించి (దేనినైనను) తీసికొనవచ్చును. సాధ్యమైన నొకదానిని నిషేధించి, మఱియొకదానిని స్వీకరించ నగును. ఒకమార్గము ననుసరించి, మఱియొకటినుండి నివర్తించనగును. ఇప్పుడు నిజముగ జరుగునదంతయు పూర్వమే పైకక్ష్యయందు చూడబడి నిర్ణీతమయి యున్నను వీనినంత మనము చేయవచ్చును.

పర చేతనకు సర్వమును ముందఱనే తెలియును. వలన, ఆమెయొక్క నిత్యత్వమునందు సర్వము నచ్చట సిద్ధమై(ఉపలబ్ధమై) యున్నది. కాని,స్వలీలార్థమై,తనపరమ స్వరూపమునందు పూర్వమే యాదిష్టమైన దానిని భౌతిక కక్ష్యయందు వ్యవహారమున నిర్వర్తించుటకై, ఆమె కథ నంతను ఎఱుగనిదానివలె భూలోకమున నిచ్చట చరించు చున్నది; క్రొత్తగ నింతవరకు తాను పరీక్షించనినూలును నేయుచున్నట్లు ఆమె ఆచరించుచున్నది. పరప్రజ్ఞయందు గల తనభావిజ్ఞానమును వ్యవహారమునందు విస్మరించు టయే (విస్మృత్యాభాసము) పురుషవ్యక్తికి క్రియాపర మైన జీవితమందు స్వేచ్ఛాస్వాతంత్ర్యసోద్యోగబుద్ధి నిచ్చుచున్నది. ఇవియే వానియెడనున్న ఆచరణార్థకము లైన యుపకరణములు, ఉపాయములు. ఈసాధనము (యంత్రమువంటి యుపకరణము) ద్వారమున స్థానాంతర మున మునుపే దృష్టములై ఘటితములైన ప్రవృత్తులును ఫలములును యిచ్చట నిష్పన్నము లగుచున్నవి.

ఒక నటుని దృష్టాంతము నుదాహరించిన, నది బోధోపకారక మగును. నటునకు తాను నటించవలసిన

నాటకభాగమంతయు తెలియును. రంగమున సంభవము యథోక్త పూర్వోత్తరసంబంధముతో వానికి విదితము. కాని వాడు రంగమున కేగునప్పుడు దేనిని నెఱుగని వానివలె గనబడవలెను; వీని నన్నింటిని మొదటిసారి యనుభవించువానివలెను, యాదృచ్ఛిక సంభవముల తోను తటాలున ఘటిల్లునవన్నింటితోను గూడిన బొత్తిగ నొక క్రొత్తప్రపంచము తన కంటిముందఱ వ్యక్తమగు చున్నట్లును తాను అనుభవించి నటించవలెను.

"అట్లయిన వాస్తవమైన స్వాతంత్ర్యము లేదా? సర్వము, మన స్వేచ్ఛకూడ, పూర్వమే నిర్ణీతమా, విధిపరత్వమేనా (విధి వాదము) పరమరహస్యము?"

స్వాతంత్ర్యము, విధి-(పురుషకారము, దైవము లేక విధియనుట మనవారిసంప్రదాయము) ఈ రెండును చేతనయందు వేఱువేఱు ప్రస్థములయందలి సత్యములు. అజ్ఞానము చేత మనస్సు రెంటిని సమతలమందు ఒకదానికి విరుద్ధముగ మఱియొకదానిం బెట్టుచున్నది. చేతన లేక చైతన్య మనునది యేకరూపమైన సత్యము కాదు, అది (బహురూపము) సంకులము. అది యొక సమతలమైన

భూమి కాదు, బహుముఖవిస్తారము గలది. అత్యున్నత శిఖరమునందు పరవస్తువు (పరమపురుషుడు) ఉన్నది; అతి నీచమైనలోతున జడము (భౌతికవస్తువు) ఉన్నది. దిగువ ఈలోతుకును పైనున్నతశిఖరమునకును మధ్య చేతన యందు అంతము లేని కక్ష్యలపరంపర యున్నది.

భౌతిక కక్ష్యయందు, సాధారణ ప్రజ్ఞాభూమి యందు, నీవు కాళ్లుసేతుల గట్టుబడియున్నావు. ప్రకృతి యంత్రయుక్తికి దాసుడవై కర్మ యను సంకెలచేత బద్ధుడవైతివి; అచ్చట, ఆసంకెలయందు ఎది సంభవించి నను అదిపూర్వకృతమునకు అనివార్యమైన ఆనుషంగికము (ఫలము). స్వతంత్రవృత్తియని భ్రమయొక్కటికలదు; నిజ ముగ, ఇతరులు చేయుదానినే నీవు చేసెదవు, ప్రకృతి యొక్క జగద్వ్యాపారములే ప్రతిధ్వనివలె నీయెడ ప్రతి ఫలించుచున్నవి. ప్రకృతియొక్క బ్రహ్మాండయంత్రము యొక్క మర్దన చక్రమున (చిక్కుకొని) సాహాయ్యము లేక పరిభ్రమించుచున్నావు.

కాని, అది యట్లుండ నవసరము లేదు. నీ కిష్ట ముండిన నీస్థానమును మార్చుకొనవచ్చును. యంత్రము

నందు చితుకగొట్టబడి, బొమ్మవలె నాడించబడి క్రిందపడి యుండుటకంటె నీవు పైకిపోయి అచ్చటనుండి చూడ వచ్చును; నీ ప్రజ్ఞను మార్చుటచేత ననివార్యములని తోచు పరిస్థితులను నడపుటకును నియతములైన స్థితు లను మార్చుటకును ఒక పిడిని కూడ సంపాదించుకొన వచ్చును. నీ వీ సుడినుండి బయటికివచ్చి పైన నిలిచిన మాత్రమున స్వతంత్రుడవని (బంధము లేక ముక్తుడవని) నీవే నిన్ను ఎఱుగుదువు. సర్వనిర్బంధములనుండి విము క్తుడవై, నిష్క్రియమైన ఉపకరణము కాకుండ యుండు టయే కాక, కార్యకారిగను అగుదువు. నీయొక్క కర్మల ఫలములచేత బద్ధుడవు కావని మాత్రము కాదు. నీవు ఆ ఫలములంగూడ మార్చగలవు. ఒకతూరి శక్తుల లీలను (వ్యాపారమును) జూచుదువేని, ఒకతూరి శక్తుల యుత్పత్తి స్థానములుగల చైతన్యైకత్వ్యకు నిన్ను దెచ్చుకొని, ఆ క్రియాపరశక్తులతో ననన్యుడవై యుండుదువేని, పిదప నీవు చాలితముం జేరినవాడవు కావు, చాలకమును జేరిన వాడ వగుదువు.

కర్మచక్రమునుండి నిర్గమించి, దివ్యవ్యాపారము నకు బోవుట—ఇదియే యథార్థముగ, యోగముయొక్క లక్ష్యము. అజ్ఞుడైన దాసుడవై అసహాయుడవై (అవశుడై) శోచనీయమైన యుపకరణమై ఏ ప్రకృతియొక్క యంత్రభ్రమణమం దున్నావో, యోగముచేత దానిని వదలి మఱియొక (చైతన్య) కక్ష్యకు ఆరోహించుదువు; అచ్చట, పరతరమైన విధిని సాధించుటయందు ప్రాజ్ఞుడైన భాగహారుడవై క్రియాపరుడైన యధికారి వగుదువు చేతన (ప్రజ్ఞ) యొక్క ఈగతి ప్రకారము ద్వివిధముగ నున్నది. మొట్టమొదట నొక ఆరోహణమున్నది; భౌతిక చేతన (స్థూలప్రజ్ఞ) కక్ష్యనుండి పైనున్న ప్రకృష్టప్రాంతములకు బోదువు. కాని, క్రిందనుండి పైకి యీ ఆరోహణము పైదానిని క్రింద నవరోహించుట కావహ్వానించును. నీవు భూమినుండి పైకి పోవునప్పుడు పైనుంచి భూమికి ఏదైన కొంతదెచ్చెదవు. ప్రాతస్వభావమును మార్చునదియో లేక మార్చుట కుపకారియో అయిన శక్తినో, జ్యోతినో (తెచ్చుదువు), తరువాత నీప్రజ్ఞయందును సత్త్వమందును ఊర్ధ్వాధోభాగములు, బాహ్య

భ్యంతరములైన ఆ స్తరములు (పటుపులు)—అంతవరకు ప్రత్యేకములుగ, అసంబద్ధములుగ, భిన్నభిన్నములుగ నుండినవన్నియు కలసి మెల్లమెల్లగ జేరుచు క్రమక్రమముగ సంవాదరూపమై ఒకటే సత్యముగ గూడిపోవును.

ఈవిధముననే, అద్భుతము లని చెప్పబడునవి సంభవించుచున్నవి. ఈజగత్తు లెక్కలేని ప్రజ్ఞాకక్ష్యలతో నిర్మితమైయున్నది; ప్రతి కక్ష్యయందును ప్రత్యేక నియతు లున్నవి. ఒకకక్ష్యయొక్క నియతులు మఱియొకకక్ష్యకు సరిపడవు. ఈ భౌతికకక్ష్యకు (ఇతరకక్ష్యలనుండి) ప్రజ్ఞా-అచ్ఛక్తులు తటాలున స్ఫుటితమై దిగుటయే అద్భుతము, కాని వేఱేదియు కాదు, అతిసాధారణముగ ప్రాణమయ కక్ష్యపుశక్తులే యిట్లు (హఠాత్తుగ దిగును) యంత్రరచనవలెనున్న భౌతికకక్ష్యపై, పైనున్నకక్ష్య (యంత్రరచనవంటిది) హఠాత్తుగ పడుచున్నది. అదియెట్లన మన సాధారణప్రజ్ఞయొక్క యావరణమును, (మేఘమునువలె) ఒకవిద్యుత్ప్రభవచ్చి చీల్చి యందు ఇతరశక్తులను ప్రవృత్తులను, ఫలితములను వర్షించునట్లుండును. ఫలితమును అద్భుతమందుము, ఏలన మనకు సామాన్యముగ

గోచరమగు విషయమందు స్వాభావిక నియతులకు హఠా త్తుగ బాధమును తటాలున మార్పును మనము చూచె దము, కాని దాని హేతువును దాని క్రమమును మన మెఱుగలేము, చూడలేము; ఏలన యద్భుతమునకు మూలము మఱియొకకక్ష్య యందు కలదు. పరలోకముల నుండి యీ భౌతికలోకమునకు ఏర్పడు ఆక్రమణములు చాల యసాధారణము కాదు, అవి సంతతము సంభవించు నవి కూడ; మనకు చూచుటకు కన్నుండు నేని నిరీక్షించుటకు తెలియు నేని యథేష్టముగ నద్భుతములను గానవచ్చును. క్రింద భూమి-చైతన్యమునకు(మన స్థూల ప్రజ్ఞకు) పైనున్న యుత్కృష్ట(చేతనాంశ)ములను దించుటకు ప్రయత్నించు వారల యెడ విశేషముగ నవి (అద్భుతములు) సంతత ముండును.

"సృష్టికి నిర్దిష్టమైన లక్ష్యము కలదా? ఏదైన నిశ్చితమైన సమాప్తిం బొందుటకు అది చలించు చున్నదా?"

లేదు. జగత్తు గతిమయమైనది, అనవరతము వివృత మగుచుండును. ఇదియే అంతయు, ఇదియొక్కటియే లక్ష్యము అని స్థాపించుటకు ఏదియు లేదు. కాని కార్య

నిమిత్తమై అంతములేని గతిప్రవాహములందు ఒకఖండ మును దీసికొని ఇదియే లక్ష్యము అదియే లక్ష్యము అని చెప్పవలసియున్నది. ఏలన, కార్యమందు మనలక్ష్యము నుంచుటకు ఏదో యొకటి కావలసియున్నది. *ఒకచిత్రపట

* సృష్టిగతి నిరంతరముగ ప్రవహించును, అంతములేనిది అని చిత్రలేఖ దృష్టాంతమూలమున నిచ్చట వివరించబడి యున్నది. ఈ దృష్టాంతముయొక్క భావమును ఇంచుక విశదపఱచెదము.

ఒకచిత్రమునకు "ఘటనావిధానము" "వర్ణవిధానము"ను అవశ్యము. ఏచిత్రమును లిఖించ నుద్దేశమో, దానియొక్క అవయవ సంనివేశము భావమందు మొదట గుదిరియుండవలెను; అనగా, చిత్రముయొక్క ఒక్కొక్క అంగమును తక్కిన యితరాంగముల తోను అంగియగు చిత్రముతోను ఎటువంటి సంబంధముతో నుండ వలెనో ఎంతప్రమాణముగలదై యుండవలయునో, అదియే అవయవ సంనివేశముతోగూడిన "ఘటనావిధానము" సంయోగము, కూర్పు. అట్లే ఏరంగు ఏ అంగమునందు ఎంత బలప్రమాణములతో నుండవల యునో, అదియే వర్ణవిధానము.

ఈఘటనావిధానము వర్ణవిధానమును స్థిరమై కుదిరినపిదప చిత్రము లేఖకు అవతీర్ణ మగుటకు ఒక పరిచ్ఛేదమును కల్పించుట యవశ్యము, కాని ఆ అవధి నిజము కాదు, కల్పితము. అట్లే ఆకృతి

మునకు నిర్దిష్టమైన ఘటనా(కూర్పు)విధానము వర్ణవిధానమును ఆవశ్యకము. నీవు ఒకఅవధిని (పరిమితిని) ఏర్పఱచుకొనవలయును. అందు నియమితమయిన ఆకృతినిర్మాణ

---

నిర్మాణము అవశ్యము, దానికి ఒకవిధి కలదు. అది సంప్రదాయసిద్ధము, చిత్రకలావేత్తల సమ్మతిం బడసినది; అది వారల సంకేతము, పరిభాష. చిత్రలేఖకు ఇదియుం నవశ్యము. కాని, చిత్రముయొక్క ఘటనావిధానము మాత్రము స్థిరము, నిరంతరముగ నున్నది. లేఖ నియమానుసారముగ నెన్ని ఆకృతిరచనలయందైనను చిత్రము లిఖితము కావచ్చును, ఏలన ఆకృతిరచనాపరంపరకు అంతములేదు.

ఈ దృష్టాంతమునుండి తేలినది యిది.

ఎట్లు చిత్రమునకు పరిచ్ఛేదము నిజము కాక కల్పితమే అయినను ఆవశ్యకమైనదో, అట్లే సృష్టికి నిర్దిష్టమైన లక్ష్యము ఆత్యంతికముగ నిజము కాకపోయినను కార్యనిమిత్తమై ఆవశ్యకమయినది. చిత్రముయొక్క ఘటనావిధానము ఒక ఆకృతిరచనతోనే ఆగిపోవక, నిరంతరముగ నెన్నిరచనలయందుగాని యుండవచ్చునో, అట్లే సృష్టియొక్క నిర్దిష్టమైన లక్ష్యము నెఱవేఱినపిదప అది ఆగిపోవదు, నిరంతరముగ లక్ష్యాంతరమునకై పోవును. అనగా, సృష్టిగతికి అంతము లేదు; అది ఏలక్ష్యవిశేషసిద్ధియందును సమాప్తము కాదు. అనవరతము గతిప్రవాహమున నవధిపై నవధిని కల్పించుచు లక్ష్యములను సాధించుచు అనంతముగ నుండునని ఫలితార్థము.

మందు చిత్రమంతను ఉంచవలెను; కాని, ఈపరిచ్ఛేదము ఒకభ్రమయే, ఆకృతికల్పన పట్టి సంప్రదాయమాత్రమే. ఒక ఆకృతినిర్మాణము నతిక్రమించి చిత్రమునకు నిరంతరముగ అనుక్రమము కలదు. అనుక్రాంతమైన ఒక్కొక్క చిత్రమును ఆరచనానియమములతో అంతములేని ఆకృతినిర్మాణపరంపరయందు రచించదగును. మనలక్ష్యము ఇది, అది యని చెప్పెదము, కాని, అది తదతీతమైన లక్ష్యమునకు ప్రారంభమే అని మనకు తెలియును, ఆలక్ష్యము గూడ నింకొకలక్ష్యమునకుం గొంపోవును. ఈపరంపర వృద్ధియగుచు నుండును, ఎప్పుడును నిలువదు.

# అయిదవ ప్రకరణము

"బుద్ధికి యుక్తమైన వ్యాపార మెయ్యది? అది సాధనకు అనుకూలమా ప్రతికూలమా (విఘ్నమా)?"

బుద్ధి అనుకూల మగునో ప్రతికూల మగునో అది పురుషుని పైనను దాని నుపయోగించు విధముపైనను ఆధారపడియున్నది. బుద్ధికి యథార్థమైన వ్యాపార మొకటి కలదు, అపార్థమైనది (తప్పిదమైనది)యు మఱొకటి కలదు; ఒకటి ఉపకారక మగును. మఱియొకటి ప్రతిబంధక మగును. స్వప్రాధాన్యమందు నత్యధికముగ విశ్వసించుచు స్వార్థమునకై తృప్తింగోరెడి బుద్ధి పరతరసాక్షాత్కార మునకు ఉపరోధ మగును.

కాని, ఇది ఒక విశిష్టార్థమందు గాని బుద్ధివిషయమై మాత్రమున గాని వాస్తవము కాదు; సామాన్యముగ నితరకరణములం గుఱించియు (నిట్లే చెప్పనగును). ఉదాహరణము: జనులు జీవితమందలి యిచ్ఛలను, అనన్యా

సక్తితో బూర్తి జేసికొనుట ఒకధర్మమని పాటించరు; ఒక మర్యాదను (అతిక్రమించరానిది) దెలుపుటకు ధర్మాధర్మ బుద్ధిని ఉపదేశికగ నొప్పుకొందురు. బుద్ధివ్యాపారముల యందే మనుజుడు ఏదియు ఉపదేశకము కాని నివారకము కాని లేకుండ నుండనచ్చునని ఎంచును!

పురుషునియొక్క యేభాగముగాని తనకు యోగ్యమైన స్థానమునుండి తనకు నియమితమైన కార్యముం జేయునేని అది సాహాయ్యకారియే. కాని, అది తన క్షేత్రమును దాటి పదముంచిన, మెలివడినదిగను విపర్యస్తముగను, అందువలన నయథార్థముగను అగును. ఒకశక్తి దైవోద్దేశమునకైన క్రియయందు ప్రవృత్తమగునప్పుడు అది సాధుప్రవృత్తి గలది; స్వార్థతృప్తికైన క్రియయందు ప్రయుక్తమగునప్పుడు అసాధుప్రవృత్తి కలదగుచున్నది.

బుద్ధి తన యథార్థస్వభావమునందు ఆవిష్కరణమునకు క్రియకు నుపకరణముగ నున్నది. మనస్సుకుపైనుత్తరప్రాంతముల రాజిల్లు నిజమైనజ్ఞానమునకును, ఇచ్చట క్రింద (అనుభవమునకు దెచ్చుకొనవలసిన) ఉపలబ్ధికిని ఒకవిధమైన మధ్యవర్తినలె నున్నది బుద్ధి. అది, సామాన్య

ముగ మనస్సు అనునది, ఆకృతి నిచ్చుచున్నది; ప్రాణము క్రియావేగమును ప్రాణబలమును ఇచ్చును; భౌతికము కడకువచ్చి దేహబంధ మొనర్చును.

"అదృశ్యములైనను తప్పక జీవించుచు ఘనముగను (స్పర్శ యోగ్యము) ఉన్న ప్రతికూలశక్తుల నెదురుకొనుట యెట్లు?"

అది నీ ప్రజ్ఞాభివృద్ధిస్థితింబట్టి చాలవఱకాధారపడి యున్నది. ప్రారంభమున, నీకు గూఢార్థవిశిష్టమైన జ్ఞానము శక్తియు లేనియెడల, సాధ్యమైనంతవఱకు నిశ్చలముగను శాంతముగను ఉండుట యుత్తమము. (విరోధిశక్తుల) ఆక్రమము ప్రతికూలాశయ రూపముం దాల్చునేని, ఒక(ఘనమైన) భౌతికవస్తువును త్రోయునట్లు, వానిని శాంతముగ నెట్టివేయ యత్నించుము. ఎంత శాంతుడవై యుందువో, అంత బలవంతుడ వగుదువు. ఆధ్యాత్మిక బలము అంతటికి సమతాస్థితియే దృఢమైన యాధారము. నీసామ్యస్థితిని బాధించునట్లు దేనిని విడువ కూడదు. అప్పుడు ఏవిధమైన నభిద్రవమును నివారించ గలవు. అదియును గాక దుష్టాశయములు నీకడకు వచ్చు

నపుడే వానిని జూచి పట్టుకొనుటకు చాలినంత నిరీక్షణము నీకు ఉండునేని వానిని త్రోసివేయుట నీకత్యంత సులభ మగును; అయినను, కొన్నివేళల నవి నీకు తెలియకయే వచ్చివేయును, అప్పుడు వానితో పోరాడుట ఎక్కువ కష్టముగ నుండును. అట్లగునపుడు నీవు కదలక కూర్చుకొని, శాంతిని అగాధమైన యంతర్నిశ్చలతను క్రిందికి పిలువవలెను. నీవు దృఢముగనుండి విశ్వాసము తోను శ్రద్ధతోను ఆహ్వానించుము. నీ ఉత్కాంక్ష (తీవ్రేచ్ఛ) స్వచ్ఛముగను దృఢముగను నున్నయెడల, సాహాయ్యమును నీవు నిస్సంశయముగ పొందుదువు.

ప్రతికూలశక్తుల యాక్రమము అనివార్యము. నీ మార్గమునందు అవి పరీక్షలని యెంచి, ధైర్యముతో నిలిచి ఆ పరీక్షయందు దేరవలెను. పోరాటము కఠినముగ నుండవచ్చును, కాని దానినుండి నీవు బయల్పడునప్పుడు ఏదైన నొక లాభమును పొందినవాడవైతివి, ఒకమెట్టు ముందఱ వెళ్లినవాడవయితివి. శత్రుశక్తులు ఉండుటకు ఆవశ్యకతకూడ కలదు. అవి నీనిశ్చయమును బలపఱచును, నీయుత్కాంక్షను స్వచ్ఛపఱచును.

ఎట్లయినను అవి యేమో యున్నవనుట వాస్త వము; ఏలన అవియుండుటకు నీవు హేతువు నొసంగితివి. వానికి ఉత్తరమిచ్చుటకు నీయందేదైన నుండు నంతవఱకు వాని ప్రవేశము సంపూర్ణముగ న్యాయ్యము. ఉత్తరమిచ్చుటకు నీయెడ ఏదియు లేదేని, నీ స్వభావమునందు ఏభాగముపైనను వానికి పట్టు లేదేని, అవి నివృత్తములై నిన్ను వదలును. ఎట్లయినను, అవి నీ యాధ్యాత్మికాభివృద్ధిని నిలుపుట కాని అడ్డగించుట కాని అవశ్యము కాదు. శత్రుశక్తులతో యుద్ధమునందపజయము బొందుటకు ఒక్కటేమార్గము, అదేమన, దైవ సాహాయ్యమునందు నిజమైన విశ్వాసము లేకుండుటయే. ఉత్కాంక్షయందలి ఆర్జవము ఎల్లప్పుడు కావలసిన (దైవ) సాహాయ్యముం దెచ్చును. నిశ్చలముగ నాహ్వానించుట, సాక్షాత్కారమునకేసి యీ ఆరోహమునందు నీవెప్పుడును ఏకాకివై యున్నవాడవు కావని దృఢనిశ్చయము, ఎప్పుడుకాని సాహాయ్యము కావలయునేని అది సిద్ధమగు నున్నదను శ్రద్ధ—ఇవి నిన్ను సుఖముగ సురక్షితునిగ గొంపోవును.

# అయిదవ ప్రకరణము

" ఈశత్రుశక్తులు సామాన్యముగ బయటనుండి వచ్చునా, లోపలనుండియా ?"

లోపలనుండి వచ్చునట్లు తలంపో, సంవేదనమో నీకుండునేని, నీవు ఒకవేళ వానికి ఉన్మీలితుడవై (తెఱచి యిచ్చుకొన్నవాడవై) అవి కనబడకుండ నీలోపల నమరియుండును. వస్తువులయొక్క యథార్థస్వభావము సంవాదసంపన్నమైనది (సమరసభావము గలది). కొన్ని లోకములయందు (వక్రత) దూషణమేర్పడి విపర్యయమును విరోధమును దెచ్చుచున్నది. ఈ వక్రిమగల లోకములతో నీకు బలమైన సంబంధము (ఆకర్షణము) ఉన్నయెడల, అచ్చట నున్న సత్త్వములతో మిత్రమై వానికి పూర్ణముగ నుత్తరమియ్యగలవు. అట్లు అగుటకు సంభవమున్నది, కాని యది సుఖమైన స్థితి కాదు. ప్రజ్ఞ తత్క్షణమున అంధిత మగును, సత్యాసత్య వివేచనసామర్థ్యము లేకపోవును; ఏది నిజము, ఏది అబద్ధము అని చెప్ప లేక పోదువు.

ఎట్లయినను, ఒక ఆక్రమము వచ్చునపుడు అది బయటనుండి వచ్చునదని పాటించి "ఇది నేను కాను,

దీనితో నాకే సంబంధము లేదు” అని చెప్పుట అత్యు త్తమమైన వివేకదృష్టి. అదేవిధమున నీచములైన ప్రేరణ లను ఇచ్ఛలను మనస్సునందలి సకలసందేహములను వితర్కములను నడుపవలెను. వానివిషయమై తదేకభావమును బొందుదువేని వానితో పోరాడుకష్ట మింకను ఎక్కువ యగును; ఏలనగా, ఎప్పుడును సులభము కాని నీ స్వభావమును జయించు కార్యమునకు బూనుచున్నావను అనుభవము నీకున్నది. కాని ఒకమారు “కాదు, ఇది నేను కాదు, దీనితో నేసంబంధమును నాకు లేదు” అని చెప్పగల్గితివేని వానిని చెదరగొట్టుట చాలసులభమగును.

“బాహ్యమునకును ఆంతరమునకును గల భేదమును దెలుపు గీత నెచ్చట వేయదగును?”

ఆగీత చలమైనది (స్థిరము కాదు); నీ యిచ్ఛాను సారముగ నెంత నీకు సమీపముగ నుండదగునో అది అంత దూరముగను ఉండదగును. అన్నింటిని నీపై వేసికొని నీయొక్క నిజమైనయాత్మను జేరినభాగమని యను భావించవచ్చును; లేదా, నఖమునో కేశఖండమునో తీసి

వేయునట్లు అబాధితుడవై దానిని నీవు త్రోసివేయ వచ్చును.

కొన్ని సమయములు (మతములు) ఉన్నవి, తన్మతానుసారులు తమ మూర్తిత్వమునకు ఏదైన హాని రాకలదని భయపడి ఒకవెండ్రుకనుగాని గోరునుగాని వదలరు. జగత్తంతవిశాలముగ తమప్రజ్ఞను విస్తరించుకొనుటకు ఎవరు శక్తులో, వారు జగత్తుగనే యగుదురు; మఱి యెవరు తమ మితమైన సంవేదనలయందును అల్పమైన దేహముల యందును అడగియున్నారో, వారు అంతమాత్రముతో నిలుచుదురు; తమ దేహములును తమ యల్పవేదనములు నే వారికి తమసంపూర్ణమైన ఆత్మ

"కేవలము శ్రద్ధ సర్వమును సృజించ నగునా? సర్వమును జయించ నగునా?"

అగును, కాని ఆశ్రద్ధ సమగ్రముగ ననన్యముగ నుండవలెను. మఱియు నది సరియైన విధముగ నుండవలెను, కేవలము మనోవృత్తిబలముగనో ఇచ్ఛాబలముగనో యుండక, దానికంటె నధికముగ లోతుగ నున్నదియై యుండవలెను. మనస్సుచేత ప్రయోగించబడు సంకల్ప

బలము ప్రతివ్యాపారముల నుత్థాపించి (లేపి) ప్రతిరోధములను బుట్టించును. "కూఎ" అను నాతడు రోగనివృత్తి జేయు పద్ధతిని గుఱించి కొంత మీరు వినియుండ వచ్చును. ఈశక్తియొక్క రహస్యమును కొంత నాతడెఱిగి ఎక్కువగ సఫలముగా దానిని ఉపయోగించుకొనెను; కాని దానికి భావన (కల్పన) అని పేరిడెను; ఆతనిపద్ధతి అతడు ప్రబోధపఱచిన శ్రద్ధకు చాల మానసరూపమొసంగినది. మానసిక శ్రద్ధ చాలదు, భౌతికమందును (దేహమందును) గూడ ప్రాణమందును శ్రద్ధ గలిగి దానిని బలపఱచి పూర్తి జేయవలెను. నీయందు, సమస్తసత్తయందును నీవిధమైన నొక సమగ్రశక్తిని సృజించుకొనగల్గుదువేని, అపుడు ఏదియు దాని నడ్డగించుటకు శక్తముకాదు; కాని, నీవు క్రింద మగ్నమైన చేతనవఱకు పోయి దాని నంది, దేహముయొక్క (ప్రతిజీవాణువునందును) శ్రద్ధను దృఢముగ స్థాపించవలెను. ఉదాహరణము: ఇప్పుడు మరణమనివార్యముకాదు అనుజ్ఞానము భౌతికశాస్త్రవేత్తలయెడ నుదయమగుచున్నది. కాని మానవజాతియంతయు మరణము నందు దృఢముగ నమ్ముచున్నది; అది చిరంతనస్థాయియయిన

ననుభవముపై నాధారపడియున్న సాధారణమానవబుద్ధి యని చెప్పనగును. ఈ నమ్మకమును మొట్టమొదట జాగరితమనస్సునుండి, పిదప ప్రాణస్వభావమునుండి, చేతన మగ్నమై యుండు భౌతిక (శరీర) ఆస్తరములనుండి త్రోసివేయనగునేని, మృత్యు వికనేమాత్రము అనివార్యము కాకపోవును.

"కాని మరణబుద్ధి మానవుని మనస్సునందుమాత్ర మున్నదా? వానికి మునుపే తిర్యక్సృష్టికి తెలియును."

మరణము ఒక భూతార్థముగ భూమియందు సకలజీవితమునకు సంబంధించి యున్నది. దానియందు ప్రకృతికి ఆదియందు ఏ యుద్దేశముండినదో దానికి వేఱుగ మనుజుడు అర్థము జేసికొనుచున్నాడు. మానవునియందును వానిమట్టమున కత్యంతసమీపమున నున్న జంతువులయందును, మరణముయొక్క యావశ్యకత ఒక విశిష్టరూపముందాల్చి వాని ప్రజ్ఞకు ఒక విశిష్టార్థయుక్తమై యున్నది. అపర ప్రకృతి (క్రింది అంతస్తులో నున్నది) యందు మగ్నమైన చేతనయందు మఱుగుపడియున్న జ్ఞానము దానిని (మరణావశ్యకతను) నాదరించుచున్నది;

అజ్ఞానమే (మనయందు) పునరుజ్జీవనము, మార్పు, పరివర్తన, ఇవి ఆవశ్యకములను నొక సంవేదనముగ నున్నది.

భూమియందు జడము (భౌతికవస్తువు)యొక్క అవస్థావిశేషములవల్ల మరణము అత్యావశ్యక మయినది. జడముయొక్క పరిణామక్రమముయొక్క అర్థమంతయు నేమనగా ప్రారంభమున నుండిన ప్రజ్ఞాశూన్యావస్థనుండి క్రమక్రమముగ ప్రజ్ఞకేసి వృద్ధియగుటయే. మఱియు నీవృద్ధియొక్క పద్ధతియందు, విషయములు సంభవించిన విధమున, రూపముల విలయము అనివార్యమైన ఆవశ్యకతగా నయ్యె. ఏలన, వ్యవస్థితమైన వ్యక్తిచైతన్యమునకు (అఖండమగు చిత్తు ప్రత్యేకముగ వ్యవస్థితమైనది) స్థిరమైన యాధార ముండుటకై ఒక దృఢమయిన రూపమవశ్యమయ్యెను. కాని ఆరూపముయొక్క దృఢత్వమే మరణమును తప్పక వచ్చుదానినిగా జేసెను. జడము (భౌతికము) రూపములను స్వీకరించవలసివచ్చెను. ఇది (జడరూపము) లేకుండ, ప్రాణశక్తులును చైతన్యశక్తులును ప్రత్యేకముగ వ్యక్తమై ఘనమైన దేహసంబంధముం బొందుట శక్యముకాదు. ఇవి (ఈ శక్తులు) లేకుండ, భౌతిక

కక్ష్యయందు వ్యవస్థితమైన జీవితమునకు అపేక్షితము లయిన ముఖ్యస్థితులే లేకపోయియుండును. కాని నిర్ణీతమును ఘనమునైన యొకనిర్మాణము ఘనముగను కఠినముగను స్తబ్ధముగను అగుటకు దగిన శీలమును సంపాదించుకొనును. వ్యక్తిరూప మెక్కువ బంధకరమైన యాకృతిగనుండుచునే వచ్చెను. అది శక్తులయొక్క గతుల ననుసరించ జాలదు. అది విశ్వగతమైన క్రియాపరత్వమునందు, క్రమక్రమముగ నగు మార్పుతో సమరసపడి తాను మార్పు జెందదు, ప్రకృతి దేని నపేక్షించునో దానిని ఎల్లప్పుడును ఇయ్యజాలదు, దానితో నడవజాలదు. గతి ప్రవాహమునుండి బయటపడును. రూపమునకును దానిని నెగ్గెడు శక్తికిని గల అంతరమును విసంవాదమును పెరుగుచు పోవునపుడు ఒకస్థితి వచ్చుచున్నది. అపుడు రూపమునకు సంపూర్ణవిలయమగుట అనివార్యము. ఒక క్రొత్త రూపము సృజింపబడవలెను; క్రొత్త సంవాదము (సామరస్యము) సామ్యమును సాధ్యములు కావలయును. ఇదియే మరణమునకు యథార్థమైన లక్షణీయమైన యర్థము. ఇదియే ప్రకృతియందు దాని కుపయోగము. కాని

రూపము త్వరితముగను నమ్యముగను అగునేని, దేహాను నందలి ప్రత్యణువును మాఱుచుండు చేతనతో గూడ మార్పు జెందుటకు మేలుకొను నేని (రూపము) బలాత్కారముగ నాశము జెంద నక్కర లేదు. మృతి ఇక ననివార్యము కాదు.

"ఒకరు చెప్పియున్నారు; ప్రకృతియందు ఉత్పాతములు, సంకటములు, భూకంపము, జలప్రళయము, భూఖండములు మగ్నము లగుట, ఇవి సంవాదశూన్యమై పాపిష్ఠియైయున్న మానుష్యకమువలన సంభవించు నవి, మానవజాతి క్రమక్రమముగ వృద్ధియగునపుడు భౌతిక ప్రకృతియందు తదనుగుణముగ మార్పు ఏర్పడును అని. ఇది యెంత వఱకు నిజము?"

సత్యము ఇట్లుండ బోలును: చైతన్యముయొక్క ఒక్కటే వ్యాపారము ఉత్పాత సంకట సమాకులమైన ప్రకృతియందును విసంవాదియైన మానుష్యకమునందును వెలువడును. రెండు విషయములును కారణకార్యములు కావు; మఱి, ఒకమట్టమునందే ఉండునవి. రెంటికిపై నొకచైతన్యము భూమియందు స్వావిష్కారమునకును దేహబద్ధమగుటకును యత్నించుచున్నది.ఇది జడ(భౌతిక)

మునకేసి దిగునపుడు ఎచ్చటను, మనుజునియందు భౌతిక ప్రకృతియందు ఒకే ప్రతిరోధమును గాంచుచున్నది. భూమియందు మనము చూచు నక్రమము విసంవాదము నంతయు నీ ప్రతిబంధకముయొక్క ఫలితము. ఉత్పాత సంకటములు, హింసాకలహములు, అంధకారాజ్ఞాన ములు—చేటులన్నింటికి ఉత్పత్తిస్థాన మొక్కటియే. మానవుడు బాహ్యప్రకృతికి కారణము కాదు, బాహ్యప్రకృతియు మానవునకు కారణము కాదు. కాని రెంటికిని వెనుక మహత్తరమైన ఒకదానిని రెండును ఆశ్రయించి యున్నవి. దానిని వెలువడించుటకై యనవరత మభివర్ధమానమైన భౌతికలోకపు గతివిశేషమునందు ఒక భాగమే రెండును.

ఇపుడు దివ్యచైతన్యమునుండి కొంత స్వచ్ఛముగ నిచ్చుట దెచ్చుటకు చాలినంత గ్రహణసామర్థ్యము నున్మీలనమును భూమియం దెచ్చుటనైన మేలుకొనునేని, భౌతికమునందు ఈ అవతరణము ఆవిష్కృతియును అంతర్జీవితమును మార్చుటయే కాక భౌతిక పరిస్థితులను, మానవునియందును ప్రకృతియందును భౌతికావిష్కృ

తినిగూడ మార్చును. ఈ యవతరణము సాధ్యమగుట సమస్త మానుష్యకముయొక్క స్థితిపై నాధారపడి యుండ లేదు. భౌతికస్థితులను ప్రకృతియొక్క గతిని మార్చుటకు జ్యోతిని దెచ్చుటకును చాలినంత శక్తిగల సామరస్యము, ఏకీభావము, తీవ్రేచ్ఛ, వీనిం బొందుదశకు సకలమానవ సంఘము వచ్చునంతవఱకు మనము కాచుకొని యుండ వలయునేని, మనకు ఆశయే యుండనక్కఱలేదు (నిరాశులు గావచ్చును). కాని ఒక పురుషవ్యక్తియో ఒకచిన్న సంఘమో మితసంఖ్యగల ఈ యవతరణమును సాధింప వచ్చును. ఈవిషయమున పరిమాణమో విస్తారమో కాదు ముఖ్యము. దివ్యచైతన్యమునుండి ఒకబిందువు భూమి చైతన్యముం బ్రవేశించినను సర్వమును మార్చుదగును.

చేతనయొక్క పైకక్ష్యలు క్రిందికక్ష్యలును సంపర్కమొంది కలిసిపోవుట యను గహనమైన రహస్యమే గొప్ప రహస్యము, గూఢమైన ఉద్ఘాటకము (దాగియున్న బీగము). ఎల్లప్పుడును దానికి పరివర్తన (మార్పు) జేయు శక్తి కలదు. ఇచ్చుటమాత్రము ఎక్కువకొలది గలదై ఉన్నతతరదశను బొందును. ఇంతవఱకు ఇచ్చుట ఆవిష్కృ

తము కాని శక్త్యాతో జ్ఞానపూర్వకముగ సమాగమమునకు శక్తుడై యిపుడమియం దెవడేని యున్నయెడల, తనచై తన్యమునం దాకశక్త్య నారోపించుటచేత నాతడాకశక్త్య కును భౌతికమునకును సమాగమ మొనరించి సమరసత్వము నేర్పఱచగల్గినయెడల, అపుడు ఇంతవఱకు అనుపలబ్ధ మైన ప్రకృతియొక్క పరివర్తనకైన నిశ్చితగతివిశేషము ఘటించును. ఒక క్రొత్తశక్తి దిగి భూమియందు జీవితము యొక్క స్థితులను మార్చును.

ఇప్పు డున్నట్లు గూడ, ఒక్కొక్కతడవయు ఒక మహాత్ముడు వచ్చి సత్యముయొక్క ఒకానొక ప్రకాశ మును వెలువఱచి భూమికి ఒకక్రొత్తశక్తిని దెచ్చినప్పు డంతయు, ఎదురుచూచినట్లే ఆశపడినట్లే కాకపోయినను, భూమియందలి పరిస్థితులు మాఱియే యున్నవి. ఉదా హరణము: అధ్యాత్మానుభవము, ప్రజ్ఞ, జ్ఞానము వీని యందు ఒకస్థితిని బొందిన ఒకడు వచ్చి "నేను మీకు ముక్తిని (విడుదలను) దెచ్చుచున్నాను" లేక "మీకు శాంతిని దెచ్చుచున్నాను" అని చెప్పియున్నాడు. ఆతనిం జుట్టి యుండినవారలు ఆ విడుదలను లౌకికరీతిగ ఆతడు

తీసికొనివచ్చునట్లు నమ్మిరో ఏమో; వారు అనుకొన్నట్లు కాకపోయినదానిని కనుగొన్నపుడు, అతడు సాధించిన కార్యమును వారెఱుగలేరైరి. అతడు తెచ్చిన చేతన, ప్రజ్ఞయందు ఒకమార్పు, అంతవఱకు వారు ఎఱుగని ఒకవిధమైన శాంతి, అంతకు మునుపు లేకుండిన విమోచనార్థమయిన యొక సామర్థ్యము. కాని, ఈ ప్రవృత్తులు అంతరజీవితముం జేరినవి, లోకమునందు చక్కగ బోధ్యమగు వెలుపలి మార్పును దెచ్చియియ్యలేదు. లోకమును బాహ్యముగ మార్చవలెనను నుద్దేశము లేకుండెనేమో; ఆవశ్యకమైన జ్ఞానము లేకుండబోయెనేమో; అయినను, ఈపురస్సరులచేత ఏదో కొంత సాధింపబడెను.

చూచుటకు ఎంత ప్రతికూలముగ దోచినను, ఈ భూమి సోపానక్రమమున (మెట్టుమెట్టుగ)నొక సాక్షాత్కారవిశేషమునకై సిద్ధపఱచుకొనునదై యుండవచ్చును. నాగరికతలో మార్పు వచ్చియున్నది, ప్రకృతియందును మార్పే. అది మనకు స్పష్టముగ గనబడకపోయిన, దానికి కారణమిది; మనము బాహ్యదృష్టితో జూచుచున్నాము. జడము తత్కష్టములును ఇంతవఱకు తీవ్రముగను

సంపూర్ణముగను విచారితములు కాలేదు. అట్లయినను, ఆంతరముగ నొక యభివృద్ధి (అయియే) వచ్చియున్నది; అంతః ప్రజ్ఞయందు జ్యోతియొక్క అవతరణములు జరిగి యున్నవి. కాని, జడమునందు సాక్షాత్కారవిషయమై దేనిం జెప్పుటయు కష్టము; ఏలన నచ్చట ఇంతకు మునుపు ఏమి జరిగియుండవచ్చునో మనము యథార్థ ముగ నెఱుగము.

చిరంతన భూతకాలమందు గొప్పనాగరికతలు సుందరములైనవి ఉండియున్నవి. భౌతికము గమన నాగరి కతయంత వృద్ధిజెంది యుండబోలును. ఒకస్థితిలోనుండి చూచినయెడల అత్యంతాధునికమయిన సభ్యత (సంస్కా రము, వ్యుత్పన్నత) అతి ప్రాచీనసభ్యతల పునరావృత్తియే యని దోచును, కాని యెచ్చటను అభివృద్ధియే కాలేదని యెవడును అనలేడు. ఒక అంతరభివృద్ధియేని సాధితమయి యున్నది; పరతరచైతన్యమునకేసి ప్రబోధకై వలసిన పక్వస్థితి ఎక్కువగ భౌతికమైన జడభాగములయందు జనించియున్నది. ఒకదానినే మరలమరల చేయవలసిన దవశ్యమయినది; ఏలన, చేయబడిన ప్రయత్నము చాలి

నంతవఱకు చేయబడలేదు. ఒక్కొక్క తడవయు యథేష్టముగ కర్తవ్యముయొక్క రీతిని సమీపించు చున్నది. ఒక ప్రయోగమును తిరిగితిరిగి అభ్యసించినపుడు ఒకదానినే యెప్పుడును ఆవృత్తిచేయునట్లు తోచును, కాని మొత్తముగా కూడిన ఫలితము ఒక అమోఘమైన మార్పు.

పొరబాటు ఏమన, ఈ విషయములను మానవ ప్రజ్ఞాపరిమాణానుసారముగ చూచుట; ఏలనగా, అట్లు చూడబడు, నీయగాధ విశాలములైన గతివిశేషములు వివరించుటకు అశక్యములుగ దోచును. మితమైన మనోమయబుద్ధిచేత వానిం దెలిసికొనుటకో వివరించుటకో ప్రయత్నించుట అపాయకరము. ఈ కారణమువల్లనే పదార్థరహస్యమును ప్రకాశపఱచుట తత్త్వశాస్త్రమునకు అశక్యమయ్యె; ఏలన, నది మానవమనస్సుయొక్క పరిమాణమునకు తగినట్లు జగత్తును యోజించుటకు బూనెను.

“ మనలో నెందఱకు పూర్వజన్మస్మృతి కలదు ?”

అందఱివద్దను ప్రజ్ఞయం దొకభాగమునందు, ఒక స్మృతి (జ్ఞాపకశక్తి)యున్నది. కాని యిది ఒక అపాయకర

మైన విషయము; ఏలన, మానవమానసము విచిత్రకథ యందు అనురాగము గలది. పునర్జన్మ యాథార్థ్యముం గుఱించి కొంత దెలిసికొన్నతోడనే, అది దానింబుట్టి సుందరమైన కథలను కల్పించగోరును. ఈ లోకము ఎట్లు నిర్మితమయినది, ఇది భావియం దెట్లు నడచును, ఎట్లు ఎచ్చట నీవు పూర్వము పుట్టితివి, ఇక పై నీభావి యెట్లగును, నీవు జీవించి గతించిన జన్మలు, ఇకపై రాగల జన్మలు—వీని నన్నింటిని గూర్చి యద్భుతకథల ననేకులు నీకు చెప్పుదురు. దీనికంతటికిని అధ్యాత్మజీవితముతో నేసంబంధము లేదు. నిజమైన పూర్వజన్మస్మృతి సమగ్రజ్ఞానమం దొక భాగమే; అది యిటువంటి కాల్పనిక భావనల వలన లభించదు. అది ఒకప్రక్క విషయజ్ఞానముగ నున్నది, కాని మఱియొకప్రక్క పురుషగతమైన అంతరనుభవముపై నాధారపడియున్నది, (కావున) ఇచ్చట లేనిదానిని గనిపెట్టుటకును, ఉన్నదానిని వికారపఱచుటకును, మిథ్యానిర్మాణమునకును సంభవమున్నది. ఈవిషయముల సత్యమును బొందుటకై అనుభవించెడి నీప్రజ్ఞ నిర్మలముగను, ప్రసన్నముగను, మనఃప్రాణ చర్చలనుండి విముక్తమయ్యు

నుండవలెను, నీ స్వాభిప్రాయ సంవేదనములనుండియు విడుదల నొందవలెను, స్వమార్గానుసారముగ వివరణ వ్యాఖ్యలజేయు మనస్సుయొక్క అలవాటునుండియు విమోచన మొందవలెను. ఒక పూర్వజన్మానుభవము యథార్థముగ నుండవచ్చును, కాని నీవు చూచినదానికిని దానిం గురించి నీయొక్క మనస్సు చేయు వివరణకును లేక కల్పనకును అగాధమైన యంతర మున్నది. నీవు మానవ సంవేదనముల దాటి పైకిపోయి మనస్సునకు వెనుకను బోవ గల్గునపుడే సత్యమును అందగలవు.

# ఆఱవ ప్రకరణము

"కొందఱు మనుజులు భూతముల (పిశాచముల)వలె గనబడుచున్నారు. వారి స్వరూప మేమి? ఏల అట్లున్నారు?"

వారు మానవులు కారు. ఉన్నది, కనబడునది మానవరూపము మాత్రమే. వారు మన భౌతికలోకమునకు అనంతర మున్న లోకమునుండి, మనము ప్రాణలోకమని చెప్పు కక్ష్యలోనుండి, ఇచ్చటి శరీరములం ప్రవేశించు సత్త్వవిశేషములు. ఆలోకము కామప్రేరణ రాగోద్రేక భూయిష్ఠంబైనది, లోభహింసాకైతవాది సకల విధాజ్ఞాన ప్రవృత్తులు కలది; అయినను, సకలక్రియాతంత్రములును, సకల ప్రాణవీర్యములును, సకల శక్తులును అచ్చట గలవు. ఈలోకపు సత్త్వములకు స్వాభావికముగనే ఈ జడలోకముపై చిత్రమైన పట్టుగలిగి దుష్టచేష్టం బ్రయోగించుట వీలగును. వానిలో కొన్ని ఈ భూమికక్ష్యకు సమీపమున నున్న ప్రాణావరణమందు,

మనుజుని మరణాంతమున పట్టుదలతో విలంబించుచున్న ప్రేతశేషములనుండి రూ పెత్తుకొనును. శరీర నాశము నకు తర్వాతగూడ మనుజుని ఈషణాలు, బుభుక్షలును (ఆకలి, భోగేచ్ఛ) ఇంకను నక్కడ దేలుచు, రూపముతో నుండును; తఱుచుగ అవి తమ్ము నావిష్కరించుటకును తృప్తిపఱచుకొనుటకును చాలితము లగుచున్నవి; అందు లకు ఫలితమే ప్రాణలోకపు ఈజంతువుల జన్మము. అయి నను, ఇవి అల్పసత్త్వములు; ఇవి పీడాకరములుగ నుండు టకు శక్తములైనను, వానితో వ్యవహరించుట యసా ధ్యము కాదు. మఱికొన్ని కలవు, అవి చాల నపాయకర ములు; అవి ఇంతవఱకు మనుజరూపమున నుండియుండ లేదు; భూమియందు మనుజదేహామందు జనించియుండ లేదు. ఏలన, చాల తరుచుగ నీవిధమున జననముం బడ యుట కొప్పుకొనవు; కారణ మే మన, అది జడమునకు దాస్య మగుట; అందువలన తమలోకమునుండియే ప్రబ లముగను ధౌష్ట్యముతోను భూమియందలి ప్రాణులపై నధికారమును సలుప గోరును. అవి భూమియందు బుట్టుట కిచ్ఛగించక పోయినను, భౌతికప్రకృతియొక్క బంధము

లేకుండ దానితో సంపర్కమును మాత్రమును ఇచ్ఛగించును. వాని పద్ధతి యిది: మొదట అవి తమ ప్రభావమును మనుజునిపై వేయబూనును, తర్వాత మెల్లగ వాని వాతావరణముం బ్రవేశించి, తుదకు యథార్థమైన మానవజీవుని వానిమూర్తిత్వమును త్రోసివేసి, వానిపై సంపూర్ణస్వామ్యముం బొందును. ఈ జంతువులు మనుజదేహము నాక్రమించియున్నప్పుడు వానికి మనుజరూపముండవచ్చును గాని, ఒక మనుజస్వభావ ముండదు. మానవసత్త్వముల ప్రాణశక్తిని ఆకర్షించుట వాని యలవాటు; అవి ఎచ్చట సాధ్య మగునో అచ్చట ప్రాణశక్తి నాక్రమించి పట్టుకొని ఆహారముగ జేసికొనును. నీ వాతావరణమునకు అవి వచ్చునెడల నీవు తటాలున నిరుత్సాహుడవై నిస్సత్త్వుడవగుట నీ కనుభవ మగును. వాని సమీపమున కొంతకాల ముండినను నీవు జబ్బుబడెదవు; వానిలో నొకదానితో వసించుదువేని, అది నిన్ను చంపవచ్చును.

"అవి చుట్టుప్రక్కకు వచ్చివేసిన, వానిని అటనుండి ఒకడు ఎట్లు తొలంచ నగును?"

ఈ సత్త్వములయందు శరీర మెత్తుకొన్న ప్రాణ శక్తి చాల భౌతిక తరగతిని జేరినది, కావున కొంత దూరమే యది వీర్యముగలదిగ నుండును. సాధారణముగ, నీవు వానితో నొకయింట వసించక, వాని సాంగత్యమం దుండకపోయిన, వానిచేష్టకు లోబడవు కాని, వానితో వ్యవహారమునకు గాని సంబంధమునకు గాని ఒక కుల్యను (కాలువను) ఏర్పఱచుదువేని— ఉదాహరణముగ, పత్రమూలమున— ఆశక్తులకును నీకును పరస్పరము వ్యవహారమేర్పడి చాల దూరమునుండి కూడ వాని తంత్రమునకును నీవు లోబడుట కవకాశ మేర్పడును. నీకు గుప్తవిద్యాజ్ఞానము సామర్థ్యము నుండి నీవు కవచము వేసికొని నిన్ను రక్షించుకొనుటకు నేర్చుకొనియుండిన దప్ప, ఈ సత్త్వములతో సర్వసంబంధమును ఛేదించి వానితో నే వ్యవహారము లేకుండ నుండుటయే వీనివిషయమున అత్యుత్తమ వివేకి పద్ధతి; (ఆ జ్ఞానము సామర్థ్యమును ఉన్నను) వానితో చరించుట యెప్పుడు నపాయకరము. కొందరు తలచునట్లు వీనిని మార్చుటకు ఆశపడుట ఒక వృథాభ్రాంతి; ఏలన వానికి మార్పుజెంద నిచ్ఛలేదు.

ఏదైనమార్పు జరుగనిచ్చుటకును వాని కుద్దేశము లేదు. ఆ మార్గమున (చేయు) ప్రయత్నమంతయు వ్యర్థము.

ఈ సత్త్వములు మనుజశరీరమం దున్నప్పుడు నిజముగ (తా మెవరని) తమ స్వరూప మిటువంటిదని తరుచుగ ఎఱుగవు. కొన్ని వేళలలో తాము సామాన్యరీతిగ మానుషములు కావు, అని అస్పష్టమైన వేదనము వీనికుండును. కాని కొన్ని చాల యెఱుకతో నున్నవి; తాము మానుష్యకమునకు జేరినవి కావు అని ఎఱిగియుండుటమాత్రము కాదు, తమస్వరూప మిట్టిది అని యెఱిగి, ఆ జ్ఞానానుసారముగ నాచరించి విచారపూర్వకముగ తమలక్ష్యసిద్ధికై పోవును. ప్రాణలోకసత్త్వములు స్వభావముచేతనే శక్తిగలవి. ఆ శక్తితో జ్ఞానమును గూడునపుడు అవి ద్విగుణముగ నపాయకరము లగును. ఈ ప్రాణులతో జేయదగిన దేదియు లేదు. వానిని పిసికి పిండిజేసి నాశముజేయుటకు సామర్థ్య ముండిన దప్ప, వానితో వ్యవహారమును వదలవలెను. బలాత్కారముగ వానితో సంగమ మేర్పడినచో, అవి ప్రయోగింపదగు మాయమువిషయమై జాగరూకుడవై యుండుము.

ఈ ప్రాణమయ సత్త్వములు, భౌతిక కక్ష్యయం దావిర్భవించునపుడు (అన్య) మనస్సును స్వవశము గావించుకొను శక్తికి గల్గియుండును; ఏలన, వాని ప్రజ్ఞకు ముఖ్యస్థానము (కేంద్రము) ప్రాణలోకమునం దుండెడిది, ఈ జడలోకమునందు కాదు. మానవజీవులు తమభౌతిక ప్రజ్ఞ (స్థూల జ్ఞానము) యందు ఆవృతులై ఖర్వీతులైయున్నట్లు, అవి యుండ లేవు.

" ఈ ప్రాణులు అధ్యాత్మజీవితమునకేసి యసాధారణాకర్షణ చేత లాగబడుచున్నవి యనుట నిజము కాదా ? "

అవును. ఏలన, తా మీ భూమికి జేరినవి కావనియు వేఱొచ్చటనుండియో వచ్చినవనియు వానికి వేదన ముండును; తమకు శక్తులు గలవనియు, వానిలో నర్ధము నష్టమైనదనియు నెఱిగి యవి వానిని (ఆ నష్టశక్తులను) మరల సంపాదించుటకు నుత్సుకములై యుండును. కావున, నవి యెప్పుడైన నదృశ్య ప్రపంచపు జ్ఞానమును కొంత నియ్యగల వాని నెవనినైన చూచినయెడల, వానికడకు వేగముగ నేగును. కాని అవి ప్రాణప్రపంచమును అధ్యాత్మ ప్రపంచ మని పొరబాటుపడి తమ పరిశ్రమలయందు

ప్రాణమయ లక్ష్యముల ననుసరించును గాని ఆధ్యాత్మిక లక్ష్యముల ననుసరించవు. లేక పోయిన, నొకవేళ నవి యాలోచనపూర్వకముగ నధ్యాత్మభావమును భ్రంశ మొందించి (చెడగొట్టి) తమ స్వభావపు రూపునందు ఆధ్యాత్మికాభాసము నొక్కటిని నిర్మించ బూనును. అట్లయినను గూడ, అది, అధ్యాత్మజీవితమునకు తమపద్ధతి ప్రకారము అవి యాచరించు ప్రణాతియే, వానిస్వదోష ప్రమార్జనమే యగును. అదియు గాక వానిని నిర్బంధ పెట్టు నొకవిధ యాకర్షణము కూడ కలదు. అవి దైవ శాసనమునకు విరుద్ధముగ కలహించినవి, అట్లు అభిద్రోహ ముజేసినను— ఒకవేళ ఆద్రోహము జేసిన కారణము వల్లనే—దైవ సాన్నిధ్యమునకు ఎట్లో కట్టుపడినట్లు ఎఱిగి దానిచేత బలవత్తరముగ నాకృష్టము లగును.

ఈప్రకారముగనే, ఇవి భూలోకమం దధ్యాత్మజీవనమును సాక్షాత్కరించుటకై యున్నవారలను నొకరితో నొకరిని సంబంధింప జేయుటకు కొన్నిసమయములలో నుపకరణములుగ నుపయుక్తము లగుచున్న వనుటను నీవు కనుగొనవచ్చును. అవి నిర్బంధమువల్లనే కాని ఉద్దేశ

పూర్వకముగ నిట్లుపయోగ పడవు. ఇది అవి యొనర్చు నొకవిధమైన నిష్కృతి, పరిహారము. అవి అవతరించు జ్యోతిర్ఝరమును అనుభవించెడివి. తాము మారవలెను, లేదా, నాశముకావలెను. దైవేచ్ఛను శరణుజొచ్చి మహావిధానమందు భాగమెత్తుకొనవలెను, లేదా, ప్రజ్ఞాశూన్యతయందు మునిగిపోయి, అంతరించవలయును. ఇట్లు రెంటిలో నొకదానిని నిశ్చితముగ గోరవలసిన కాలము వచ్చినది, లేక,వచ్చుచున్నదని అవి యెఱుగును. ఒక సత్యాన్వేషితో సంపర్కము అటువంటి సత్త్వము మాఱుటకు సందర్భము నొసంగును. అంతయు ఆసత్త్వము, సందర్భము నుపయోగించుకొను రీతి నాశ్రయించి యున్నది. యుక్తముగ నుపయోగించుకొన్నచో, ప్రాణమయ ప్రాణులు ఏవస్తువునుండి సృష్టములో ఆ యన్ధతాంధకార దుఃఖమయము నుండి విమోచనమొంది యవి పునర్జన్మమును (సాధు) జీవితమునుం బొందుటకు మార్గమేర్పడును.

"ధనబలముపై నీసత్త్వముల కెక్కువ వశముండ లేదా?"

ఉన్నది. ధనబల మిపుడు ప్రాణలోకపు సత్త్వముల యొక్కయు శక్తులయొక్కయు హస్తగతముగనో, లేక

తత్ప్రభావాక్రాన్తముగనో యున్నది. ఈ యధికారము వల్లనే, పరమార్థవిషయమై ఎక్కువ ధన ముపయుక్త మగుటను నీవెప్పుడును గానవు. ఎప్పుడును అది అపథము నకు బోవును. ఏలన, నది శత్రుశక్తుల పాల్పడి భూలోక ముపై తమ పిడిపట్టు పెట్టుటకు ఒక ముఖ్యోపాయముగ నున్నది. ధనబలముపై విపక్షశక్తులకు గల యధికారము బలవత్తరమై పరిపూర్ణమై చక్కగ వ్యవస్థం బొందియున్నది, కావున నీదిట్టమైన సంవిధానమునుండి దేనిని గ్రహించు టయు అతికష్టమైన కార్యము. ఒక్కొక్కసారియు ఇప్పుడు తద్రక్షకులై యున్నవారలనుండి స్వల్పధనముం దీయుటకు ప్రయత్నించునపుడు, ఒక ఘోరయుద్ధము జరుపవలసి యున్నది.

అట్లయినను, ధనముపై నధికారముగల విరుద్ధ శక్తులపై నెచ్చటనైన గలుగు లక్షణీయమైన యొక జయము తక్కినయితర స్థానములందును ఏకకాలమున స్వయంప్రేరితముగ జయమును సాధ్యముం గావించును. అవి యొకచోట లోబడునేని, ఇప్పుడు పరమార్థవిష యమై ధనమియ్యలేము అని తలచువార లందఱకును

ఇయ్యవలెనని తీవ్రమైన గొప్పకోరిక పుట్టును, ప్రాణశ
క్తులచేతబడి యుపకరణములుగను నించుమించుగ బొమ్మల
వలెను ఉన్న యాధనికులకు వ్యయము చేయుటయందు
విసుగున్నదని కాదు. జీవితమందలి యిచ్ఛలును ప్రేరణ
లును సంబంధించకున్నపుడు మాత్రమె (జీవితభోగేచ్ఛా
దుల సంబంధము లేని విషయములలో) వారికి లోభము
కలదు, జాగరూకమై యుండును, కాని వారు తమది యని
యనుకొను నిచ్ఛావిశేషమును పూర్తి జేసికొనుటయందు
ఏయాలోచన లేక వ్యయము జేసెదరు; తమసౌఖ్యమం
దును ధనలాభములందును ఇతరులను భాగహరులనుగా
జేసికొనుటకు వారలను అపేక్షించినమాత్రమున తమ
ధనమునిచ్చుట వారికి కష్టముగ గనపడును. ధనమును వశ
పఱచుకొనుచుండు ప్రాణలోకపు(ప్రాణమయ) శక్తి ఒక పెద్ద
లోహపుపెట్టెలో ధనమునుంచి గట్టిగ మూసి కాపాడు
రక్షకుని బోలినది. దాని పిడిపట్టుకు లోబడినవారిని ధన
మియ్య నడుగునప్పుడంతయు, ఒక్కొక్కతడవయు, వారు
కొంతైన సంచిని విప్ప నొప్పుకొనుటకుమునుపు చాల
జాగ్రత్తతో సకలవిధప్రశ్నలను వేయుదురు. కాని వారి

యెడ నొకజీవితపు (భోగేచ్ఛా) ప్రేరణ యుదయించి నచో (ధన) రక్షకుడు ధనసంచయమును విప్పుటకు సంతోషపడును; ధనముగూడ యథేష్టముగ బ్రవహించును. వాడు లోంగు జీవితపు యిచ్ఛలు సాధారణముగ సంభోగార్థప్రేరణలకు సంబంధించినవి; కాని తరుచుగ కీర్తి, మదింపు, భోజనేచ్ఛ, జీవితమునకు సంబంధించిన యామట్టి మునందుగల యితర కామనలు—వీనికి వేదిగనున్నను లోబడును. ఈవర్గమునకు దేనినిగుఱించియు వాడు చక్కగ ప్రశ్నించి పరిశీలించి, గతిలేకుండ నొప్పుకొని, తుదకు సాహాయ్య మియ్య సమ్మతించడు. ప్రాణమయ సత్త్వముల కెవరు దాసులుగనున్నారో, వారికి సత్యము జ్యోతి ఆధ్యాత్మికసిద్ధి, వీనిపై నున్న ఇచ్ఛ—వారిని స్పృశించినను—అర్థేచ్ఛకు తుల్యము కాజాలదు. దైవముకొఱకు వారివద్దనుండి ధనమును జయించుట వారివద్దనుండి పిశాచమును బోరాడి తఱుమగొట్టుటయే అని యర్థము. ఏ ప్రాణమయ సత్త్వమును వారు సేవించుచున్నారో, మొట్టమొదట దానిని నీవు జయించవలెను, లేక మార్చవలెను, అది సులభకార్యము కాదు. ప్రాణమయ సత్త్వముల యధీనులైన మను

ష్యులు సుఖమైన జీవితమునువదలి మాఱిపోయి, భోగా నుభవములను త్యజించి, అత్యంత విరక్తితో నుండ వచ్చును; అట్లయ్యును, ఎల్లప్పుడును వలె దౌర్జన్యము తోనే నిలువనగును, ఆమార్పుచేత పూర్వముకంటె యధములుగా నుండవచ్చును.

"ఒక పురుషుడు (మనిషి) మఱియొకనిపై తన ఇచ్ఛా(సంకల్ప) బలము నెందులకు ప్రయోగించ నగుచున్నది?"

ఒకడు తన యిచ్ఛాబలమును మఱొకనిపై ప్రయోగించ ననుమతిం బొందియున్నాడని కాదు; మఱి యేమన, విశ్వగతమైన యిచ్ఛాబల మొక్కటి యున్నది; ఎవరికి ఈశక్తిని ఎక్కువగనో తక్కువగనో యావిష్క రించుటకు వీలగునో వారికి బలీయముగ నీ యిచ్ఛాబల మున్నట్లు కనబడును. అది ప్రాణశక్తి, తేజస్సు విద్యు చ్ఛక్తి లేక ప్రకృతియందుగల యితరశక్తివిశేషమువలె నున్నది. ఈ శక్తిని వెల్లడించుటకు గొందఱు చక్కని ప్రణాళికలుగ (కాలువలు) లేక ఉపకరణములుగ నున్నారు; ఇతరులు బలహీనమైన ప్రణాళికలుగ నున్నారు. ఇచ్చట ధర్మాధర్మవిషయము కాదు, ప్రశ్న. ఇది ప్రకృతి

యందలి భూతార్థము (యథార్థవృత్తము), మహాలీల యొక్క యొక నియతి.

"ప్రాణమయ సత్త్వములను వానిరాజ్యమందే యొకడు కలయ నగునా?"

ప్రాణమయసత్త్వములు "అతిభౌతిక" లోకము నందు చరించును (భౌతిక మీ భూలోకము, దీని నతిక్ర మించి దీనికి పైనున్న దానిని అతిభౌతిక మనెదము). అచ్చట మానవసత్త్వములు పోవ సంభవించినయెడల, అసహాయముగ రక్షణ లేకుండ సముద్రమునంబడి నట్లగును. మానవసత్త్వము భౌతికశరీరమునందు సుఖ ముగ సురక్షితముగ నుండును; మానవునకు రక్ష అతని శరీరము. కొందఱున్నారు, వారికి తమ శరీరములపై నత్యంత తిరస్కారము, మరణానంతరము అవిలేకుండ సర్వమును సుఖముగను చక్కగను ఉండునని వారెంచె దరు. కాని, వాస్తవముగ శరీరమే నీకు దుర్గము, నీ శర ణము. నీ వందుండగ శత్రులోకపుశక్తులు నిన్ను సాక్షా త్తుగ పట్టుకొనుటకు కష్టపడును. దుఃస్వప్నములన నెవ్వి? *

* నిద్రలో గుండెపై నేదియో కూర్చుండి భారము వేయు నట్లు అనుభవ మగుట ; దీనిని ఒక భూత మందురు.

అవి ప్రాణలోకమున నీయొక్క అవస్కందములు (అనగా, తటాలున శత్రుమధ్య ప్రవేశించుట). ఒక దుఃస్వప్నగ్రహముననున్నపుడు మొదట నీ వేమిజేయ బ్రయత్నించెదవు? వేగముగ వచ్చి శరీరమునబడి నీ సాధారణ స్థూల (భౌతిక) ప్రజ్ఞయందు కుదురుకొనెదవు. మఱియు, ప్రాణమయశక్తుల లోకమున నీ వాగంతుకుడవు. అది యొక దిక్కుదివాణము లేని సముద్రము; అందు దిగ్దర్శన సాధనము లేదు, చుక్కాను లేదు. ఎట్లు పోవుటయో ఎప్పటికి పోవుటయో నీ వెఱుగవు, ఒక్కొక్కయడుగునను కర్తవ్యమునకు విపరీతముగనే యాచరించెదవు. నీవు ఈ లోకమున నేప్రదేశముననైన బ్రవేశించినతోడనే, అచ్చటి సత్త్వములు నిన్ను చుట్టి యావరించుకొని నీయందున్న దానినంతయు నపహరించి, సాధ్యమైనంత గ్రహించి నిన్ను అన్నముగను ఆమిషముగను జేసికొనగోరును. నీలోపల దృఢమైన ప్రకాశమును శక్తియు నుండి బయట ప్రసరించకబోవునేని, శీతలము నిరానందము నగు వాతావరణమునుండి రక్షించుటకు కవచము లేని వానివలె, నీవు శరీరము లేకుండ నట చరించుదువు, గుప్తమైయుండుటకు

గృహము లేదు, నిన్ను కప్పుటకు చర్మముకూడ లేకుండ, నరములు అనావృతముగ నేమియు లేకుండ గల్గును. కొంద ఱున్నారు, వారు "ఈ దేహమం దెంత యసుఖుడనై యున్నాను" అని చెప్పి తప్పించుకొనుటకు మరణ ముపాయమని తలచెదరు. కాని చచ్చినతరువాత ప్రాణ మయములైన ఇవియే చుట్టునున్నవి, ఈ జీవితమునందు దుఃఖహేతువుగ నుండెడి యా శక్తులవద్దనుండి నీ కపాయము కలదు. దేహనాశము నిన్ను ప్రాణలోకపు బయటి ప్రదేశములం జొరనిర్బంధించును; మఱి నీకు ఏరక్షయు లేదు, రక్షణార్థము మరలవచ్చి దూరుటకు భౌతిక దేహము లేదు.

ఇచ్చట భూమియందే, దేహమునందే, నీవు సంపూర్ణజ్ఞానమును సంపాదించి, నిండుగ పూర్ణముగ శక్తి నుపయోగించ నేర్చుకొనవలెను. నీవు అట్లు నేర్చుకొని నప్పుడే ఎల్ల లోకములయందును బొత్తిగ నిశ్శంకముగ నిచ్ఛానుసారముగ చరించవచ్చును. స్వల్పభయముగూడ బెట్టుకొనగూడనివాడవై— ఉదాహరణముగ అత్యంత దుఃస్వప్నముల మధ్యగూడ నిశ్చలుడవై నిలువగలుగు

నప్పుడే—నీవు "నే నిపుడు ప్రాణలోకమునకు బోగలను" అని చెప్పదగును: అనగా, ప్రాణమయ స్వభావముం జేరిన ఇచ్ఛాప్రేరణలపై సంపూర్ణాధిపత్యము గలుగునపుడు నీకు రాగల జ్ఞానమును శక్తిని సంపాదించుకొనుట యని యర్థము. ఏదేది అంధకారపు సత్త్వములను రప్పించునో, లేదా, అవి నిన్ను శాసించనిచ్చునో, దాని నన్నింటిని బొత్తిగ వదలి తద్బంధము లేకుండ నీవుండ వలెను; నీవు బంధశూన్యుడవై యుండవేని, జాగ్రత్త!

సంగములు, కామనలు, ప్రేరణలు, అభిమతములు, ఉండగూడవు; సంపూర్ణసమత, మార్పులేని శాంతి, దైవ రక్షయం దనన్యశ్రద్ధ, వీనితో నీవు సురక్షితుడవు, వీనిని విడిచి, నీవు అపాయమున నున్నావు. ఎంతవఱకు నీవు సురక్షితుడవు కావో, అంతవఱకు తల్లి ఱెక్కలయందు శరణముంబొందు కోడిపిల్లలవలె నీ వాచరించుట చాల మంచిది.

"భౌతిక దేహము ఎట్లు రక్షణముగ నాచరించును?"

భౌతికదేహమందలి (యేస్థూలతను) దేనిని దోష ముగ వాడెదమో, ఆస్థూలత్వముచేతనే అది రక్షగ నాచరించును. అది మందము, చేతనలేనిది (గ్రహణశూన్య

మైనది), దిట్టమైనది, ఘనమైనది, కఠినమైనది. దృఢమైన ఘనమైన గోడలతోనున్న నొకకోటను బోలినది. ప్రాణ లోకము ద్రుతమైనది, అచ్చట వస్తువులు చలించుచు నొకటితోనొకటి మిశ్రితమై యథేష్టముగ వినిమయ మొనర్చుకొనును.

ఎల్లప్పుడును నిలువక వీచుచు నొకటితో నొకటి కూడి, మాఱి మిశ్రమై పోవు సముద్రతరంగములవంటిది అది. లోపలనుండి బలవత్తరమైన తేజమును శక్తిని ఎదురుగ నుంచగల్గిన వాడవైనతప్ప, ప్రాణలోకముయొక్క యీ ద్రుతభావమునకెదుట నీవు రక్షాహీనుడవగుదువు అట్లుకాక పోయిన, నది నీలోపల ప్రవేశించును, దాని దండయాత్రావర్తనము నడ్డగించుట కేదియు నుండదు. కాని, దేహము మధ్య ప్రవేశించి ప్రాణలోకమునుండి నిన్ను వేఱుపఱచి తచ్ఛక్తులప్రవాహమునకు ఒక ఆన కట్టగ నున్నది.

"ప్రాణలోకము అంత ద్రుతముగ నున్నయెడల, అచ్చటి యాకృతులకు వ్యక్తిత్వ ముండునా?"

వ్యక్తిత్వమున్నది; కాని ఆ యాకృతులు అంత స్థిరములుగను, కఠినములుగను దేహవంతుల కున్నట్లు

ఉండవు. వ్యక్తిత్వ మనగా నమ్యము కాని ఘనత్వ (కఠోరత్వ)మని యర్థము కాదు. ఒకజాతికి చాలకఠినమైన రూప మున్నది, మనకు తెలిసినవానిలో నత్యంతకఠినమైనది అది, కాని యందు వ్యక్తిత్వము అభావప్రాయము. పది లేక పండ్రెండు జాళ్లను దీసికొనుము, వానిని వివేచనపఱచి భేద మెఱుఁగుటకు నీవు చాల గమనించవలసి యుండును. కాని ప్రాణలోకపు సత్త్వములను మొదటఁజూచునపుడే ఒనిదానికంటె మఱియొకటి భిన్నమని గుర్తెఱుఁగవచ్చును. ఆకృతి యెట్లు నిర్మితమయియున్నదో, ఏ వాతావరణముతో నేతెంచునో, ఏ ప్రకారమున చలించునో, భాషించునో, నడచుకొనునో, వీనింబట్టి వానిని ప్రత్యేకముగ దెలిసికొనవచ్చును. మనుష్యులకు సంతోషరోషాదులయందు తదనుగుణముగ రూపము ఎట్లు మార్పు జెందునో అట్లే యీసత్త్వములును తమ యవస్థావిశేషానుసారముగ మార్పుజెందును, కాని యీ మార్పు ప్రాణలోకమందు చాలతీవ్రముగ నుండును. కేవలము ఆకృతిప్రదర్శనము మాఱుటమాత్రము కాదు, లక్షణముల నివేశముకూడ మాఱును.

# ఏడవ ప్రకరణము

"సంకల్పము (ధీవృత్తి) నకుగల బలము యొక్క స్వభావ మెటువంటిది? ఎంతవఱకు ఎట్లు నా ప్రపంచమును నేను సృజించు కొనెదను?"

బుద్ధసమయ బోధనల ప్రకారము, ప్రతిమనిషియు తనకు ప్రత్యేకమయిన ప్రపంచమున జీవించుచు చరించు చున్నాడు. అది యింకొకడు వసించు ప్రపంచమునకు సంబంధపడక స్వతంత్రమై యున్నది; ఈ వేలువేలు ప్రపంచ ములకు ఒకవిధమైన సమరసత్వము, అనగా, సంవాదము సృష్టమైనప్పుడే వానికి అన్యోన్యప్రవేశము కలిగి మనుష్యు లొకరితో నొకరు కలసి ఒకరినొకరు తెలిసికొందురు. ఇది మనస్సువిషయమున నిజమే; ఏలన ప్రతివాడును తనకు ప్రత్యేకముగనున్న మానసప్రపంచమున జరించును. అది వాని ధీవృత్తులచేతనే నిర్మితమైనది. ఇది నిజము; కావు ననే ఒకవిషయము నెవరైన చెప్పినయెడల దానిని ఒక్కొ

క్కడును వేలువేలువిధమున తెలిసికొనును ; ఏలన, వాడు తనతలలో నున్న దానిని ఎఱుగుచున్నాడే కాని చెప్పబడిన దానిని ఎఱుగడు. కాని, యీసత్యము మానస కక్ష్యయొక్క వ్యాపారమును జేరినది, అచ్చటనే ఇది (ఈ సత్యము) సంగతము, సరిపడును.

మానసము క్రియకును రచనకును కరణము కాని జ్ఞానమునకు గాదు; ప్రతిక్షణమును అది రూపమును గల్పించుచున్నది. సంకల్పములకు రూపములు గలవు (సంకల్పములే, రూపములు). సంకల్పక నిరపేక్షముగ ఒక్కొక్క సంకల్పమునకును ప్రత్యేకజీవితము కలదు. సంకల్పకుని వద్దనుండి సంకల్పములు ప్రపంచమునకు బోయి ఏప్రయోజనమునకై తా మున్నవో దానిని సాధించుటకై యట చరించును. నీవు ఎవనింగుఱించియైన జింతించునపుడు నీ మనోవృత్తి రూపెత్తుకొని వానిం గనిపెట్ట బోవును. నీ తలంపు దానివెనుకనుండు సంకల్పబలముతో గొంత కూడి యుండునేని, నీవద్దనుండి బయలుదేరిన సంకల్పరూపము స్వార్థసిద్ధిం గాంచుటకు ప్రయత్నించును. ఉదాహరణముగ జెప్పెదము : నీకు ఒకమనిషి రావలెనని తీవ్రమైనకోరిక

యున్నది, ప్రాణప్రేరణయగు నీకోర్కెతో నొకబలమైన భావన నీవు కల్పించిన మానసరూపమునకు తోడుపడియు న్నది; "వాడు వచ్చెనేని, అది యిట్లుండును, అట్లుండును" అని నీవు భావింతువు. కొంతకాలమైన తర్వాత ఆ భావ మునే నీవు వదలెదవు, కాని నీవు దానిని మఱచిపోయిన పిదపగూడ ఆ నీసంకల్పము ఉండుచునున్నదని నీ వెఱు గవు. ఏలన, నీపై నాధారపడకయే (స్వతంత్రముగ) అది యున్నది, క్రియయం దున్నది, దాని కార్యమునుండి దానిం ద్రిప్పి తెచ్చుటకు గొప్పసామర్థ్యము కావలయును. ఏమనిషిని అది స్పృశించినదో వానివాతావరణమున బని జేయుచు వానియందు రావలెనను నిచ్ఛను పుట్టించు చున్నది. మఱియు నీ సంకల్పరూపమునందు చాలినంత ఇచ్ఛాబల ముండునేని, అది చక్కగ నిర్మితమైన రచన యేని, అది స్వార్థసిద్ధిం గాంచును. కాని యీసంకల్పరచన కును తత్సిద్ధికిని మధ్య ఒకకొంతకాలము గతించును, ఈ మధ్య నీ మనస్సు అన్యవిషయాక్రాన్త మగునేని, అప్పుడు నీవు మఱచిపోయిన యీసంకల్పము పూర్తియగునేని, దానిని నీ వాకానొకప్పుడు పెట్టుకొనియుంటివని నీకు

జ్ఞాపకముకూడ లేకుండబోవచ్చును. నీవే యాక్రియకు ప్రవర్తకుడవు, సంఘటిత (ఫల) మునకు హేతవు అని నీకు తెలియదు. చాల తఱుచుగ నిట్లు కూడ ఘటించును: ఫలము లభించినపుడు దానిపై లక్ష్యపెట్టక నీవా కోరికనుగూడ నుంచుకొనక పోవచ్చును. కొంద ఱున్నారు, వారి కీవిధమైన (రూప) కల్పనాసామర్థ్యము ప్రబలముగ నున్నది; వా రెప్పుడును తమ (సంకల్ప) రచనల సిద్ధిం గాంచెదరు; కాని, వారి మనోమయసత్త ప్రాణమయసత్తయు సుశిక్షితములుగ నుండనందున, వారిప్పుడొకవిషయమును,మఱొకప్పు డింకొకటిని గోరెదరు; కావున నీభిన్న భిన్నములును విరుద్ధములు నైన సంకల్ప నిర్మితులు వానిఫలితములును ఒకటితో నొకటి సంఘర్షించి విరుద్ధము లగును. ఇటువంటి వైషమ్యము (విసంవాదము)తో నాకులతతోను జీవించవలసిన దెట్లు సంభవించినదని వారు ఆశ్చర్యపడుదురు; తమ జీవితమును దుర్భరము గావించినవియు, అసంబద్ధములును అన్యోన్యవిరుద్ధములుగను దోచు పరిస్థితులను నిర్మించినవియు వారిసంకల్పములే, వారి యూహణలే, యని వా రెఱుగరు.

ఏ డ వ ప్ర క ర ణ ము

సమీచీన ప్రయోగరహస్యముతో ప్రాప్తమగు నేని ఈవిద్యకు అత్యంతప్రాధాన్యము కలదు. నియమము, ఆత్మసంయమము, వీనియందున్నది రహస్యము. తనయందు సత్యముయొక్క మూలమును, ఆ ద్వైవేచ్ఛయొక్క సంతత శాసనమును గనిపెట్టుటయందే రహస్య మున్నది, ఇదియే (ద్వైవేచ్ఛ, భగవత్సంకల్పము) ప్రతి సంకల్పరూపమునకు పూర్ణబలమును సమగ్రమైన సామరస్యసంపన్నమైన సిద్ధి నొసగును. మనుజులు సాధారణముగ ఆసంకల్పరూపము లెట్లు కదలి పనిజేయుచున్నవో యెఱుగకయే వానికి రూపిత్తురు. ఈ యజ్ఞానాకులావస్థలో రూపీభవించిన యవి యొకటితో నొకటి యొరసి ప్రతిఘటించుచు ప్రయత్న ప్రయాసల లక్షణముల నంకించుచు విఘ్నసముదాయము ను భేదించుచు నీవు నీదారిని పోయెదవని యొక వేదనము నిచ్చుచున్నవి. ఈ జ్ఞానము లేమి, పరస్పర సంబంధము లేమి—ఈ స్థితులు సంకులమయిన పోరాటమును బుట్టించును; అందు బలిష్ఠములకే, చిరస్థాయులుగ నుండగల రూపములకే తదితరములపై జయము కల్గును.

మనస్సుంగూర్చి తద్వ్యాపారములంగూర్చి ఒకవిషయము నిశ్చితము; అదేమన మనుపే నీ యంతరాత్మలో

దేని నెఱుగుదువో దానినే నీవు (తర్వాత మనస్సుచేత) తెలిసికొనగలవు. ఒక గ్రంథమునందేది హృదయగ్రాహిగ నీకున్నదో, దానిని లోతున నీయందు పూర్వమే నీ వనుభవించియున్నావు. మనుజుల కొక గ్రంథముగాని ఒకబోధనగాని యత్యద్భుతముగ గనబడును; తఱచుగ వారిట్లు చెప్పుట నీవు వినెదవు, "ఇదియే యథార్థముగ నా యనుభవముకూడ, నే నెఱుగుదును, కాని యిచ్చట నెంతచక్కగ విశదమై యున్నదో,అంత చక్కగా స్పష్టపఱుచ నా కలవికాదు" అని. యథార్థమైన ఒక జ్ఞాన గ్రంథమును మానవులు చూచునపుడు, ఒకొ్కకడును తన్ను (తనలోనున్న జ్ఞానమునే) అచ్చట కనిపెట్టగలడు, ఒకొ్కక్కతడవయు, క్రొత్తగ జదువునపుడు, దానియందు మొదటజూడని విషయములను కనిపెట్టగలడు. ఒకొ్కక్కమారును, వాని దృష్టికి అంతవఱకు కనబడని క్రొత్త జ్ఞానక్షేత్రమును అది వెలిపఱచును. అది యట్లుచేయుటకు గారణమే మనగా, వానియందు మగ్నమైన చేతనయందుండి బయల్పడుటకు కాచుకొనియుండిన జ్ఞానము యొక్క పఱపులను (ఆస్తరములను) అది (అపుడు)

అందుచున్నది. ఎవరో యొకరు తనకంటె చక్కగ నా స్పష్టభావమును (ఆవిష్కృతిని) ఒసర్చిరి. కాని, ఒకతూరి స్పష్టమైనచో, వాడు తత్క్షణమున నదియే సత్యమని యనుభవించి గుర్తెఱుగ గలడు. బాహ్యమునుండి వచ్చునట్లు తోచుజ్ఞానము లోపలనుండు జ్ఞానమును వెలిపఱచుట కొక సందర్భము.

మనము ఒకటిజెప్పిన, దానిని వేఱుగ గ్రహించి చెప్పుట సాధారణమైన యనుభవము; పై జెప్పినటువంటిదే దీనికి గూడ జన్మస్థానము. మన మొకటి జెప్పెదము, అది చాల తేటగనే యున్నది, కాని(అన్యుడొకడు)దానిం దెలిసికొనువిధము వ్యామోహాకరము (మనలను స్తబ్ధులం గావించును). ఒక్కొక్కడును దానియందు మనయుద్దేశమేమో దానిని విడిచి యింకేదైనను జూచును, లేదా, భావమునకు విరుద్ధమైన దేనినైన నందుంచును. ఇటువంటి పొరబాటులను వర్జించి నిజముగ తెలిసికొనగోరుదువేని, పదములగతికిని, ధ్వనికిని వెనుకవెళ్లి, మౌనమునందు గమనించుటకు, అనగా సావధానముగ నాలకించుటకు, నీవు నేర్చుకొనవలయును. మౌనమున శ్రవణింతువేని, సరిగ

విందువు, సరిగ వెలుగుదువు. కాని, ఏదైన చరించుచు నీతలలో మ్రోయుచున్నంతవఱకు, నీతలలోని మ్రోతనే నీ వెలుగుదువు కాని దేనిని జెప్పితిమో దానింగాదు.

"ఒకనికి యోగమందు మొదట పరిచయముగల్గునప్పుడు ప్రతికూలపరిస్థితుల సమూహాము లేల వానిని వెంబడించుచున్నవి? నీవు యోగద్వారము నుద్ఘాటించునపుడు విఘ్నములగణము నిన్ను ప్రతిఘటించునని యొకరు చెప్పియున్నారు. ఇది నిజమా?"

అది యేకాంతమైన నియమము కాదు; చాలవఱకు పురుషుని బట్టియున్నది. అనేకులకు ప్రతికూలస్థితులు వారిస్వభావమందుగల దుర్బలాంశల పరీక్షార్థమై వచ్చును. సమతయే యోగమున కనివార్యమైన మూలబంధము, నీవు ఈమార్గమున యథేచ్ఛముగా చరించుటకు మునుపు, అది సుప్రతిష్ఠితమై యుండవలయును. ఈ దృష్టితో జూచినయెడల సకల సంకటములును సహజముగ పరీక్షలే, వానినుండి నీవు ఉత్తీర్ణుడవు కావలయును. కాని, నీ మానసకల్పనలు నిన్ను జుట్టి కట్టియున్న మేరలను పగులగొట్టుట కవి (సంకటరూపములైన పరీక్షలు) యావశ్యకములు, అవి సత్యమును ప్రకాశమును నందనీయక నిన్ను అడ్డగించుచున్నవి. నీకు దాని మేరలు

తెలియక యనుభవము కాకపోయినను నీవు వసించు మానస ప్రపంచమంతయు పరిమితమైనది; ఏదైన నొకటి వచ్చి, నీమనస్సున నడగియున్న యీనిర్మాణమును భేదించి దానికి విడుదల నియ్యవలయును. ఉదాహరణము: నీకు కొన్ని స్థిరమైన విధులు, అభిప్రాయములు, మూలతత్త్వ ములు కలవు; వాని కత్యంత ప్రాధాన్యము నిచ్చెదవు; చాల తఱుచుగ నది ధర్మమునకు సంబంధించిన మూల సూత్రములనో ఉపదేశములనో యనుసరించవలెనను నదియే—"మాతాపితలను గౌరవించుడు" "హత్య జేయరాదు" ఇత్యాదులు. ప్రతివానికిని ఒక పిచ్చి, లేక, తనకు అభిమతమైన పురాతన సంప్రదాయము, ఏదైన గలదు; ప్రతివాడును ఇతరులను బాధపెట్టు పక్షపాత మేదియు తనకు లేదని తలచుచు నటువంటి యాశయము లను అబద్ధమని పాటించ నిచ్ఛగించుచున్నాడు; కాని తనది మాత్రము అట్లు గాదని వాని భావన, వానికి అది సత్యమే, యథార్థమైన సత్యమే. మానసమైన యొక నిబంధనయందు గల సంగము ఎచ్చటనో దాగియున్న ఆంధ్యమును సూచించును. ఉదాహరణము: సన్యాసము,

అధ్యాత్మభావము, రెండును ఒకటియే యను సార్వత్రిక మూఢవిశ్వాసము లోక మంతటను ప్రబలించి యున్నది. నీవు ఎవరినైనను అధ్యాత్మనిష్ఠుడైన పురుషుడు, అధ్యాత్మనిష్ఠయైన స్త్రీ యని వచింతువేని, తోడనే జనులు దిన మంతయు కదలక కూర్చుండి భోజనము జేయనివాడ నియు మహా దారిద్ర్యమున బర్ణశాలయందు నివసించు వాడనియు, తనకించుకయు నుంచుకొనక సర్వత్యాగ మొనరించిన వాడనియు దలంచుకొందురు. ఒక ఆధ్యాత్మికపురుషునిగుఱించి భాషించునపుడు, నూఱుగుఱులో దొంబదితొమ్మండ్రుగురుకు మానసముల యందు తత్క్షణమున నుదయించు బింబ మిదియే. దారిద్ర్యము, సౌఖ్య సంతుష్టిప్రదమయిన సర్వమునుండి నివృత్తి, ఈ రెండును వారి మతమున అధ్యాత్మభావమును ఉపపాదించును. ఆధ్యాత్మిక సత్యముంగని యనుసరించుటకు స్వతంత్రుడవై యుండగలవేని, ఈ మానసనిర్మాణమును ద్రోసివేయవల యును. ఏలన, హృదయపూర్వకముగ తీవ్రేచ్ఛతో, నధ్యాత్మ జీవితమునకు వచ్చెదవు, దైవమును కలసి నీ జీవితమందును నీప్రజ్ఞయందును దైవమును సాక్షాత్క

రించగోరెదవు ; కాని 'యే మగుచున్నదనగా, నీవొక స్థలమునకు వచ్చెదవు : అది గుడిసె కాదు, అచ్చటి దివ్య పురుషు నొకరిని కలసితివి, అతడు యథేష్టముగ భోజనము జేయుచు, విశిష్టజీవనలక్షణమైన సుందరవస్త్రువులు చుట్టనుండ, ఉన్నదానిని బీదజనులకు దానము జేయక, జనులు తన కిచ్చుదాని నంతయు స్వీకరించి యనుభవించుచు సుఖమైన జీవితమును నడుపుచున్నాడు. తోడనే, నీమనస్సున దృఢపడియున్న (నియమమును గుఱించిన) భావానుసారముగ, నేదియు దోచక నీవు భ్రమించి అఱచెదవు "ఏల, ఇదేమి ? ఆధ్యాత్మికపురుషుని జూడనగునని నే నెంచితిని" అని. ఈ యబద్ధమైన భావము భగ్నమై పాఱిపోవలయును. అట్లు అది పోయినచో, నీయొక్క సంకుచితమైన సన్యాసవిషయక విధికంటె నుత్కృష్టతరమయిన నొకదానిని గనుగొందువు—నీసత్తను (నీజీవుని) విడుదలబొందించు సంపూర్ణవికాసమును (కనుగొందువు). దేనినైన నీవు తీసికొనవలసియున్నయెడల, నీవు దానిని స్వీకరించెదవు, మఱి దానినే నీవు వదలవలసియుండిన యెడల అట్లే యిష్టపడుచు వదలివేసెదవు. గ్రహించుట

యందు త్యజించుటయందును సమానముగనున్న సమత్వ
మును జూపు మందస్మితముతో వచ్చువానిని తీసికొని,
పోవువానిని బోవ విడిచెదవు.

లేక, మఱి "హత్యకూడదు" అని ఒక నీతిని
ఉత్తమవిధిగ నీవు స్వీకరించియున్నావు, క్రౌర్యము, వధ,
నీకు ఘోరముగ నుండును. నీకు లక్ష్యము మానసికమైన
విధి కాదు, ఆధ్యాత్మికసత్యము నన్వేషించువానికి మాన
సికవిధియందు సంగ ముండరాదు. తద్బంధ ముండరాదు
అని నీవు తెలిసికొనువఱకు వధ జరుగునప్పుడు, తత్సమక్ష
మున నొకమారు కాదు పలుమార్లు నీవు ఉండవలసి
వచ్చును, అందు నీవు ఆశ్చర్యపడవలదు. ఎప్పుడు నీవు
దానినుండి విమోచనముం బొందుదువో, అప్పుడు నీవు
దీని నెఱుగవచ్చును; నిన్ను బాధపెట్టిన యీ (ఘోర)
దృశ్యములన్నియు, విచిత్రముగ, నీసమక్షమున కేతెంచు
టను మానివేయును; నిజముగనే అవి నీకు బాధపెట్టి
నీ మనోనిర్మాణమునుండి నిన్ను కదలించి బయల్పఱచుటకై
పంపబడినవి.

నీవు దైవముకడకు వచ్చునపుడు మానసములైన
(మనఃకల్పితములైన) యాశయముల నన్నింటిని బరిత్య

జించవలయును; కాని, అట్లు చేయక దానికి బదులుగ నీ యభిప్రాయముల నన్నింటిని దైవముపై వేసి వానికి అది అణగియుండవలెనని కోరెదవు. యోగికి ఉండవలసిన నిజమైన (దృష్టి)భావ మిది ఒక్కటియే. దైవమునకు నమ్యుడై దైవాదేశము ఏదిగనుండినను దాని నాచరించుటకు తయారుగ నుండుట; ఏదియు వానికి అనివార్యముగ నుండగూడదు, ఏదియు భారముగా నుండగూడదు. తఱచుగ నధ్యాత్మజీవితముం గోరువారికి మొదట గలుగు ప్రేరణ తమకున్న సర్వమును ద్రోసివేయుటయే; కాని వా రట్లుచేయుటకు గారణము ఒకభారమును దొలగించవలెననియే కాని దైవమున కర్పించుకొొన గోరెద రని కాదు. సకలభోగవస్తు పరివృతులైన ధనికులు దైవమున కేసి తిరుగునపుడు, తోడనే వారికి గలుగు ప్రవృత్తి వీని నన్నింటినుండి పాఱిపోవుటయే—లేదా, వారు చెప్పునట్లు 'ఈ బంధమునుండి తప్పించుకొనుటయే.' కాని, అది తప్పిదమయిన ప్రవృత్తి; నీకు గలవి యన్నియు సొంతమని నీ వెంచదగదు,—అవి దైవమునకు సొంతము. నీ వే భోగమైన ననుభవించవలెనని దైవ మిచ్ఛించునేని, అట్లే

అనుభవించుము. కాని అనంతర క్షణమున మందహాసముతో మానివేయుటకును తయారుగ నుండుము.

" శారీరక వ్యాధు లన నేమి? బాహ్యమునుండి ప్రతికూల శక్తులు ప్రయోగించు నభిఘాతములా అవి? "

ఈవిషయమున గమనించవలసిన యంశములు రెండు కలవు. బాహ్యమునుండి వచ్చునది కలదు, నీలోపలిస్థితినుండి వచ్చుటయు కలదు. నీ లోపల ప్రతిబంధము, లేక, ఉల్లంఘనము కలుగునపుడు, లేదా, నీలో నే భాగమైనను రక్షావిషయమై (ప్రత్యుద్బోధములేనిదై) మేలుకొని వ్యాపరించకుండు నపుడు, నీలోపలి స్థితి రోగమునకు హేతు వగును; లేదా, అచ్చట నేదైన నుండవచ్చును. అది యిచ్ఛా పూర్వకముగ కావలె నని ప్రతికూల శక్తుల నాహ్వానించ వచ్చును. నీయం దిటువంటి చలనము స్వల్పముండినను చాలును; శత్రుశక్తులు తత్క్షణము నీపై బడును; వాని యాఘాతము వ్యాధిరూపము నెత్తుకొనును.

" వ్యాధులు యోగవ్యాపారముయొక్క యొకయంశము గాక కొన్నిసమయము లందు, సూక్ష్మక్రిమిజన్యములు కావా? "

# ఏడవ ప్రకరణము

యోగ మెచ్చట నారంభించి యెచ్చట నంత మగుచున్నది? నీ జీవితమంతయు యోగము కాదా? నిన్ను జుట్టికొనియు నీశరీరమునందును వ్యాధికి ఎల్లప్పుడును సంభవము లున్నవి. అన్నిరోగముల నిచ్చెడి సూక్ష్మక్రిములను నీలోపలనే యుంచుకొని మోయుచున్నావు, లేదా, అవి నిన్నుజుట్టి సంకీర్ణములుగ నున్నవి. పలుసంవత్సరములుగ లేనివ్యాధికి తటాలున వశమై పడుచున్నావే అది యెట్లు? "ప్రాణశక్తియొక్క నిమ్నదశ"యే కారణమని నీవు చెప్పగలవు. కాని యీ నిమ్నత (క్రిందికిబడుట) యెచ్చటనుండి వచ్చునది? సత్తయం దెచ్చటనో వైషమ్యమునుండి, దైవశక్తులను గ్రహించు సామర్థ్యము ఊనమగుటవలన నది వచ్చుచున్నది. నీ వెపుడు నిన్ను పోషించు శక్తిప్రకాశములనుండి విచ్ఛిన్నుడ వగుదువో, అపుడు (ప్రాణశక్తియొక్క) నిమ్నత కలుగును, వైద్యశాస్త్రప్రోక్తమగు "అనుకూలక్షేత్రము' సిద్ధమగును, అపుడు ఏదో యొకటి వచ్చి దాని నుపయోగించుకొనును. సంశయము, విషణ్ణత, విశ్వాసలోపము, స్వార్థపరుడవై నీపైననే యాధారపడుట, ఇదియే ప్రకాశమునుండియు దివ్యశక్తి

నుండియు నిన్ను విముక్తుని గావించి (ప్రతికూలశక్తుల) దాడికి అనుకూల్య మొసంగుచున్నది ఇదియే జబ్బుపడు టకు హేతువుగాని సూక్ష్మక్రిములు కావు.

"ఉత్కర్ష జెందిన సుఖాధారపద్ధతివలన సామాన్యమైన పౌరుని యారోగ్యము వృద్ధియయినట్లు కనబడలేదా ?"

సామాన్య (లౌకిక) జీవితమందు, ఔషధము ఆరో గ్యపద్ధతియు అనివార్యములు ; కాని సామాన్యపౌరుని గుఱించి నే నిపుడు వచించలేదు ; యోగ మనుష్ఠించు వారి విషయమై చెప్పెద. అట్లయినను, ఆరోగ్యపద్ధతి యందు ఈ అహితమున్నది. రోగమున బడుటకు గల సంభవమును తగ్గించుచు నీకు సహజముగ నున్న వ్యాధి నిరాకరణసామర్థ్యమును గూడ తగ్గించుకొనెదవు చికిత్సా శాలలయందు (వ్యాధిగ్రస్తులకు) శుశ్రూష జేయువారు విషఘ్నమైన ద్రవ్యములతో చేతులను శుద్ధిజేసి కొనువారు, తమ చేతులు సులభముగ నంటువ్యాధి కవ కాశ మిచ్చున వనియు ఇతరుల హస్తములకంటె తమవి రోగసంసర్గమునకు ఎక్కువగ స్థలమిచ్చున వనియు కని యెఱుగుదురు. అట్లుకాక, ఏ ఆరోగ్యతత్త్వము నెఱుగని

కొందఱు అత్యంతానారోగ్యకరమైన వానిని జేయుచు రోగస్పర్శము లేక యున్నారు. వారియొక్క యజ్ఞానమే వారి కుపకారిగ నున్నది, ఏలన వైద్యజ్ఞానముతో వచ్చెడి కొన్ని యభిప్రాయములకు వారియందు ప్రవేశము లేదు. అట్లుకాక, ఆరోగ్యపద్ధతిప్రకారము పూర్వోపాయము నందు నీకు గల నమ్మకము, అవి (ఆయభిప్రాయములు) పనిచేయుటకు, సాయపడును. ఏలన, నీతలంపు ఇది: "నేను వ్యాధి యంటుకొనకుండునట్లు శుద్ధుడనై యున్నాను, రక్షితుడను." అంతవఱకు నీవు రక్షితుడవే.

"అట్లయిన, మనము వడిగట్టిన నీటిని పానీయముగ నుపయోగించుట మొదలైన యారోగ్యవిషయక పూర్వోపాయముల నేల నవలంబించవలెను?"

అభిప్రాయములు సూచనలు బాధించకుండుట కంత పరిశుద్ధుడును బలిష్ఠుడును మీలో నెవరున్నారు? "అశుద్ధజలమును ద్రాగెదను" అని యనుకొనుచు వడిగట్టని నీటిని ద్రాగుదువేని, నీవు జబ్బుపడ నెక్కువ సంభవమున్నది. అటువంటి యభిప్రాయములు ఎఱుకగల నీమనస్సుమూలమున (జాగ్రదవస్థల తెలివితోనున్న మనస్సు) ప్రవేశించక పోయినను, నీయొక్క "మగ్న

చేతన" యంతయు ప్రాయికముగ సాయములేనిదై యే విధమైన యభిప్రాయములను గ్రహించుకొనుటకు సన్నద్ధముగ నున్నది. జీవితమందు "మగ్న చేతన" యొక్క వ్యాపారమునకే భాగమెక్కువ, అది ఎఱుకగల భాగములకంటె శతగుణము బలవత్తరముగ పనిజరుపును. మనుజుని సాధారణస్థితి శంకాభయములు నిండిన ఒక యవస్థావిశేషము. లోతుగ నీమనస్సును పది నిముసములు గమనింతువేని, ఆ పదిలో తొమ్మిది నిముసములు భయపూరితములుగ నుండును—అది (మనస్సు), చిన్నది పెద్దది, దూరము సమీపము, దృష్టము అదృష్టము, ఇట్లు పలువిషయముల గుఱించి భయము నుంచుకొనిపోవును ; నీవు వాడుకగ దానిని గమనించకపోయినను, అచ్చట నున్నదేమో యున్నదే; స్థిర ప్రయత్నము చేతను, సాధనచేతనే సర్వభయమునుండి విడుదల కలుగును.

సాధన ప్రయత్నములచేత నీవు మనఃప్రాణములను శంకాభీతులనుండి విడిపించినను, దేహమును సమాధానపఱచుట యధిక కష్టము. కాని దానింగూడ నీవు చేయవలయును. నీవు యోగమార్గము నెపుడు ప్రవేశించి

తివో, అపుడు సకలభీతులను వదల వలయును—నీమనస్సునందలి భీతులను, నీప్రాణమందలి భీతులను, దేహము నందు ప్రతి పరమాణువునందు నవస్థితమైన భీతులను, (వదలవలయును). యోగమార్గమందు నీకు గలిగెడి సమాఘాత ప్రహారముల ప్రయోజనములలో నొకటి సకలభీతినుండి నీకు విమోచనము కలుగుట, భీతిహేతువుల సమక్షమున స్వతంత్రుడవై ఉదాసీనుడవై అస్పృష్టుడవై పరిశుద్ధుడ వగునంతవఱకు అవి మరల మరల నీపై దుముకి వచ్చి పడును. ఒకనికి సముద్రభయము కలదు, మఱొకనికి అగ్నిభయము. అపరోక్షుడు (రెండవవాడు) తన దేహమందు ఒక్కయణువుకూడ వణకకుండునట్లు సుశిక్షితు డగువఱకు అగ్నిదాహముపై నగ్నిదాహమును ఎదుర్కొనవలసివచ్చునని ఎఱుగగలడు. దేనింగుఱించి నీకు జుగుప్స యున్నదో, అది యాజుగుప్సపోవువఱకు మరలమరల వచ్చును. ఎవడు మార్పు (పరివర్తనము)ను గోరి యీమార్గము ననుసరించునో వాడు తన స్వభావమందలి యే భాగమందును దేనిచేతను అబాధితుడై క్షోభములేనివాడై యత్యంత నిర్భయుడు కావలయును.

# ఎనిమిదవ ప్రకరణము

"మన సంకల్పము (ఇచ్ఛాశక్తి) విశ్వగతేచ్ఛాశక్తి యొక్క యొక యావిష్కృతి లేక ప్రతిధ్వనియే యగునేని, మనము ప్రత్యేకముగ నొకకార్యమును స్వతంత్రముగ నారంభించుటకు స్థల మెచ్చట నున్నది? విశ్వగతప్రవృత్తులను దాకలుచేయుట కుపకరణమేనా మనుష్యవ్యక్తి? వానికి సృష్టించుటకుగాని నూతనముగ నారంభించుటకు గాని శక్తిలేదా?"

చేతనయొక్క యే కక్ష్యలోనుండి విషయముల జూచుదువో, వానిని గుఱించి భాషించుదువో, లేక నీసత్తయందలి యేభాగమునుండి నీవు ఆచరించుదువో, దానింబట్టి (ఉత్తరము) అంతయు నున్నది.

చేతనయందలి ఒకకక్ష్యనుండి చూచునపుడు పురుషవ్యక్తి ఉపకరణముగను, దాకలుచేయువాడుగను మాత్రముగాక, స్రష్టగను గూడ గనబడును. కాని పైగనున్న యింకొక కక్ష్యనుంచి విశాలదృష్టితో చూచిన

యెడల, అది చూపుమాత్రమే అని ఎఱుగగలవు. విశ్వము యొక్క వ్యాపారములయందు, ఏది జరిగినను అది దానికి పూర్వముజరిగిన అన్నింటియొక్క కార్యము (ఫలితము). ఈ ప్రపంచావిర్భావముయొక్క సమగ్రలీల నుండి ఒక సత్త్వమునుగాని, జగద్గతుల సర్వసంఘాతమునుండి యొక గతి విశేషమునుగాని నీ వెట్లు ప్రత్యేకపఱచ నుద్దేశింతువు? ఒకవస్తువుయొక్క యారంభమునుగాని అంతమునుగాని ఎచ్చట నుంచెదవు ? ఈ లీలయంతయు దృఢసంబంధము గల యొకసంకెల ; ఒక సంధిబంధము (శృంఖలయందుండెడిది), మఱొకటితో జూచుటకు తెలియకయే చేరిపోవును. ఈ సంకెలలోనుండి దేనినైన ప్రత్యేకముగ దీసి, దానికి అదియే మూలము ఆదియునుగా నున్నట్లు అనుకొని వ్యాఖ్యానము జేయరాదు.

మఱియు ఒకడు (వ్యక్తి) స్వయముగ నొక యుద్యమము నారంభించుచున్నాడు, లేక, సృజించుచున్నాడని నీవు చెప్పునప్పుడు నీ భావమేమి ? వాడు తనవద్దనుండియే, లేక, అభావమునుండియే యంతయు జేయునా ? ఒక సత్త్వము (మనిషి) ఆవిధమున నొక సంకల్పమునో,

వేదనమునో, క్రియనో, మఱి దేనినైననో సృజింపనగు నేని వాడు జగత్స్రష్టగనే యుండదగును. ఒకవ్యక్తి తన చేతనయందుండి సకలవస్తువులకు మూలస్థానమైన యొక పరతరచేతనకు బోవ నగునేని, అపుడే వాడు ఉత్పాదకుడు కాగలడు. సకల ప్రవృత్తులకును పరమైన జన్మస్థానమగు చైతన్యశక్తితో నేకీభవించుటచేతనే, వాడు ఒకగతి విశేషమునకు ప్రారంభకుడు కావచ్చును.

చేతనయందనేకకక్ష్యలు కలవు. ఒకకక్ష్య యొక్క నియతి మఱియొక కక్ష్యయొక్క నియతి కాదు. కావున, సృజించువ్యక్తి యని నీవు చెప్పునపుడు, ఆవ్యక్తియొక్క యేభాగమును మనస్సున నుంచుకొని యట్లనెదవు? ఏలన, వాడనేకాంశఘటితమైన సత్త. చైత్యపురుషునా, మనోమయునా, ప్రాణమయునా, అన్నమయునా (అన్నము= భౌతికము) నీవు అధికరించి వచించెదవు? ఒక ప్రవృత్తి యొక్క కనబడని మూలమునకును దాని యావిర్భావమునకును, అనగా, వెలుపల నది స్పష్టమగుటకును, ఈ మెట్టు లన్నియు, ఇంకయెన్నో ఇతరములును గలవు. ఒక్కొక్కసోపానము (మెట్టు)నందును దానికి ఎన్నో

మార్పులు, వికారములు, వైరూప్యములు కలుగుచున్నవి. ఈ మార్పులే క్రొత్త సృష్టి, క్రొత్త మూలము, క్రొత్త ప్రారంభస్థానము అను భ్రాంతిని గల్గించు చున్నవి. అది నీరున్నపాత్రలో నుంచిన కఱ్ఱను బోలినది; నీవు కఱ్ఱను సమరేఖగ నున్నట్లు కాక, కోణమై వంకరగ నున్నట్లు చూచెదవు. కాని అది భ్రమయే, దృష్టివైషమ్యమే, అది నిజమైన కోణముకూడ గాదు.

విశ్వగతికి, ఒక్కొక్క ప్రత్యేకచేతన దేనినైన కొంత దెచ్చి యిచ్చుచున్నది; ఒకదృష్టితో జూచినయెడల దానిని వైకల్యమని చెప్పనచ్చును. మఱియొకదృష్టియందు, దానిని (విశ్వ)గతియందలి స్వీయగుణ విశేష మనవచ్చును. ఈ వ్యక్తిచలనములు దైవముయొక్క ప్రవృత్తియగు లీలయం దొకభాగము; అవియే మూలములు కావు, అవి వస్తువులయొక్క మార్పు, వాని మూలమును సమస్తమైన ప్రపంచమునందే కనుగొనవలెను.

భేదబుద్ధి (వేఱువేఱుగ నుండుట యనుబోధ) ఎచ్చటను వ్యాపకమై యున్నది, కాని అది భ్రమ; అది అయథార్థ దశలలో నొకటి; మనము సత్యప్రజ్ఞను బ్రవేశింప

గోరుచున్నది, దానిని వదలి స్వస్థులు కావలయును. జగత్తును మనస్సు ఖండఖండములుగ భేదపఱచుచున్నది. దీనికి ఇక్కడ ఆరంభము, ఇక్కడ అంతము అని అది చెప్పును; మఱియు నిట్లు భిన్నభిన్నముగ జేయుటవల్ల నది విశ్వగతిని వికారపఱచి సాధించుచున్నది. ఏకమైన సర్వవ్యాపకమైన సర్వాధారకమైన చైతన్యమహాప్రవాహ మొక్కటి కలదు; అది యనవరతము సృష్టమగుచు నున్న విశ్వము నందు వెలువడుచున్నది. ప్రతివస్తువునకు వెనుక స్థాయిగ నుండు సత్య మిదియే; కాని సత్యము నీదృష్టిని బడనీయక ఆవరించుకొనియుండు భ్రమయు గలదు. ఈభ్రమ ఏది యనగా, ఈ యనేకగతివిశేషము లొక్కొక్కటియు తాను ప్రత్యేకము, ఇతరములనుండి వేఱుపడినది యనియు, అన్యాశ్రయము లేక తనపై నాధారపడి తనకై తానున్నదనియు, జగత్తునందు తనకంటె నితరమగు సర్వమును వదలి తాను స్వతః సత్తతో నున్నదనియు భావించుకొనుటయే. ఒకదానిపై మఱియొకదానియొక్క క్రియాప్రతిక్రియలు ఏదో *బాహ్యమని వానికి భావముండును. అవి, దూరమున నేవో బాహ్యసంబంధములదప్ప మఱి

యేసంబంధములేని భిన్నభిన్నలోకములు, ఒకదానికెదుట మఱొకటి నిలుచునదివలె, తమ్ము భావించుకొనును. ఒక్కొకడును తాను స్వాధికారముననుండు ప్రత్యేకమయిన పురుషవ్యక్తిగ దలచుకొనును. విశ్వలీల యందొకయంశముగ నీ భేదబుద్ధిరూపమయిన భ్రమ ఇంతవఱకు అనుమతంబయ్యె. ఏలన, నేకమయిన చైతన్యము తన్ను విషయాకారముం గావించుకొని, రూపములను దృఢముగ నుంచవలసిన యావశ్యకత గలిగెను. కాని అతీతకాలమున ననుమతం బయ్యెనను హేతువుం బట్టి యెల్లప్పుడును ఈ పృథక్త్వభ్రాంతి కలుగుచు నుండవలెనని యే న్యాయమును లేదు.

ఈ విశ్వలీలయందు కొందఱు, పెక్కండ్రు, వివేకములేని యుపకరణములుగ నున్నారు. వారు, దేని నెఱుగక బొమ్మలవలె చాలితులగు ఆటకాండ్రు; మఱికొందఱు కలరు; వారికి ఎఱుక యున్నది, జగత్తు లీల యని తెలిసికొనియే తమకు యుక్తమైన భాగమును నటించెదరు. మఱికొందఱు జగత్ప్రవృత్తియొక్క సంపూర్ణజ్ఞానముగలవారై దానితోను ఏకమైన దైవచేతన

తోను అనన్యతంబొందియు, తాము పృథగ్భూతులవలె, సమస్తమునందు ఒక విభాగమువలె నాచరించుటకు సమ్మతించెదరు. ఆ యజ్ఞానమునకును ఈ సంపూర్ణజ్ఞానమునకును మధ్యవర్తులైన సోపానములు, లీలయందు భాగమెత్తుకొను పద్ధతులు, అనేకములు కలవు. ఒక యజ్ఞానదశ యున్నది, అందు నీవొక దానిని జేసెదవు, దానిని నీవే నిశ్చయించితివని నమ్మెదవు; మఱియొక దశయందు అజ్ఞానము తగ్గియున్నది, అందు, నీవు చేయించబడుచున్నావని తెలిసికొని చేసెదవు, కాని ఎట్లు ఏలయని యెఱుగవు; మఱియు నొక చైతన్యస్థితి యున్నది. అందు నీవు పూర్ణముగ ఎఱుకతో నుందువు,—ఏలన, నీమూలమున కార్యముజేయునది యేది యని నీకు దెలియును, నీవు ఒక యుపకరణమని నీకు దెలియును; ఏల యెట్లు ఒక పనిని నీవు చేసెదవు, దానివిధానము, దాని ప్రయోజనము అంతయు నీకు దెలియును. ఏ యజ్ఞానదశయందు నీకర్మలకు గర్త నీవే యని నమ్ముదువో, అది నీయభివృద్ధికి ఆవశ్యకమయినంతవరకు నుండును; ఒక పైస్థితికి బోవ నీవు శక్తుడ వగునప్పుడే, ఏకమైన చైతన్యమునకు నీ వుప

కరణ మని కనుగొన దొడంగుదువు; పైగ ఒక మెట్టు పోయెదవు, ఉన్నతతరమైన ఎఱుకగల మట్టమునకు ఉద్గ మించెదవు.

"శత్రుశత్రులు ప్రాణలోకమునందు (మనలను) అభిద్రవించు నట్లు మనోమయకక్ష్యయందు గూడ జేయునా?"

అనేక విషయములను వివరణ జేయక (ఈ ప్రశ్నకు) నియతమైన యుత్తరమిచ్చుట కష్టము. ఆ విష యముల నిట చర్చించ వీలుపడదు.

మనస్సు గతిమయ (చలన) మైనది, ఒక్కటియే, కాని ఆగతియందు పలువిధములు, పలు ఆస్తరములు (పఱపులు) కలవు; అవి ఒకటి నొకటి స్పృశించుచు నెగ్గును. ఇది యిట్లుండ, మనము మనస్సు అనునట్టి గతి విశేషము ఇతరకక్ష్యలయందును దూరును. మనోమయ లోకమందే యనేక మట్టము లున్నవి. ఆ మనఃకక్ష్యలు, మనశ్శక్తు లన్నియు అన్యోన్యాధీనమై యుండును; కాని వానిగతులయందు గుణభేద మున్నది. వివరణ సౌకర్యా ర్థమై వానిని ప్రత్యేకపఱచెదము. ఈవిధమున, పరమైన మనస్సు, మధ్య వర్తి మనస్సు, భౌతిక (స్థూలమైనది)

మనస్సు, ఇంక నత్యంతము అన్నమయమైన మనస్సు అని వ్యవహరించెదము ; ఇంకను అనేక విభాగముల జేయ వచ్చును.

ఇపుడు, ప్రాణలోకముయొక్క యధికార మంద నట్లు దానికి చాలపైగ మనఃకక్ష్యలు కలవు ; అక్కడ శత్రుశక్తులుగాని, శత్రుసత్త్వములుగాని యుండవు కాని వేఱుకక్ష్య లున్నవి—అవి అనేకములు—వానిని ప్రాణమయశక్తులు తాకి అందు దూరనగును. భౌతిక లోకమునకు జేరిన మనఃకక్ష్య అని మనము వాడెడిది భౌతికమనస్సు, వాస్తవమైన మనస్సుకంటె నిర్మితియం దును గతియందును ఎక్కువ జడమైనది (అన్నమయ మైనది, స్థూలమైనది). ఇదియే ప్రాణలోకముయొక్కయు విపక్షశక్తులయొక్కయు అధికారమునకు చాల లోబడు చున్నది. అవరమైన ప్రాణమయప్రజ్ఞతోను తత్ప్రవృత్తుల తోను ఈస్థూలమనస్సునకు సాధారణముగ నొకవిధమైన కలిమి కలదు ; అవరమైన ప్రాణమయసత్త్వము ఈషణ లను ప్రేరణలను బయల్పఱచునపుడు, ఎక్కువగ అన్న మయమైన యీమనస్సు సాయపడుటకువచ్చి, చూచుటకు

యుక్తమువలె గనబడు వివరణములతోను, హేతూక్తుల తోను, వ్యాజములతోను, వానిని న్యాయ్యమని యాదరించును. మనస్సునందలి యీ ఆస్తరమే ప్రాణలోకపు సూచనలకు మేలుకొనియున్నది; కావున నాశక్తులు దీనిపై దండెత్తును. కాని మనయందు ఉన్నతమైన (పర) మనస్సు ఒకటికలదు; అది అవ్యాజభావములు ప్రకాశముగల భావనలును గల ప్రదేశమందు వ్యాపరించును, రూపముల నుత్పాదించును; మఱియు, ఇంతవఱకు రూపియ్యబడని భావములు(బుద్ధివృత్తులు) మాత్రముగల మనస్సు ఒకటి కలదు. మహత్తరములైన యీ మానసాస్తరములు ప్రాణప్రవృత్తులనుండియు శత్రుశక్తులనుండియు చాల దూరమున పైగ నున్నందున వానిబంధము లేక స్వేచ్ఛానుసారముగ నుండును. అక్కడ అన్యోన్య విరుద్ధగతు లుండవచ్చును, సత్యముతో సంఘర్షించదగిన గతులును రూపనిర్మితులును అచ్చట నుండవచ్చును; కాని ప్రాణలోకపు బాధ, శాత్రవము అని చెప్పదగినది ఏదియు నుండదు. తత్త్వవిచారముగల యథార్థమైన మనస్సు, ఆలోచనజేయు మనస్సు,కనిపెట్టునది, రూపముల

నిర్మించునది, ఇంక రూపియ్యబడని ధీవృత్తులు (శుద్ధభావములు) గల మనస్సు—ఇవి యీ క్రిందటి యాక్రమమునకును ప్రతాపమునకును చాలపైగ నున్నవి. కాని నే నింతవఱకు జెప్పినవానికంటె నధికతరసత్త్వము బలము గలవియు ఉన్నతతరమైన జన్మస్థానము గలవియు నగు కుటిలమైన సత్త్వములుగాని శత్రుసత్త్వములుకాని వీని (పూర్వోక్త మనస్సుల) చలనములను సృష్టులను అనుకరించ నలవిగా దని యర్థము కాదు.

"చైత్యలోకముయొక్క పరిస్థితు లెవ్వి? శత్రుశక్తుల విషయమై అది యెట్లు అవస్థితమై యున్నది."

జగముయొక్క యేభాగము దైవచైతన్యవశమున సాక్షాత్తుగ నున్నదో అదియే చైత్యలోకము, లేక, చైత్యచిత్కుక్షి; అట్లే మనసత్తయందు ఏభాగము సాక్షాత్తుగ దైవచేతన వశమున నున్నదో అదియే చైత్య పురుషుడు. దానిపై శత్రుశక్తుల వ్యాపారము అత్యంత దూరముగ గూడ శక్యముకాదు. అది సంవాదభూయిష్ఠంబైన లోకము, అచ్చట సర్వమును ప్రకాశమునుండి ప్రకాశమునకు, అభివృద్ధినుండి యభివృద్ధికి చలించును.

అది పురుషవ్యక్తియందలి దైవచేతన యుండుస్థానము, పరమాత్మపీఠము. అది జ్యోతి స్సత్యజ్ఞాన సౌందర్య సామరస్యముల కొక ముఖ్యస్థానము (కేంద్రము) ; వీనిని మీలో ప్రతివానియందును గల (దైవాత్మ) దేవుడు, ఆత్మ, తన సాన్నిధ్యముచేత కొద్దికొద్దిగ సృజించును. తన్ను జేరినభాగమైన దానిని (చైత్యమును) అధికరించుచు కదలించుచు, దానికి రూపిచ్చుచు నున్నది దైవచేతన. అది మీలో ప్రతివానియందును గల యగాధమైన (అంతఃసత్త్వ) అంతర పురుషుడు ; నీలోనున్న దైవము యొక్క సంపర్కమునకై నీవు దానిని గనిపెట్టవలయును. అది దైవచేతనకును నీయొక్క బాహ్యప్రజ్ఞకును మధ్య వర్తిగ నున్నది ; అదియే అంతర్జీవితమును నిర్మించునది, దైవేచ్ఛయొక్క వ్యవస్థను శాసనమును బాహ్యప్రకృతియం దావిష్కరించునది. నీలోనున్న చైత్యపురుషుని బాహ్యప్రజ్ఞయం దెఱిగి తాదాత్మ్య మొందుదువేని, నిత్య శుద్ధ చైతన్యము నెఱుగగల్గి దానియందు నీవు వసించనగును. మనుష్యు డెల్లప్పుడును అజ్ఞానచాలితుడై యున్నట్లు ఉండక, నీలోనున్న నిత్యజ్యోతి జ్ఞానముల

సన్నిధి నెఱుగ బెంపొందుదువు; మఱి దానినే శరణు జొచ్చి, దానికి సమగ్రముగ నిన్ను నివేదన మొనర్చు కొని సకలవిషయములయందును తత్ప్రేరితుడవుగనే యుందువు.

చైత్యపురుషు డనునది పూర్వమే దైవమున కర్పిత మైన నీయందలి భాగవిశేషము. నీయొక్క సర్వ స్వభావ మందును మార్పును దెచ్చియియ్యగలదై దానిప్రభా వమే క్రమక్రమముగ లోపలనుండి బయటికి, నీప్రజ్ఞ యొక్క (జడమయ) అన్నమయములైన మేరలను వ్యాపించుచున్నది. ఇచ్చట (ఈచైత్యమునందు) అప్ర కాశ మేదియు లేదు; ఇది నీయందలి ప్రకాశాంశము. పెక్కండ్రు తమలో నున్న ఈ చైత్యాంశము నెఱుగరు. దాని నెఱుంగునట్లు చేయుట యోగముయొక్క కార్యము, అందువలన, మార్పును సాధించువిధానము, 'మందముగ బహుశతాబ్దపరిశ్రమ సాధనీయము గాక ఒక పురు షాయుస్సులోనే స్వల్ప సంవత్సరములోనే అడగును.

చైత్యపురుషుడు అనునది మరణమునకు పిదప నుండుచు నున్నయది; ఏలన నది నీయొక్క శాశ్వత

మయిన ఆత్మ ; ఒక జీవితమునుండి మఱొక జీవితమునకు చేతనను ముందుకు గొనిపోవునది యీ చైత్యపురుషుడే.

నీలోనున్న యథార్థమైన దైవవ్యక్తియొక్క వాస్తవవ్యక్తిత్వమే చైత్యపురుషు డనునది. నీవ్యక్తిత్వ మనగా, నీకు విశిష్టముగనున్న ఆవిష్కరణప్రకారము; మఱి నీయొక్క చైత్యపురుషు డనగా, నీయం దాకృతిం బడసిన దైవచేతనయొక్క రూపవిశేషము. కాని వ్యక్తి చేతనకు విశ్వచేతనకును గల విభాగబుద్ధి, నీస్వభావపు యితరభాగములను బాధించునది, చైత్యప్రజ్ఞయందు లేదు; నీ వ్యక్తిత్వము నీ వావిష్కరించు పద్ధతియని నీ వచ్చుట నెఱుగుదువు; కాని యపుడే,ఏకమైన విశ్వచేతనను విషయాకారముం గావించునది నీయావిష్కార మని గూడ నెఱుంగుదువు. నీవద్దనుండి నీవొకభాగమును దీసి ముందట బెట్టినయెడల, రెంటికిని అన్యోన్యదృష్టియు అన్యోన్యగతిలీలయు నెట్లు కనబడునో అది యట్లుండును. విషయాత్మకమైన సంబంధమును సృజించి దాని ననుభవించుటకై యీద్వైతభావము ఆవశ్యకమైనది. కాని నీ చైత్యపురుషునియందు ద్వైతభావమును తీవ్రపఱచు

విభాగము భ్రాంతిగ గనబడును, ఒకకానుపే, మరే మియుగాదు.

"ఆధ్యాత్మికమునకును చైత్యమునకును భేదము కలదా? అవి వేఱు వేఱు కక్ష్యలా?"

కలదు. చైత్యకక్ష్య పురుషవ్యక్తియొక్క యావి ష్కృతికి సంబంధించినది; చైత్యము నీయందుగల దైవాం శము క్రియార్థమై లీలయం దుంచబడియున్నది. కాని మనము అధ్యాత్మ మనునపుడు, బాహ్యవిష్కృతి యం దంతగగాక దైవమునందు ఏకాగ్రతంబొందియున్న యేదో యొకదానిని తలచెదము. ఆధ్యాత్మికక్ష్య బహిర్ముఖమైన లీలకు వెనుక స్థాయియై పైగ నున్నది. ప్రకృతియొక్క కరణములకు నాధారముగ నుండుచు బాహ్యవిష్కార మునందు అంతర్యాతముగ గాని అంతర్హితముగ గాని కాకున్నది.

కాని, ఈవిషయములం గుఱించి భాషించునపుడు మనము ప్రయోగించు పదములు మనకు బంధనములు గానీయక జాగరూకతతో నుండవలెను. నేను చైత్యము లేక అధ్యాత్మ మని చెప్పునప్పుడు, పదములయొక్క

బాహ్యతలమునకు వెనుక అగాధముగనుండు వాస్తవమైన విషయములను, భేదమునందుగూడ నత్యంత సంబంధముగల వానిని, ఉంచుకొని చెప్పెదను. బుద్ధికృతములైన లక్షణనిర్దేశములు, భేదనిర్ణయములును, యథార్థమైన వస్తుతత్త్వముల గ్రహించరానివై యత్యంత బాహ్యములుగను, కఠినములుగను ఉండును. అట్లుండినను, మాకు ఒకరితోనొకరు సంభాషించు నలవాటుండినదప్పు, నొకరినొకరు ఎఱుగవలెనేని పదముల యర్థమును నిష్కర్షించుట ప్రాయికముగ నావశ్యకమే. సంభాషణకు ఆదర్శభూతమైన స్థితి యేదనగా, మనస్సులు ఒకటితోనొకటి పొందుబడి, ఒకరినొకరు స్వతః బోధపఱచుకొనుటకు పదము లాధారముమాత్రమే యయి, అడుగడుగునకు వ్యాఖ్యానావశ్యకత లేకుండుటయే. ఒకేమనుష్యులతో నెప్పుడును సంభాషించునప్పుడు ఈ ఆనుకూల్యము కలదు. వారి మనస్సులయందు యుక్తమైన సంవాదము ప్రతిష్ఠితమై యున్నది, చెప్పిన విషయముల లక్ష్యార్థము తక్షణమే వారిలో బ్రవేశించును.

రూపములేని భావములు గల లోకమొకటి కలదు; పదములకు వెనుక ఏది యున్నదో దాని నెఱుగగోరుదు

వేని నీ వచ్చుటకి పోవలెను. వచనముల రూపములనుండి తెలిసికొనవలసిన స్థితియందు నీ వుండునంతవఱకు, నిజమైన భావము నెఱుగువిషయమై ఆకులపడుదువు; కాని, మనస్సుయొక్క మౌనమునుండి,రూపెత్తుటకై భావములు ఏలోకమునుంచి దిగుచున్నవో, ఆలోకమున కేగుదువేని, తత్క్షణమున నిజమైన బోధము కలుగును. మీరు ఒకరి నొకరు నిశ్చితముగ నెఱుగవలెనేని, మౌనమునందు తెలిసికొనుటకు శక్తులు కావలయును. ఒకస్థితి యున్నది, అందు మీ మనస్సులు యుక్తములుగను సంవాదసంపన్నములుగ నున్నవి; కావున నొకడు మఱియొకని తలంపును భాషయొక్క ఆవశ్యకత లేకయే ఎఱుగ నగును. ఇట్టి పొందిక లేదేని, నీభావమునకు ఎప్పుడును నేదైన నొక వికృతి కల్గును; ఏలన, నీవు దేనిని జెప్పెదవో దానియందు మఱియొక మనస్సు తనసొంత అర్థము నుంచును. ఒక యర్థమునందో, ఒక యర్థచ్ఛాయయందో నే నొకపదమును బ్రయోగించెదను; దానికి వేఱు అర్థమునో, అర్థచ్ఛాయనో తెలిసికొను వాడుక నీ కున్నది. అప్పుడు, స్వచ్ఛముగ, నీవు తెలిసికొనగలది యథార్థమైన నాయభి

ప్రాయము గాదు, మఱి ఆపదమునకు నీ యర్థమేదియో దానినే. ఇది సంభాషణయందు మాత్రము నిజము కాదు, చదువుటయందుగూడ. అగాధమైన బోధనగల ఒక గ్రంథమును బోధపఱచుకొన గోరుదువేని, మనస్సుయొక్క మౌనమునుండి చదువ నీవు శక్తుడవు కావలయును; కాచుకొనియుండి, వాచకము లోపల లోతుగ భాష లేని ప్రదేశమునకు బోవనిచ్చి, అచ్చటనుండి మెల్లగ నీ బాహ్యప్రజ్ఞకు బాహ్యతల (స్థూల) మున నున్నబోధమునకు రావలయును. అట్లు కాక నీవు పదములను బాహ్యమనస్సుపై దుముకవిడిచి రెంటిని పొందుపఱచుటకు ప్రయత్నింతువేని, వాని నిజమైనభావ మందును శక్తియందును బొత్తిగ తప్పగలవు. నీవు వాచకస్థానమునకు వెనుకనుండెడు వ్యక్తముకాని మనస్సుతో నైక్యముం బొందినదప్ప, పూర్ణముగ నెఱుగుట యనునది శక్యము కాదు.

ఒక సమయము, ప్రత్యేకమనస్సులు ఒకటితో నొకటి కలియక, భిన్నభిన్నములయిన లోకములవంటివని చెప్పితిమి. ఒక్కొక్కటియు తనలోనే తాను బంధితమై

యితరముతో సామాన్యముగ సాహచర్య సంబంధ ముంచు కొనకుండును. కాని, అది క్రింది (అవరమయిన) మనో భూమియం దట్లుండును; అక్కడ నీయొక్క రూపనిర్మితులే నిన్ను కప్పుచున్నవి. వస్తువులయందు నిన్ను, నీప్రతి బింబమునే, నీ వెఱుగగలవు. కాని, బయల్పడని మనస్సు యొక్క యీ పరతరప్రదేశములందు, స్వచ్ఛములైన ఉన్నతులయందు నీవు స్వతంత్రుడవు; అచ్చట నీవు ప్రవేశించునపుడు, నిన్నుండి (నీప్రత్యేకతనుండి) నీవు బహిర్గతుడవై విశ్వముయొక్క మనోమయకక్ష్యను దూరెదవు. అందు వ్యక్తిగతమయిన, ఒక్కొక్క మనోలోకము, (ప్రత్యేకముగ నున్నది) మహాసముద్రమునందు మునుగుచున్నట్లుండును. అచ్చట, ఇంకొకని మనస్సును నీమనస్సుగ నున్నట్లెఱిగి అందేమి జరుగుచున్నదో దానిని దెలిసికొనవచ్చును; ఏలన, అచ్చట నొక మనస్సును మఱొక మనస్సునుండి విభజించు వియోజనము లేదు. ఆప్రదేశమం దితరులతో నేకీభవించునపుడే వారలను నీ వెఱుగనగును; కాకపోయిన, నీమనస్సుకంటె నన్యమనస్సుతో నీకు పొందికయుండదు, స్పర్శ ముండదు,

అందేమి జరుగుచున్నదని నిశ్చితముగ నెఱుగుటకు నీ కుపాయము లేదు. తలచుచుగ, నీవు మఱియొకని సమక్ష మున నున్నపుడు వాని చింతన యేమో వేదనమేమో నీ వెఱుగవు, కాని బాహ్యమున వెలువడు కక్ష్యకు పై నావల పోవగల్గుదువేని, జ్ఞానముతో సంసర్గము సాధ్యమగు నొక కక్ష్యావిశేషమును బ్రవేశించ నగునేని, నీ కా యితరుని మనస్సును, నీమనస్సునువలె, పఠించుటకు వీలుపడును. అపుడు, బయల్పఱచుటకు నీవు ప్రయో గించు వచనములకు ప్రాధాన్యము అత్యల్పము; ఏలన, పూర్ణముగ గ్రహించుట వానికి(వచనములకు)అతీతముగ నున్న పేఱొకదానియం దున్నది; నీ యుద్దేశమునకు అతి స్వల్పవచనములు చాలును. అచ్చట దీర్ఘ వివరణము లావశ్యకములు కావు; ఒకతలంపును వెలిపఱచుటకు పూర్ణ మయిన వాచకము నీ కావశ్యము కాకపోవును; ఏలన, ఏ అర్థము వివక్షితమో, దాని సాక్షాద్దర్శనము నీవద్ద నున్నది.

"శత్రుశక్తులు లేకుండనే పోవు కాలము ఒకటి వచ్చునా?"

లోకమునందవి యుండుట కుపయోగము మఱే మియు లేనట్లు అగునపుడు, అవి పరా రగును. వాని కర్మ

పరిపూర్ణకమైన విధానముగ నుపయుక్త మగుచున్నది, అందువలన నేదియు విస్మృతము కాక పోనగును; పరి వర్తన (మార్పు) కార్యమం దేదియు పరిత్యక్తము కాక పోనగును. అవి పొరబాటు బడనీయవు. నీసత్తయందు ఒకవిస్తరాంశమును గమనించకపోయిన, అవి వచ్చి నీవు లక్ష్యపెట్టని యాస్థానమున తమస్పర్శము నుంచి నీకు బాధతో నది స్పష్టమగునట్లు చేయును; అందువలన నీవు. బలాత్కారముచేత మార్పు బొందుదువు. ఈపద్ధతికి అవి ఎప్పుడు ఆవశ్యకము కావో, అపు డవి యుండుట నిరుపయోగము, పాఱిపోవును. అవి యిచ్చట నుండుట అనుమతం బయ్యె; ఏలన, మహాకార్యమున కవి ఆవశ్యక ములు; ఎప్పు డనివార్యములు గావో అపుడవి మాఱును, లేకపోయిన, తొలగిపోవును.

"అట్లు సంఘటించుటకు చాలకాలము పట్టునా ?"

అంతయు నేస్థితినుండి చూచెదవో దానింబట్టి యున్నది. కాల మను నది సాపేక్షము (ఒకదానిని అపే క్షించినది, సంబంధించినది). దానింగుఱించి, మనుష్యుల సాధారణ బాహ్యస్థితినుండి, లేక, చాలలోతున నున్న

అంతః ప్రజ్ఞయొక్క దృష్టిస్థానమునుండి, లేక, దైవము యొక్క అవేక్షణమునుండి వ్యవహరింపవచ్చును.

నీవు దైవచేతనతో నేకుడవై యున్నచో, నొక దానిని చేయుటకు మానవగణ నానుసారముగ సహస్ర సంవత్సరములు పట్టునో ఒకసంవత్సరమే పట్టునో అది ముఖ్యము కాదు; ఏలన, నీవు మానవప్రకృతికి సంబంధించిన సర్వమును నీకు బాహ్యమున విడిచిపెట్టి దైవ ప్రకృతియొక్క అఖండత్వమును, నిత్యతను ప్రవేశించెదవు. కార్యములను త్వరగచేసి ముగించి చూడగోరుట వలన మానవుల నావేశించి బాధపెట్టు తీవ్రమయిన ఔత్సుక్యమునుండి నీవు తప్పించుకొందువు. క్షోభము, త్వర, చాంచల్యము, ఇవి (మనలను) ఎచ్చటను తీసికొని పోవవు. అది సముద్రపు నీటిపైని నురుగు; అది ఒక పెద్ద కోలాహలము, తనతోనే నిలిచిపోవును. సంభ్రమముతో క్రియల యావేశములంబడి ఎల్లప్పుడు నట నిట బలుగెత్తు చుండనియెడల తామేమియు జేయకున్నామని ఒక భావము మనుజులకు కలదు. ప్రవృత్తులు అను చెప్పబడు నివి యన్నియు విషయములను మార్చుచున్నవను తలంపు ఒక భ్రాంతి. ఒక పాత్రను దీసికొని దానియం

దలి నీటినిగొట్టుట యెట్లో యట్లే ఇది ; నీరు అట నిట చలించును గాని నీవు ఎంతకొట్టినను అది యేమో మాఱదు ఈ క్రియాభ్రాంతి మనుజప్రకృతిలోనుండు మహత్తమ భ్రాంతులలో నొకటి. అది అభివృద్ధిని బాధించెడిది ; ఏలన నిది ఎప్పుడు నేదైన నొక సంభ్రాంతప్రవృత్తియందు నీవు పడుటను ఆవశ్యకతను దెచ్చును. నీవు ఈ భ్రాంతిని గనుగొందువేని, ఇది యంతయు నెట్లు నిష్ప్రయోజనమో, ఎట్లు దేనిని మార్చదో, అని చూచుదువేని (ఎంత బాగుగనుండును)! దాని చేత నీవు ఎచ్చటను దేనిని మార్చలేవు. ఎవరిట్లు వేగిరపడిపోవుచున్నారో వారు (కొన్ని)శక్తులవద్ద యంత్రమాత్రముగ నున్నారు; అవి వీరలను తమ వినోదార్థ మాడించుచున్నవి; అవియు నుత్తమగుణముగల శక్తులు కావు.

లోకమునందు (ఇంతవఱకు) చేయబడినది ఏదిగ నుండినను, క్రియకు బాహ్యముగ మౌనస్థితులలోనుండి కొందఱే దానిని జేసియున్నారు. ఏలన, దైవశక్తికి ఉపకరణముగ నున్నవారు వారే. వారు క్రియాపరులైన ఆధికారికపురుషులు, ప్రాజ్ఞములైన యుపకరణములు; వారే లోకమును మార్చదగిన శక్తులను దెచ్చెదరు.

ఆరీతిగనే కార్యములు చేయుటకు శక్యములగును, చంచలమైన క్రియచేత గాదు. శాంతియందు, మౌనమునందు, నైశ్చల్యమునందు, జగత్తు నిర్మితమయినది; ప్రతియొక్కమారును, దేనినైన నిజముగ నిర్మించవలసినయెడల, దానిని శాంతియందు మౌనమునందు నిశ్చలతయందు జేయవలయును. లోకమున కేదైన నొనర్పుటకై ప్రాతఃకాలము మొదలుకొని సాయంతనమువఱకు పఱుగెత్తుచునుండి సర్వవిధ నిష్ప్రయోజన విషయములయందు శ్రమపడవలెనని విశ్వసించుట అవివేకము.

ఒకమారు నీ వీ సుడివంటి శక్తులనుంచి వెనుకవెళ్లి నిశ్చలప్రదేశముల నడుగుబెట్టినచో, నెంత గొప్ప భ్రాంతిని జూచెదవు, (తెలియునా)? ఇచ్చట నచ్చటను పఱుగెత్తుచు, ఏమిచేసెదము ఏలచేసెదము అని యెఱుగక ఒకరిపై నొకరు తాడనమొనర్చుచు పడుచునున్న అంధజంతువుల గుంపువలె మానుష్యకము నీకు కనబడును. అట్లుండియు, దీనిని (జనులు) క్రియ అనియు జీవితమనియు చెప్పెదరు. అది వట్టిక్షోభము, క్రియ కాదు, నిజమైన జీవితము కాదు.

పదినిముసము లుపయోగకరమైన సంభాషణ చేయవలెనన్న పదిదినములు మౌనముగ నుండవలెనని నేనొక సమయము చెప్పితిని. ఒకదిన ముపయోగకరముగ పని జేయవలయునేని, ఒక సంవత్సరము నీవు నిశ్చలుడవై యుండవలెనని నే నిపుడు చెప్పగలను. దినదినము చేయు బాహ్యజీవితమున కావశ్యకములయిన సాధారణక్రియలను గుఱించి నేను చెప్పలేదు, అది తెలిసినదే; ఎవరికి లోకమునకు చేయవలసిన దేదియైన నున్నదో, లేక, అట్లున్నదని విశ్వాసమున్నదో వారినిగుఱించి నేను చెప్పెద. నే జెప్పు మౌనము అంతఃస్థితమైన నైశ్చల్యము; ఎవరు తమక్రియతో నేకభావముం బొందక, తమ ప్రవృత్తియొక్క రూపుచేతను మ్రోతచేతను అంధులును బధిరులును గాక (దేనినైనను) ఆచరించగలరో, వారికే ఆ మౌన ముండును. నీక్రియనుండి నివృత్తుడవై కాలకృతమైన చలనములకు పైగ బోయి అవేక్షను బొందుము; నిత్యవస్తువుయొక్క ప్రజ్ఞయందు దూరుము. అపుడే యథార్థమైనక్రియ యిట్టిదని నీకు దెలియును.

# తొమ్మిదవ ప్రకరణము

“ మానవప్రేమకును దైవప్రేమకును సంబంధ మేమి? దైవప్రేమకు ప్రతిబంధకమా మానవప్రేమ? అట్లుకాక మానవప్రేమసామర్థ్యము దైవప్రేమసామర్థ్యమున కొక సూచకము కదా? క్రీస్తు రామకృష్ణ వివేకానందాదులవంటి గొప్ప యాధ్యాత్మిక పురుషులు లక్షణీయమైన ప్రేమభరితస్వభావము గలవారుగ నుండియున్న వారు కారా?”

బ్రహ్మాండ మహాశక్తులలో ప్రేమ యొకటి; అది స్వాశ్రయమైనది, దానిగతి (పోకడ) దేనియందు దేని మూలమున నావిష్కృత మగునో దానిపై నాధారపడక స్వేచ్ఛానుసారముగ స్వతంత్రముగ నుండును. ఎచ్చట నావిష్కృతికి సంభవ మున్నదో, ఎచ్చట గ్రహణసామర్థ్య మున్నదో, ఎచ్చట తనకేసి వికాస మున్నదో, అచ్చట నది స్పష్టమగును. నీవు దేనిని ప్రేమ యని చెప్పి అది పురుష గతము, వ్యక్తిగతము అని యనుకొనెదవో, అది యా

బ్రహ్మాండశక్తిని గ్రహించి వెలిపఱచుటకు గల నీసామర్థ్య విశేషము మాత్రమే. కాని అది విశ్వగత మను కారణమువల్ల ఒకజడశక్తి (ఎఱుకలేనిది) కాదు ; అది పరమమైన ప్రజ్ఞగలశక్తి. ప్రజ్ఞాపూర్వకముగ నది తన్ను భూలోకమునం దావిష్కరించి సాక్షాత్కృతముగావించుకొన నన్వేషించుచున్నది ; ప్రజ్ఞాపూర్వకముగ తన యుపకరణములను తాను వరించుకొనుచున్నది, ఎవరు తన గతిస్పందములకు ప్రత్యుత్తర మియ్య సమర్థులో వారికి తన గతిస్పందములయందు ప్రబోధము నిచ్చుచున్నది, తన నిత్యమైన లక్ష్యమేదియో దానిని వారియెడ సాక్షాత్కృతమొనర్ప యత్నించుచున్నది; మఱియు, నెప్పు డుపకరణము అర్హము కాదో, అప్పుడు దానిని పడవేసి యితరములకేసి యన్వేషించును. మనుజులు తామకస్మాత్తుగ ప్రేమవశంగతులైనట్లు అనుకొందురు. ప్రేమ పుట్టి పెరిగి వాడిపోవుటను వారు చూచెదరు, లేక పోయిన నట్లును ఉండవచ్చును: ఆప్రేమగతి దీర్ఘకాలస్థాయిగ నుండుటకు విశిష్టయోగ్యతగల కొందఱియెడ నది యెక్కువ కాల ముండుటను వారు చూచెదరు. కాని,

వారికి ఇందు గల భావము, వ్యక్తిగతమై తమకు ప్రత్యేక ముగ సొంతమనునది, ఒక భ్రమ. శాశ్వతమైన విశ్వగత ప్రేమసముద్రమునుండి యొక తరంగ మే అది.

ప్రేమ విశ్వగతము, నిత్యము; అది ఎల్లప్పుడును తన్ను ఆవిష్కరించుకొనుచు, తనసారాంశమున (మార్పు లేక) తదేకరూపమై యుండును. మఱియు, నది యొక దైవశక్తి; దానియొక్క ప్రత్యక్షవ్యాపారములయందు మనము చూచు వికారములు ఉపకరణములకు సంబంధించినవి. ప్రేమ మానవులయందు మాత్రము స్పష్టమగు నది కాదు; అది సర్వగతము. దానిగతి గ్రహములయందు గలదు. ఒకవేళ, ఱాళ్లయందును ఉండవచ్చును; మృగములయందు తత్సాన్నిధ్యముం గనిపెట్టుట సులభము. మహత్తైన ఈ దివ్యశక్తియొక్క వికార రూపులన్నియు పరిచ్ఛిన్నమయిన యుపకరణముయొక్క అప్రకాశ—అజ్ఞాన—స్వార్థపరత్వముల నుండి కలుగుచున్నవి. ప్రేమకు, ఆ సనాతనమైనశక్తికి, ఆసక్తిలేదు, ఈషణలేదు, ఆక్రమణేచ్ఛ (భోగేచ్ఛ) లేదు, స్వాభిమాన సంగము లేదు; దాని పరిశుద్ధగతిస్వరూప మే మనగా, ఆత్మకు దైవముతో

నైక్యము నన్వేషించుట, ఇతరవిషయములను లక్ష్యపెట్టక, అనన్యలక్ష్యముతో నన్వేషించుటయే. దైవప్రేమ తన్ను ఇచ్చుకొనును గాని దేనిని యడుగదు. మానవులు దాని నేమి చేసియున్నారని మనము చెప్ప నక్కఱ లేదు; వారు దానిని మలినముగను బీభత్సావహముగను మార్చి యున్నారు. అట్లున్నను, మానవులయందు ప్రేమయొక్క ప్రథమస్పర్శము తనయొక్క అతి స్వచ్ఛసత్త్వము (ద్రవ్యము) నుండి ఒకింత దెచ్చుచున్నది; ఒకక్షణము వారు తమలను మఱచిపోవుటకు శక్తు లయ్యెదరు; ఏలన, ఒక క్షణము దాని దివ్యస్పర్శము సుకుమారమును సుందరము నైనదంతను ప్రబోధపఱచి యుపచితముం గావించుచున్నది. కాని తరువాత మానవస్వభావము, అశుద్ధాపేక్షాపూరితమైనదై, ప్రతిఫలముం దేనినైన గోరుచు, తా నిచ్చుటకు వినిమయము నడుగుచు, తన నీచతృప్తులకై యాక్రందించుచు, ఏది దివ్యముగ నుండెనో దానిని వికారపఱచి యశుద్ధపఱచుచు, బాహ్యతలమునకు వచ్చుచున్నది.

నీవు దైవప్రేమ నావిష్కరించుటకు, దైవప్రేమను గ్రహించు శక్తి నీ కుండవలెను. ఏలన, ఎవరు దాని

సహజమైన గతికి స్వభావముననే ఉన్మీలితులై యున్నారో వారే దాని నావిష్కరింపగలరు. వారి యున్మీలన మెంత విశాలముగను ప్రసన్నముగ నుండునో, అంత దైవప్రేమను మూలపారిశుద్ధ్యముతో వెలిపఱచగలరు; ఎంత నికృష్టమైన మానవభావములతో నది మిశ్రితమైనదో, అంత అధికముగ నుండును వైరూప్యము కూడ. ఎవడు ప్రేమయొక్క సారాంశమునకును సత్త్వమునకును ఉన్మీలితుడు కాడో, వాడు దైవమును సమీపించుట శక్యము కాదు. జ్ఞానమార్గానుసారులు కూడ ఒకస్థానమునకు వచ్చి, దాని నతిక్రమించి పైకి పోవగోరుదురేని, వారు 'దైవసమాగమముయొక్క ప్రకాశము జ్ఞానము, జ్ఞానము యొక్క హృదయమే ప్రేమ' అని యీరెంటిని ఒకటిగనే అనుభవించి అదే సమయమున ప్రేమయందు ప్రవిష్టులనుగ తమ్ము గనుగొనక మానరు. జీవునియొక్క క్రమాభివృద్ధియందు ఒకస్థానము కలదు. అందవి (రెండును)కలసిపోయి, ఒకటినుండి మఱియొకటిని ప్రత్యేకపఱచ వీలుపడదు. ఈ విభజనము, ప్రారంభమున ఈరెంటికిని నీవు పాటించుభేదము, మనస్సుయొక్క ఒక సృష్టి: పైనున్న మట్టమునకు నీవు వెళ్ళునపుడు ఇవి తొలగును.

ఇచ్చట దైవమును వెల్లడించి, భూమియందు లౌకికజీవితమును మార్చనెంచి యీలోకమునకు వచ్చిన వారలలో, కొందఱు దైవప్రేమ నధికతరమైన పరిపూర్ణతతో నావిష్కరించి యున్నారు. కొందఱివద్ద ఆవిష్కరణ పారిశుద్ధ్యము చాల గొప్పది, కావున దానిని తప్పుగ దెలిసికొనినదై మానవసంఘము సమస్తము, వారియెడ దైవప్రేమయున్నను, వారు కర్కశులు, ప్రేమ లేనివారని దోషారోపణ జేయుచున్నది. కాని అది (ప్రేమ) వారి యెడ రూపమునందును సత్త్వమందును మానుషముగ గాక దివ్యముగ నున్నది. మానవుడు ప్రేమనుగుఱించి భాషించునపుడు, రాగభావోద్రేక దౌర్బల్యముతో దానికి సంబంధము నుంచును. కాని, ఆత్మవిస్మృతిం గల్గించు దివ్యగాఢత ప్రతిఫలముం గోరక ఏ నియంత్రణయు లేక నిశ్శేషముగ తన్ను బొత్తిగ ఒకదానముగ నర్పించు సామర్థ్యము—ఇది మానవులకు తెలియని విషయము. మఱియు నది (ఆ ప్రేమ) రాగ మయ భావములతో మిశ్రితము గాకున్నపుడు, అది వారికి కఠోరముగను దుస్సహము (శీతము)గను ఉండును. అందు

## తొమ్మిదవ ప్రకరణము

ప్రేమయొక్క అత్యున్నత గాఢతమశక్తిని వారు గుర్తెఱుగలేరు.

జగత్తున దైవముయొక్క ప్రేమ ఆవిర్భవించుట, ఒక మహాహోమము, ఉత్కృష్టమైన ఆత్మత్యాగము. పూర్ణమయిన చైతన్యము జడముయొక్క అజ్ఞతయందు మునిగి లయమగుటకు సమ్మతించెను; చేతనకు తన అప్రకాశమైన లోతులయందు ప్రబోధము కలిగి, వెలువడిన యీజగత్తు సర్వమును దైవచేతనయొక్కయు దైవప్రేమయొక్కయు నత్యున్నతమయిన యావిష్కారముం గావించ నగునని, అది యట్లు చేసెను. ఇదియే పరమప్రేమ—పరమ దైవభావముయొక్క పరిపూర్ణస్థితిని, తన యద్వితీయప్రజ్ఞను, అఖండజ్ఞానమును పోగొట్టుకొన నంగీకరించి, అచిత్తుతో నేకమై అజ్ఞానముతోను అంధకారముతోను జగమున నివసించుటయే. అట్లుండియు, ఒకవేళ నెవరును దానిని ప్రేమ యని తలపక పోవచ్చును; ఏలన నది వెలుపలి రాగభావమును ధరించి యుండ లేదు; తాను చేసినదానికి ప్రతిగ దేనిని అపేక్షించదు; తన త్యాగము నాడంబరముతో చూపదు.

జగత్తున ప్రేమయొక్క శక్తి యీదివ్యప్రవృత్తిని స్వేచ్ఛ ముగ గ్రహించి స్పష్టపఱచ సామర్థ్యముగల చిత్తులను (చేతనలను) కనిపట్టుటకు ప్రయత్నించుచున్నది. ప్రేమ కేని సకలజీవరాశుల పరుగు, ప్రపంచహృదయమందును సకలహృదయములయందును ఈ దుర్నివారమైన చోదన, అన్వేషణ— ఇది మానవ స్పృహాన్వేషణలకు వెనుక యుండు దైవప్రేమ చేయు ప్రేరణయే. అది లక్షలక్షల యుపకరణములను స్పృశించి యెల్లప్పుడు ప్రయత్న పడుచు, నెల్లప్పుడు నపజయ మొందుచు నుండును. కాని యెడతెగని యీ స్పర్శము వానిని తయారుచేయుచు నున్నది, కావున ఒకదినము తటాలున వారియెడ నాత్మా ర్పణసామర్థ్యము, ప్రేమసామర్థ్యము, మేలుకొనును.

ప్రేమయొక్క ప్రవృత్తి మానవులయందే అడగ లేదు, మానవప్రపంచముకంటె నన్యప్రపంచములయందు దానివికృతి ఒకవేళ తక్కువగా నుండవచ్చును. పుష్పము లను వృక్షములను జూడుము. సూర్యోదయ మగునపు డంతయు నిశ్శబ్ద మగుచున్నది, ఒకక్షణము కూర్చుండి ప్రకృతితో నేకాంతముగ వ్యవహరించుము ; నేలనుండి

వృక్షమూలముల యడుగునుండి వృక్షముల నార నరములమూలమున విస్తృతమగు నత్యున్నత శాఖలవఱకు పై కెక్కుచున్న ఒక తీవ్రేచ్ఛ (ఉత్కాంక్ష)ను నీ వెఱిగి యనుభవింతువు ; అది గాఢ ప్రేమయొక్కయు స్పృహ యొక్కయు నుత్కాంక్ష— వదలిపోయిన వెలుతురును మరల బొందగోరునది, ప్రకాశముం దెచ్చునది, సౌఖ్యము నిచ్చునదియు నైన నొకదానికై గల్గు స్పృహ. అందు పరిశుద్ధమైన సాంద్రమైన లాలస ఒకటి కలదు. (అది యెటువంటిదన) వృక్షములయందలి చలనమును నీవు అనుభవింతు వేని, నీయొక్క సత్త్వముకూడ నిచ్చట వ్యక్తము కాని శాంతిప్రకాశ ప్రేమల కొఱకై నిరతిశయ నమస్యయం దుండి పైకి ఉద్గమించును. ఒక మాఱు ఈ విపులమయిన, నిర్మలమైన యథార్థ దివ్యప్రేమతో నీకు సంపర్కము కలుగు నేని, స్వల్పకాలమైనను అత్యల్పరూపమందయినను, దాని ననుభవించు చుండుదు వేని, మానవేచ్ఛ దాని నెంత యధమము గావించినదని నీ వెఱుగ గలవు. మానవస్వభావమందు అది నీచము, పశుప్రాయము. స్వార్థపరము, ప్రచండము, మలినమును అయిన నేదో-

ఒకటిగ నయినది, లేకపోయిన, దుర్బలమును రాగభావమయముగను, అల్పిష్ఠభావముల చేత చేయబడినదిగను, భంగురముగను, బాహ్యముగ (కేవలము పై భాగము ననే స్థూలముగ)ను, నిర్బంధశీలముగను అయిన నేదో ఒకటిగ నయిపోయినది. ఈ నైచ్యమును, పశుత్వమును, లేక స్వాభిమానదౌర్బల్యమును లోకులు ప్రేమ యనెదరు !

"మన ప్రాణమయసత్త్వము దైవప్రేమయందు భాగము పుచ్చుకొనగల్గునా ? అట్లగునేని, ఆ భాగగ్రహణమునకు సాధువైన రూపు (సరియైనపద్ధతి) ఎయ్యది ?"

దైవప్రేమావిష్కృతి ఎచ్చట నిలువవలెనని ఉద్దిష్టము? అవాస్తవము లేక అమూర్తమయిన (నిరవయవమైన) ప్రదేశములందే యది నియమితమా? దైవప్రేమ తన యావిష్కృతిని భూలోకమున క్రింద అత్యంత జడమయ వస్తువునందు ప్రవేశింపజేయుచున్నది. అది మానవప్రజ్ఞ యొక్క స్వార్థపర వికృతులయందు తన్ను వ్యక్తపఱచుకొనజాలదు, నిజమే. కాని ప్రాణమయసత్త్వ, అభివ్యక్తమయిన సమస్తప్రపంచమందు ఎట్లో, అట్లే

దైవప్రేమయందును ప్రధానమైన నొకయంశము. ప్రాణమయసత్తయొక్క మాధ్యస్థ్యము వినా గతియు అభివృద్ధియు శక్యములు కావు; కాని, ప్రకృతియొక్క యీశక్తి చాల చెడి వికృతిం బొంది యున్నందున, దీనిని బొత్తిగ నెత్తివేసి త్రోయవలెనని నమ్ముటకు ఇచ్ఛగింతురు. అయినను, ప్రాణమూలముననే చైతన్యముయొక్క పరివర్తనశక్తి జడవస్తువును (భౌతికమును) స్పృశించును. తన క్రియాపరత్వమును, జీవనశక్తిని నివేశించుటకు ప్రాణము లేనియెడల జడము మృతముగనే మిగులును. సత్త్వము (పురుషుని) యొక్క ఉత్కృష్టభాగములకు భూలోకసంబంధము కలుగదు, అవి జీవితమునందు ఘనీభావముం బొందవు, అవి తృప్తిజెందకయే పరారగును.

నేను చెప్పుచున్న దైవప్రేమ ఇచ్చట భౌతికమైన నీభూమియందు, జడవస్తువునందు అభివ్యక్తమగు ప్రేమ; కాని అది శరీరముం దాల్పవలెనేని, మానుషవికృతులు లేకుండ శుద్ధముగ నుండవలెను. ఎల్ల యావిష్కారమునందువలె, దీనియందును ప్రాణము అనివార్యమైన కార్యకారి. కాని, ఎప్పుడునే యున్నట్లు, ప్రతికూలశక్తులు ఈ

అమూల్యవస్తువుపై తమ పిడిపట్టును వేసియున్నవి. ప్రాణముయొక్క శక్తియే మందమును, విషయగ్రహణాసమర్థమును అగు జడమును ప్రవేశించి, దానిని ప్రత్యుద్బోధసమర్థముగను, జీవిగను గావించినది. కాని ప్రతికూలశక్తులు దానిని వికారపఱచి యున్నవి. అవి దానిని స్వార్థపరతా హింసా కామనలకు, సకలవిధ మాలిన్యమునకు క్షేత్రముగ నొనర్చి దైవకార్యమున భాగముం గ్రహించనీయక అడ్డగించియున్నవి. చేయవలసిన దేమన, దానిని మార్చవలసిన దొక్కటియే, నిర్బంధముగ లోబఱచుటయో ధ్వంసపఱచుటయో గాదు. ఏలన, అది లేకుండ సాన్ద్రత (దృఢమైన తీవ్రత) ఎచ్చటను శక్యము కాదు. మనలో నేది తన్ను త్యాగముచేసికొనునో, అదియే ప్రాణము, స్వభావముననే యట్టిది. గ్రహించుకొనుటకెల్లప్పుడును ప్రేరణయు బలమును గలదిగ నున్నందుననే, అది తన్ను అత్యంత మిచ్చుకొనుటకును శక్తముగ నున్నది. ఆక్రమించి స్వాధీనమున నుంచుకొనుట యెట్లో, దానికి దెలియును, అందువలన నిశ్శేషముగ త్యజించుట యెట్లో అదియు దానికి దెలియును. నిజమైన ప్రాణప్రవృత్తి

అన్ని ప్రవృత్తులతోను నత్యంత సుందరమైనది, మహోజ్జ్వలమైనది. కాని, (లోకులు) దానిని మడిచి త్రిప్పి విరూపముగను వికృతముగను, భీభత్సముగను గావించి యున్నారు. ఎచ్చటనైన ప్రేమవిషయకమైన మానవకథయందు, పరిశుద్ధ ప్రేమ లవమైనను ప్రవేశించి యుండునేని, చాల వికారముం బొందక అభివ్యక్తమగుటకు అనుమతం బయి యుండియుండునేని, అచ్చట సత్యమైనదానిని సుందరమైన దానిని జూచెదము. ఆ ప్రేమప్రవృత్తి చాలకాల ముండలేకపోవునేని, దానికి కారణ మిది; తాను వెతకునది, తనలక్ష్య మిది యని తనకే తెలియదు. ఒకసత్త్వము లేక వ్యక్తి మఱియొకటితో సంగమించుట కాదు తాను వెదకునది. మఱి సర్వసత్త్వములును దైవముతో సంగమించుటయే తాను వెదకునది అను జ్ఞానము దానికి లేదు.

ప్రేమయనునది ఒక యుత్కృష్టమైన శక్తి; దానిని నిత్యమైన చేతన తనవద్దనుండి తమోవృతమై అంధకార కళంకితమైన జగత్తునకు, దానిని తద్గతసత్త్వములను (జీవులను) దైవమునకేసి తిరిగి తీసికొని రావచ్చునని పంపెను. అన్నమయ (జడ) లోకము తన అవిద్యాంధ

కారములందు దైవమును మఱచిపోయి యుండెను. ప్రేమ ఆచీకటికి వచ్చెను. అచ్చట నిద్రితమైన దానినంతను మేలుకొలుపెను. ముద్రితమైయుండిన చెవులను దెఱచి, "ఒక వస్తువున్నది, దానికై మేలుకొని, దానికై జీవించుట అర్హము; అది ప్రేమ." అని ఉపాంశవాద మొనర్చెను (నీచస్వరమున చెవిలో వచించెను). ప్రేమయందు ప్రబోధము కలిగి, దానితో నీజగత్తు దైవమును మరల పొందుటకు సంభవముకూడ (జగత్తును) ప్రవేశించెను. దృష్టి పైగ దైవమునకేసి ప్రేమద్వారమున బోవుచున్నది. దానికి ప్రత్యుత్తరముగ, దైవప్రేమయు దైవకృపయు సృష్టిని కలియుటకు అవనమ్ర మగుచున్నవి. (ఈ)భూమికిని (ఆ) పరవస్తువునకును మిలనము, దైవమునుండి సృష్టికిని సృష్టినుండి దైవమునకును ప్రేమయొక్క గతి,—పరస్పర వినిమయము కలుగునంతవఱకు, ప్రేమ తన స్వచ్ఛమైన సౌన్దర్యముతో నుండజాలదు, తన సహజశక్తిని,పరిపూర్ణత యందుగల గాఢానందమును బడయక పోనగును. దైవప్రేమ యిచ్చట దిగి జడమును జీవితమునకై మేలు కొల్పువఱకు ఈలోకము, మృతమైన జడలోకముగ

నుండెను. అప్పటినుండి, జీవితముయొక్క దివ్యమూలమును వెతకుకొని యిది పోయియున్నది, కాని అది వెదకునపుడు పలువిధముల తప్పుగ తిరిగి మార్గమున పొరబాటుపడి, చీకటియందు ఇట నట అల్లాడియున్నది. దేనిని వెదకుచున్నారో దానినెఱుగక, అజ్ఞాతమైనదానిని వెదకెడి అంధులవలె, ఈసృష్టియందు సామాన్యముగ నందఱును తమమార్గమున బోవుచున్నారు. వారి కింతవఱకు చాల యెక్కువగ ప్రాప్తమయినది యిది ; అత్యున్నతరూపమున మానవులకు గనబడుప్రేమ, అత్యచ్ఛమైనది, అత్యంత మవ్యాజమైనది, శిశువునందు మాతకు గల వాత్సల్యము వంటిది. ఈప్రేమయొక్క మానుషప్రవృత్తి తా నింత వఱకు కనిపట్టని దానిని దేనినో రహస్యముగ వెతకుచున్నది ; కాని, అది ఎయ్యది యని గాని ఎచ్చట దానిని గనిపట్టవలెనని గాని దానికి తెలియదు. మానుషరూపములయం దావిష్కృతిపై నాధారపడక స్వచ్ఛమైయున్న దైవప్రేమయందు ఏక్షణమున మానవునకు ప్రబోధము కలుగునో, అపుడే, తనహృదయ మింతకాలము దేనికై స్పృహించుచుండెనో వానికి తెలియనగును. అదియే

జీవునియొక్క తీవ్రేచ్ఛకు (ఉత్కంఠకు) ప్రారంభము, అది చేతనయొక్క ప్రబోధమును దైవసమాగమమునకై యతిస్పృహను దెచ్చును. అవిద్యకు సంబంధించిన సకల రూపములును, అది యుంచిన వైకల్యములును ఆ నిము సము మొదలుకొనియే వాడిపోయి లేకుండ పోవలెను; మఱియు నవి దైవార్థమైన ప్రేమచేత దైవప్రేమకు ప్రత్యుత్తర మిచ్చుచున్న సృష్టియొక్క యనన్యగతికి స్థల మియ్యవలయును. ఒకమాఱు ఈ సృష్టి, దైవార్థమైన ప్రేమకు వికసితమై మేలుకొని ఎఱుకబొందునేని, దైవ ప్రేమ సృష్టియెడ తన్ను మేరలేక వర్షించును. ఈ ప్రవృత్తి యొక్క వృత్తము (చక్రాకారము వంటిది) తన్ను చుట్టి తిరుగును, అపుడు రెండుకొనలును కలియును; పరమ చేతన (పురుషుడు), ఆవిష్కరించు జడము—రెండు పరకోటులును (పరమావధులును) కూడిపోవును, కావున వాని దివ్యసమాగమము అవిరతముగను పూర్ణముగను అగును.

దైవప్రేమయొక్క పరమపావనతను, శక్తిని ఇచ్చుట దెచ్చుటకు మహాపురుషు లీలోకమున జనించి

యున్నాయి. దైవప్రేమ భూమియందు చాల సులభము గను, చాల పూర్ణముగను సాక్షాత్కృతముగా నగునని, అది (మానవ) వ్యక్తిరూపమున తన్ను నివేశించికొనెను. ఒకవ్యక్తియందు దైవప్రేమ అభివ్యక్త మగునపుడు దాని యుపలబ్ధి సులభతరము; అది తనగతియందు అస్పష్ట ముగను అపౌరుషేయముగను ఉన్నపుడు(దానియుపలబ్ధి) చాల కష్టము. ఒకమనిషి (అటువంటి) వ్యక్తియొక్క తీవ్రతతో తత్స్పర్శముచేత దైవప్రేమ విషయకమైన ప్రజ్ఞయందు ప్రబోధితు డగునేని, వాడు తనకార్యము తనమార్పును సులభ మగునని కనుగొనును; ఏ కలియికకై వాడు ప్రయాసపడుచున్నాడో అది స్వాభావికముగను అత్యంతసమీపముగను అగును. మఱియు నాసమా గమము, ఆ సాక్షాత్కారము వానికి చాల పూర్ణముగ, పరిపక్వముగను అగును. ఏలన, విశ్వగతమై అపౌరుషేయ మైన ప్రేమయొక్క విశాలమైన యేకరూపత దైవముతో శక్యమైన సకలసంబంధముల సౌన్దర్యరాగములచేత నుజ్జీవితమును జ్వలితమును గానగును.

# పదియవ ప్రకరణము

"సమయము (ధర్మము, మతము) యొక్క యథార్థస్వరూప మేమి? అది యధ్యాత్మజీవితమార్గమునకు విఘ్న మగునా?"

మానుష్యకముయొక్క ఉన్నతతర మనస్సుకు సంబంధించినది సమయము. ఇది మానవబుద్ధి (ఉన్నత మనస్సు) త న్నతిక్రమించియున్న యొకదానిని బొందుటకు తన శక్త్యనుసారముగ బడు పరిశ్రమ; ఈ అతీతమైనదానికి ఈశ్వరుడు లేక చైతన్యము, సత్యము, శ్రద్ధ, జ్ఞానము, ఆనందము, లేక, నిర్ద్వంద్వమైన కూటస్థము అని మానుష్యకము పేరిడియున్నది; దీనిని మానవమనస్సు అందజాలదు, కాని అందుటకు బూనుచున్నది. మొట్ట మొదట సమయమున కుత్పత్తిస్థానము దివ్యము (దైవ సంబంధి)గనే యుండవచ్చును; కాని యాచరణస్వరూప మునందు మానుషమే గాని అది దివ్యము కాదు. నిజముగ మనము సమయము లని చెప్పవలయునే గాని

సమయము అని చెప్పరాదు; ఏలన, మనిషి కల్పించియున్న సమయము లనేకములు. ఈ వివిధ సమయములకు సమాన జన్మస్థానము లేనప్పుడు కూడ, వీనిలో నత్యధికములు సమానరీతిగనే చేయబడినవి. క్రైస్తవ సమయము పుట్టినవిధము మనకు తెలియును. క్రైస్తవసమయము అని మనము దేనిని తెలిసికొందుమో, దానిని నిజముగ, జేసువు కల్పించలేదు, మఱి కొందఱు పండితులు, నేర్పరులు, కలసి తమతలల నొకవిషయమందు ప్రయోగించి, మనమిపుడు చూచుదానిని (క్రైస్తవమును) నిర్మించిరి. వీరు ఏర్పఱచిన విధమున దానియందు దివ్యత్వమేదియు లేదు, మఱి తదనుష్ఠాన రీతియందును దివ్యత్వ మేదియును గనబడదు. అయినను, ఆ (సమయ) నిర్మాణమునకు సందర్భమో, వ్యాజమో, నిస్సంశయముగ మనము దైవపురుషు డనదగు నొకరివద్దనుండి వచ్చిన శ్రుతిప్రకాశమే; అతడు ఎచ్చటనుండియో ఒకపైకక్ష్యనుండి యొక జ్ఞానవిశేషమును, సత్యమును భూమికి దీసికొనివచ్చెను. అతడు వచ్చెను, తన సత్యమునకై బాధపడెను. కాని అల్పసంఖ్యాకులే అతడు చెప్పిన

దాని నెఱిగిరి ; అతడే సత్యమునకై దుఃఖ మనుభవించెనో దానిని కనిపెట్టి యుంచుకొనుటకు కొందఱే లక్ష్య పెట్టిరి ; బుద్ధుడు జగత్తునుండి నివృత్తుండై, ధ్యానమున నాసీనుడై భూమియందలి తాపపీడలనుండియు రోగ మృత్యువుల నుండియు కామనా పాప క్షుద్బాధల నుండియు దప్పించుకొనుటకు మార్గముం గన్పట్టెను. అతడొక సత్యమును దర్శించెను ; దానిని వెలిపఱచి, చుట్టు నుండిన తన యనుసారులకును శిష్యులకును దెలిపించ నుద్యమించెను. కాని అతని మరణమునకు పూర్వమే, అతనిబోధన వ్యావర్తితమై వికృతిం బొందెను. అతడు పోయినతర్వాతనే, బౌద్ధము నిండుగ లెక్కలుగల నొక సమయమై తలయెత్తెను; బుద్ధుడు చెప్పినది యిది, చెప్పిన దానియొక్క హృదయ మిది, యని అనుకొనబడు విషయముల యాధారముపై అది స్థాపన మొందెను. కాని, అతని శిష్యప్రశిష్యులు, తమ యాచార్యుడు చెప్పిన విషయమును గుఱించి అందు ఆచార్యుని భావమును గుఱించియు ఐకమత్యముగల్గని వారైరి, కావున శీఘ్రముగనే, మాతృస్థానమున నున్న మూలసమయమునందు

వివిధపక్షములును, ఉపపక్షములును దక్షిణపన్థ, ఉత్తరపన్థ, (హీనయానము, మహాయానము) అత్యంత ప్రాచ్యపన్థ— మొదలైనవి బయలుదేరి ఒక్కొక్కటియు తనదే మూల సమయము, అకళంకితమైన బుద్ధుని ఆమ్నాయము నని ప్రతిపాదించనారెను. క్రీస్తువుయొక్క బోధనకుగూడ అదే గతి గలిగెను. అదియు ఇదేవిధమున వ్యవస్థబొందిన నొకసమయ మయ్యె. తలుచుగ నిట్లు చెప్పుట కలదు: క్రీస్తువు తిరిగివచ్చెనేని, అతని బోధనలయం దారోపిత మయిన రూపముల జూచి (తన సమయమును) తానే గుఱు తెలుగలేని వాడగును; బుద్ధుడు మరలవచ్చునేని, తన బోధనను ఏమిచేసియున్నారో దానింజూచి అధైర్యపడి తోడనే నిర్వాణమునకు పాఱిపోవును! సకల సమయ ములలోను ఒక్కొక్కటియు ఈవిధమైన కథనే చెప్పును. ఒక గొప్ప జగద్గురువు వచ్చుటయే అది (సమయము) పుట్టుటకు సందర్భము. అతడు, ఒక దివ్యసత్యముయొక్క యవతారము, (ఒకదివ్యసత్యము శరీరమును స్వీకరించుట), ఇచ్చట వచ్చి, దానిని (ఆసత్యమును) ప్రకాశపఱచును. కాని మనుజులు దానిని పట్టుకొని, వాణిజ్యమునకు

సాధనముం గావించి, దానిచేత ప్రాయికముగ రాజకీయ వ్యవస్థాపనవంటి ఏర్పాటును ఒనర్చెదరు. వారు ఆసమయ మునకు సామగ్రిగ వీనినంత సమర్చియున్నారు. ఒక పరిపాలనపద్ధతి, నీతి, విధులు, మతములు, సిద్ధాంత తత్త్వములు, చట్టములు, నియమములు, కర్మలు, సంప్ర దాయమర్యాదలు— ఇవి యన్నియు అనుల్లంఘనీయ ములు, అనుత్తమములు తదనుసారు లందఱును వీనికి కట్టుబడవలసినదే. రాజ్యాంగము ఎట్లో, ఇది (సమయము) కూడ అట్లే అనురక్తులను సమ్మానించును, ద్రోహులను అపథమున బోవువారలను పాషండులను పతితులను దండించును.

బాహ్యావ్యవస్థబొంది నెలకొనియున్న యీ సమయ ములయొక్క ముఖ్యమైన మొదటి ధర్మసూత్ర మెప్పుడు నిట్లుండును. "నాదే ఉత్కృష్టము, నాది ఒక్కటియే సత్యము, అన్యమైన సర్వమును అసత్యము లేక నికృష్టము" అని. మూలభూతమైన యీ మతవిధి లేకుండపోయిన, ప్రతిష్ఠితములైన సిద్ధాంతములు గల సమయము లుండి యుండవు. ఏకము లేదా అత్యుత్కృష్టము నగు సత్యము

నీకు ప్రాప్తమైనదని విశ్వసించి ఘోషించక పోయిన యెడల, జనులకు బోధపఱచి వారిని నీకడకు ప్రోగు చేయుట నీకు శక్యముకాదు.

సామయికమనస్సు కిటువంటి భావము స్వాభావికము; కాని అధ్యాత్మజీవితమునకు నడ్డముగ నిలుచునదియు నదియే. ఒకసమయముయొక్క ధర్మసూత్రములు, సిద్ధాంతమతములును మనఃకల్పితము లైనవి; నీవు వానియందు సక్తుడవై నీకు గాను విహితమైన (జీవితపద్ధతి నాదేశించు) ధర్మశాస్త్రములోనే నణగియుండినయెడల, సకల ధర్మశాస్త్రములకును సిద్ధాంతములకును అతీతమై విస్తీర్ణముగ గొప్పదిగ బంధశూన్యమైయున్న చైతన్యముయొక్క సత్యమును నీ వెఱుగవు, ఎఱుగజాలవు. ఒక సామయికమతమునందు నిలిచి, దానియందు కట్టుబడి జగమున నది యొక్కటియే సత్యమని యుందువేని, నీయంతరాత్మ వైశాల్యము బొందుటను అభివృద్ధిని బొందుటను నీవు నిలిపెదవు. కాని మఱియొక దృష్టితో (మూలనుండి) నీవు సమయమును జూచుదువేని, అది మానవులకందఱకును ఎల్లప్పుడును విఘ్నముగ నుండవలె

నని లేదు. అది మానుష్యకముయొక్క అత్యున్నత ప్రవర్తనలయం దొకటి యని నీవు దానిం జూతువేని, మానవకల్పితములయందలి లోపములను మనస్సున నుంచుకొని, నీ వది (సమయము) మానవుని ఉత్కాంక్షల ఫలిత మని చూచుదువేని, ఆధ్యాత్మజీవితమును సమీపించుట కది ఒకవిధమైన యుపకారిగ నుండనగును. గాఢాభిలాషతో గాంభీర్యముతోను దాని నవలంబింతు వేని, అందు ఏ సత్యమున్నది, ఏ ఉత్కాంక్ష దానిలో దాగియున్నది, ఏ దివ్యావేశము మానవమనస్సు చేతను మానవనిర్మాణము చేతను ఇచ్చుట మార్పొంది వైకల్యముం బొందిన దని నీ వెఱుగ యత్నించవచ్చును; మఱియు నుచితమైన మనఃస్థితితో నీవు, నీ మార్గమునందు ప్రకాశముం జూపుటకును నీ యాధ్యాత్మిక పరిశ్రమకు కొంత నాదరమిచ్చుటకును సమయము నుపయోగించుకొన వచ్చును.

సకల సమయములయందును, భావభరితమైన ఉల్లముగలవారలను, వాస్తవమైన తీవ్రోత్కాంక్ష గల్గి యున్నవారలను కొందఱను మనము చూచెదము;

కాని, వారు సామాన్య మనస్సుగలవారై జ్ఞానమూల మున దైవమును సమీపించవలసినది అవశ్యమని చూడరు. అట్టి స్వభావములకు సమయ ముపయోగ పడును, అవశ్యముకూడ. ఆలయమున జరుపు సాంప్ర దాయిక కర్మలవంటి బాహ్యరూపములద్వారమున నది వారి ఆంతరమైన యాధ్యాత్మికోత్కాంక్షకు ఒకొకవిధ మైన యాదరమిచ్చి సాయపడును. ఒక్కొక్కసమయ మందును ఉత్కృష్టమైన యధ్యాత్మజీవితమును వృద్ధి పఱచు కొన్నవారు కొందఱు కలరు. కాని వారికి అధ్యాత్మభావము నొసంగినది ఆ సమయము కాదు; వారే ఆసమయమునందు తమ అధ్యాత్మభావము నుంచిరి. వా రెచ్చటనుండినను, ఏమతమునందు బుట్టినను, అదే అధ్యాత్మజీవితమును కనుగొని యాచరించియుందురు. వారిని అట్లు గావించునది వారి స్వీయసామర్థ్యము, అంతరపురుషుని శక్తివిశేషమే కాని వారు అనుసరించు సమయము కాదు. సమయ మొకబంధముగను దాస్యము గను గాకున్నది వారి స్వభావమందలి యీ శక్తి వల్లనే. వారి మనుస్సు దృఢముగను, ప్రసన్నముగను,

చులకనగను లేనందున, ఈ మతమునో ఆ మతమునో సంపూర్ణమైన సత్యమని విశ్వసించి, బాధించు సంశయ వితర్కములు లేకుండ తమలను బొత్తిగ దాని కర్పించుకొనవలసి యున్నది. ఇటువంటి జనులను సర్వసమయముల యందును, నే జూచియున్నాను, వారి శ్రద్ధను బాధించుట ఒకదోషమే యగును. వారలకు సమయము విఘ్నకరము కాదు. ఇంకను పైకి పోగలవారలకు విఘ్నముగ నున్నది, పోరానివారలకు, (అనగా) చైతన్యముయొక్క మార్గములయందు కొంతదూరము ప్రయాణించ వీలు పడువారలకు, ఉపకారిగ నుండును. అతినికృష్టమైన విషయములకును అత్యుత్కృష్టవిషయములకును సమయము ఒక ప్రేరకముగ నుండియున్నది. సమయముపేర నతిఘోరములయిన యుద్ధములు జరిగియుండినను, బీభత్సమైన యుపద్రవము లాచరితములై యుండినను, అది స్వకార్యమునకై అత్యుత్తమ వీరత్వమును ఆత్మత్యాగమును ఉద్దీపించి యున్నది. తత్వశాస్త్రముతో సమయముకూడ మానవమానసము పొందియున్న యున్నతపరిశ్రమల మేరను గుర్తించును. దానియొక్క బాహ్యాంగమునకు

నీవు దాసుడ వగుదువేని, అది యొక యాటంకము, ఒక సంకెల; నీకు దాని యంతస్సత్త్వము నుపయోగించు కొన దెలియునేని, చైతన్య లోకమున (బ్రవేశించి) కాలుపెట్టి యెగురుట కనుకూలమైన పలకవలె నది యుండనగును.

ఒకసమయవిశేషమున శ్రద్ధకలవాడు కాని, ఒక సత్యమును గనిపట్టిన వాడుకాని, తానే సత్యము సమస్త మును బొత్తిగ కనిపట్టినట్లు ఎంచుటకు ఆసక్తుడగును. ఇది మానవస్వభావము. మనుజులు దృఢముగ నిలిచి తమ మార్గమున బోవుటకు సత్యాసత్యములు మిశ్రితములు కావలెను కాబోలు. సత్యముయొక్క దర్శనము వారి తటాలున లభించునేని, తద్భారమున ధ్వంసమొందుదురు.

ఒక్కొక్కమాఱు దైవసత్యము దైవశక్తియు భూలోకమున వెలువడవచ్చునప్పుడు, భూమియొక్క వా తావరణమున నొకింత మార్పుకలుగుచున్నది. ఈ యవతర ణమునందు (దిగునప్పుడు), ఎవరికి గ్రహించుశక్తి కలదో, వారు ప్రబుద్ధులై దానినుండి ఒక ఆవేశమును, ఒకస్పర్శ మును, దృష్టియొక్క ఒక యారంభమును బొందుదురు. వారు గ్రహించుదాని నుంచుకొని చక్కగా వెలిపఱచ

సమర్థులుగ నుందురేని, "ఒక మహాశక్తి అవతరించి యున్నది; దానితో నాకు సంపర్కమున్నది. దానింగుఱించి నే నెఱిగినదానిని మీకు జెప్పెద"అని యందురు. కాని అనేకులకు ఆ సామర్థ్యము లేదు, ఏలన వారిమనస్సులు అల్పములు. వారు ప్రకాశముం బొంది ఆవిష్టులవలె "దైవ సత్యము నావద్ద నున్నది; అది సమస్తమును బొత్తిగ నా వశమున నున్నది" అని అఱచెదరు. ఇపుడు భూమియం దధమపక్షమున రెండు "డజను" క్రీస్తువులు కలరు,—అట్లనేకబుద్ధులు లేకపోయినను—హిందూదేశ మొక్కటియే యెన్నో అవతారముల నొసగును, చిన్న ఆవిర్భావముల గుఱించి చెప్ప నక్కఱలేదు. ఈ విధమున సర్వమును (అసంగతము) పరిహాసాస్పద మగుచున్నది. కాని, వెనుక ఏదియున్నదో దానిని జూచినయెడల మొట్టమొదట చూపుకు గనబడునట్లు అంత వహాధ్యము కాదని గోచరమగును. సత్య మేమన, మానుషవ్యక్తికి ఒకసత్త్వముతోనో ఒకశక్తితోనో సంబంధము గల్గినపుడు, అది తనకు గల విద్యాసంస్కారవశమున, ఐతిహ్యమువల్లను క్రీస్తువనియు బుద్ధుడనియు, ఇంక తనకు పరిచితమైన పేర

దానిని పిలుచును. సంబంధము గలిగినది నిజముగ క్రీస్తు వుతోనా, బుద్ధునితోనా యని చెప్పుట చాల కష్టము, కాని క్రీస్తువునకు గాని బుద్ధునకు గాని ఎచ్చటనుండి ఆవేశము వచ్చెనో అచ్చటనుండియే (ఈ మనుజవ్యక్తికి గూడ) ఆవేశము రాలేదని యెవరును జెప్పలేరు. అటువంటి మూలస్థానమునుండియే యీ మానవపాత్రలు ఆవేశమును గ్రహించియుండవచ్చును. వారు వినయముతో సరళముగ నుండువారేని, పైగ దేనినిం జెప్పక అంతటితో విరమించి తృప్తిబొందుదురు; "ఈ మహాంతుని వద్దనుంచి నే నీ యావేశముం బొందితిని" అని చెప్పుదురు. అట్లుగాక దానికి బదులుగ "నేను ఆ మహాంతుడ" నని ఘోషింతురు. నే నొకనిని యెఱుగుదును, అతడు తాను క్రీస్తువు బుద్ధుడు ఇద్దఱును అని దృఢముగ జెప్పుకొనెను. అత డొకింత గ్రహించియుండెను, ఒకసత్యమును అనుభవించి, దైవసాన్నిధ్యమును తనయందును ఇతరులయందును జూచియుండెను. ఆ అనుభవము అత్యధిక శక్తి కలదిగను,ఆ సత్యము అత్యంతము గొప్పదిగ నుండినందున, అతడు భరించలేడు. అతడు సగముపిచ్చివాడై మఱునాడే

వీథులకు వెళ్లి క్రీస్తుపును బుద్ధుడును తనయెడ ఒక్కరై పోయిరని యుద్ఘోషించుచు పోయెను.

ఒకటే దైవచైతన్య మీ సకలసత్త్వముల (జీవ రాశుల) మూలమున వ్యాపరించుచు, ఈ సకలావిష్కృతుల ద్వారమున తన మార్గమును తయారుచేయుచున్నది. నేడది యిచ్చట భూమియం దింతకుమును పెప్పుడును చేసినదానికంటె చాల శక్తిమత్తరముగ కార్యమొనర్చుచున్నది. దాని స్పర్శమును ఒకవిధమున ఒకకొలది గ్రహించువారు కొందఱు కలరు; కాని వారు తాము గ్రహించు దానిని వికృతముం గావించి దానికి తమ సొంతరూపము నొసంగెదరు. కొందఱు ఆ స్పర్శము ననుభవింతురు, కాని శక్తిని భరించలేక తద్భారాక్రాంతులై పిచ్చివా రగుదురు. అయినను, కొందఱకు గ్రహణసామర్థ్యము, ధారణశక్తియు గలవు; వారే పూర్ణజ్ఞానమునకు పాత్రలు, వరించబడిన ఉపకరణములు, అధికారికులు (క్రియాకారులు).

నీవు ఏసమయమునందు బుట్టితివో, లేక, పెరిగితివో, దాని నిజమైన మదింపును వివేచనజేసి యెఱుగగోరుము

వేని, లేదా, నీవు జన్మచేత నే సంఘమునకు లేక యే దేశ మునకు జేరినవాడవో దానిం గుఱించిన సరియైన దృష్టి నీకు కావలెనేని, నీవు యాదృచ్ఛికముగ నే ప్రదేశవిశే షమునందు నిర్బంధమువల్ల వసించుట సంభవించెనో, ఆ ప్రదేశము ఎంత అన్యసాపేక్షముగ (ఇతరదేశముల నపే క్షించినది) నున్నదని తెలిసికొనవలయునేని, ఒకమాఱు నీవు భూమిని జుట్టివచ్చిన జాలును; నీవు దేనిని మంచిది అని యనుకొందువో అది యితరస్థలములయందు చెడ్డదిగ భావించబడును, ఒకస్థలమున చెడ్డది అని భావించబడు నది మఱియొకస్థలమున మంచిది అని స్వాగతముం బొందు చున్నది. సకలదేశములును సకలసమయములును ఐతిహ్య సంఘాతములనుండి నిర్మితము లగుచున్నవి. వాని నన్నిం టియందును సన్యాసులను, వీరులను, మహాపురుషులను, శక్తిమంతులను, అశ్లే అల్పులను దుర్జనులను గూడ నీవు చూడవచ్చును. అపుడు నీవు "నేను ఈ సమయమున బర గితిని, కావున నిదియె సత్యమైన సమయము; నేను ఈ దేశ మున బుట్టితిని, అందువలన నది సకలదేశములలో నుత్కృ ష్టము"అని చెప్పుట ఎంత ఉపహాసనీయమని చూడనగును.

(అట్లయిన) ఒకడు తనకుటుంబవిషయమునగూడ నిట్లు ప్రతిపాదించవచ్చును. "ఇదే స్థలమున పలుసంవత్సరములు పలుశతాబ్దములు వసించివచ్చిన యీ కుటుంబపువాడను నేను, కాబట్టి దాని ఐతిహ్యములు నన్ను బంధపఱచును; అవియే ఆదర్శము" అని.

వస్తువులకు సహజమైన (అంతరంగమైన) మదింపు ఒకటి కలదు; నీవు వానిని స్వతంత్రముగ వరించి పొందుదువేని, అవి నీకు యథార్థమగును, కాని నీపై అవి నిర్బంధముగ వేయబడినపుడు (అట్లు యథార్థము) కావు. నీ సమయమునుగుఱించి నీవు దృఢముగ నుండవలెనేని, నీవే దానిని వరించుకొనవలయును; నీ దేశమునుగుఱించి దృఢముగ నుండవలెనేని, నీవే దానిని వరించుకొనవలయును; నీ కుటుంబమునుగుఱించి దృఢముగ నుండవలెనేని, దానింగూడ నీవే వరించుకొనవలెను. యదృచ్ఛగ నీకు వచ్చి ఘటించినదానిని ప్రశ్నించక ఒప్పుకొందువేని, అది నీకు మంచిదో చెడ్డదో నీ జీవితమునకు యథార్థమైనదో నీకు దృఢముగ తెలియకపోవును. స్వభావముగనే నీకు ఘటించిన చుట్టుప్రక్కలను వంశపరంపరగ

ప్రాప్తమైనదానిని వర్జించి నివృత్తుడ వగుము; అవి ప్రకృతి యొక్క అంధమైన యంత్రప్రాయపు విధానముచేత జేయబడి నీపై త్రోయబడినవి. అంతర్ముఖుడవై శాంతముగ రాగభావములు లేకుండ విషయములను గమనించుము. వానిని వివేచనతో నెఱిగి, స్వేచ్ఛతో వరించుము. అపుడు నీవు అంతరంగ సత్యము నెఱిగి యిట్లు చెప్పుటకు వీలుపడును, "ఇదియే నాకుటుంబము, ఇదియే నా దేశము. ఇదియే నాసమయము" అని. మనలోపలనే మనము కొంతదూరము పోవుదుమేని, మనలో ప్రతివానియందును యుగయుగములుగ జీవించుచు బహుళాకృతులయందు స్పష్టమగుచు నొకప్రజ్ఞ కలదని మనము కనుగొనవచ్చును. మనము ఒక్కొక్కఱము అనేకములైన వేలువేలు దేశములయందు బుట్టి, వేలువేలు పలుజాతీయులైయుండి, వేలువేలు పలుసమయములను అనుసరించియున్నాము. కడపటి దానినే శ్రేష్ఠమని మనమేల అంగీకరించవలెను ? ఈ అన్నిజన్మములయందు దేశములయందును సమయములయందును మనము సంపాదించిన యనుభవములు మనలో సకలజన్మములయందును స్థిర

ముగ గూడ వచ్చుచున్న అవిచ్ఛిన్నమైన యంతఃప్రజ్ఞలో నిహితములై యున్నవి. అచ్చట పూర్వానుభవముల చేత సృష్టమైన వ్యక్తిమూర్తు లనేకములు కలవు. మనలోనే ఆ వ్యక్తిమూర్తిసముదాయమును మన మెఱుగ గల్గు నపుడు, సత్యముయొక్క ఒకరూపవిశేషమునే సత్య మనియు, ఒకదేశమే మనదేశమనియు, ఒకసమయమే సత్యమైన సమయమనియు చెప్పుట అశక్యమగును. ఒక దేశమున బుట్టినవారు కొందఱు గలరు, అయినను వారి చేతనయందలి ముఖ్యాంశములు స్పష్టముగ నితరదేశము నకు సంబంధించినవి. "యూరోపు"నందు జనించినవారిని, స్పష్టముగ ఇండియనులను, నేను చూచియున్నాను. స్పష్టముగ యూరోపియనులను "ఇండియన్" శరీరముల బుట్టియున్నవారలను జూచి యున్నాను. జపానుదేశ మందు కొందఱను "ఇండియ"నులను, మఱికొందఱను యూరోపియనులను జూచియున్నాను. వీరిలో నెవడైన తనకు పూర్వసంబంధముగల దేశమునుగాని నాగరికతను గాని ప్రవేశించినచో, అచ్చట తన్ను సంపూర్ణముగ స్వస్థునిగ నెఱుగును.

చైతన్యముయొక్క బంధశూన్యతయందు స్వతంత్రుడవై యుండుట నీకు లక్ష్యమగునేని, నీ సత్తయొక్క అంతరంగసత్యమునకు సంబంధించనివియు, మగ్న చేతనపు వాడుకలుగనున్న సర్వబంధములను నీవు నివారించవలయును. నీవు పూర్ణముగను ననన్యముగను దైవమునెడ బొత్తిగ నిన్ను నివేదన మొనర్చ గోరుదువేని, దానిని కొఱత లేకుండ సర్వసమగ్రముగ జేయవలెను. నీయొక్క కొన్ని భాగములు ఖండఖండములుగ నిక్కడ నక్కడను బంధపడునట్లు వానిని విడువగూడదు. సహజముగనే కలిగియున్న బంధములను బొత్తిగ ఛేదించుట సులభము కాదని నీ వాక్షేపించవచ్చును. కాని, కొన్నిసంవత్సరములలో నీయం దెన్నిమార్పులు గల్గియున్నవని యెప్పుడైనను వెనుక జూచి యుండలేవా? నీ వట్లు చేయునపుడు, ఎట్లు నీవు కొన్నిసందర్భములయందు (సుఖదుఃఖాదుల) ఎఱిగిన విధమున నెఱుగగల్గితివి, నీవు ఆచరించిన విధమున నాచరించగల్గితివని నీవు నిన్నే (ఆశ్చర్యముతో) ప్రశ్నించుకొందువు. కొన్నివేళలయందు పదిసంవత్సరముల క్రింద నీ వేమనిషిగ నుంటివో వాడే నీ విపుడని

గుర్తెఱుగజాలవు. అట్లుండ, ఎది ఉండిపోయినదో, లేదా, ఎది ఉన్నదో, దానికి నీవెట్లు కట్టుబడవచ్చును ? లేక, భావియందు ఏది యగునో ఏదికాదో దానిని పూర్వమే నీ వెట్లు నిశ్చయించదగును ?

నీవు లోపలి స్వాతంత్ర్యముతో నీ యభిమతము నెఱిగి దానిపై నీ సకల సంబంధములను నిర్మించుకొనవలయును. నీవు ఏ ఐతిహ్యాసంప్రదాయములమధ్య వసించుచు పెరిగియున్నావో, అవి చుట్టుప్రక్కల భారముచేతను మన స్సామాన్యము (సమష్టి) చేతను ఇతరుల యభిమతము చేతను నీపై నిర్బంధముగ నుంచబడియున్నవి. వానిని నీ వంగీకరించుటయందు ఒకనిర్బంధాంశము కలదు. సమయమే మానవులపై నిర్బంధముగ నుంచబడినది. తఱుచుగ నది సమయసంబంధముగల భీతిసూచనచేత లేక ఆధ్యాత్మికమయిన నింక నేదైన భర్త్సన (బెదరింపు) చేత ఆదృత మగుచున్నది. దైవముతో నీసంబంధమునం దటువంటి నిర్బంధ ముండగూడదు; అది స్వతంత్రముగ, నీ మనోభిమతముగ, నీహృదయాభిమతముగ, సంతోషోత్సాహములతో స్వీకృతమైనదిగ నుండవలయును. ఒకడు

"నేను నిర్బంధమున నున్నాను, వేఱెట్లును చేయలేను" అని వణకుచు చెప్పనగునేని ఎటువంటి ఐక్యమది? సత్యము స్వతఃస్పష్టము, దానిని లోకముపై నిర్బంధ పఱచరాదు. మానవులు తన్ను ఒప్పుకొనవలెనని ఆవశ్యకత దాని కేమియు లేదు. ఏలన నది స్వతఃసత్త గలది; దానినింగుఱించి జనులు చెప్పుమాటలచేతను, దానిని వా రనుసరించుట చేతను, అది జీవించియుండలేదు. కాని ఒక సమయమును స్థాపించువానికి అనేకులు అనుసారు లుండి కావలెను. మనుజులు ఒకసమయముయొక్క బలమును మహత్త్వ మును, అవి అక్కడ లేకున్నను, తదనుసారుల సంఖ్యల నుండి నిర్ణయించెదరు. ఆధ్యాత్మిక సత్యముయొక్క మహ త్త్వము (అనుసారుల) సంఖ్యయందు లేదు. ఒక నవీన సమయమునకు అధిపతి నొకనిని నేను ఎఱుగుదును. అతడు ఆ సమయస్థాపకుని కుమారుడు. ఏదో ఒకసమయము నిర్మిత మగుటకు పలుశతాబ్దములయిన వనియు, మఱియొక సమయ మేదియో నిర్మాణ మగుటకు అనేకశతాబ్దములు పట్టిన వనియు ఏబదిసంవత్సరముల లోపలనే తమకు నలువది లక్షల యనుసారు లున్నారనియు నాత డొక సమయమున

చెప్ప నేను వింటిని. "చూచితిరా, ఎంతగొప్పది మా సమయము?" అని యాతడు చెప్పెను. సమయములు తమ మహాత్త్వమును తద్విశ్వాసము గలవారి సంఖ్యనుబట్టి లెక్కించుకొనవచ్చును, కాని సత్యమునకు ఒక్క యనుసారి లేకపోయినను అది సత్యముగనే యుండును. సామాన్య మనిషి ఆడంబరము చేయువారియెడ నాకృష్టు డగును; సత్యము ఎచ్చట సందడిలేక విశదమగుచుండునో నచ్చట వెళ్లడు. పెద్ద ఆడంబరము చేయువారికి ప్రకటన జేయుటయు, బిగ్గఱగ ఘోషించుటయు అవశ్యము; లేనిచో ననేకసంఖ్యాకుల జనుల నాకర్షించరు. ఇతరు లేమి తలచెదరని లక్ష్యపెట్టక జరుగు కార్యము అంత సువిదితము కాదు, గుంపును సులభముగ నాకర్షించదు. కాని సత్యమునకు ప్రకటన యక్కఱలేదు; అది తన్ను దాచుకొనదు, ప్రకటించుకొనుటకును ఘోష వేయదు. అది (ఇతరుల) సమ్మతిని వెదకక, అసమ్మతిని నిరాకరించక లోకముయొక్క అంగీకారముచేత గాని నిరాకరణముచేత గాని ఆకృష్టము కాక, పీడితమును కాక, తాను స్పష్టమగుటతో నది తృప్తి బొందును.

నీవు యోగమునకై వచ్చునపుడు, నీ మానసకల్పనలు ప్రాణమయములైన మంచెలును ఖండఖండములుగ చెదరి పోనిచ్చుటకు తయారుగ నుండవలెను. నీశ్రద్ధ యొకటి దప్ప మఱి యే ఆధారములేకుండ నాకసమున నిరాలంబుడవుగ నుండుటకు నీవు సన్నద్ధుడవు కావలయును. నీవు నీయొక్క పూర్వవాసనను దాని నంటికొని యున్న సకలమును విస్మరించి నీప్రజ్ఞయందుండి తీసివేసి, ఏవిధబంధమును లేక నూతనముగ జనించవలయును. అతీతమును జింతించవలదు, భావియందు ఎట్లు కావలెనని ఉత్కాంక్షింతువో దానిం దలచుము; దేనిని సాక్షాత్కరించ గోరెదవో దానియందు పూర్ణముగ నుండుము. మృతమైన గతమునుండి తిరిగి, భావికేసి తిన్నగ జూడుము. నీయొక్క సమయము, దేశము, కుటుంబము, అంతయు నచ్చట కలదు; అది దైవము.

# పదునొకండవ ప్రకరణము

“ శారీరక రోగముల కన్నింటికిని మూలమైన ఉత్పత్తిస్థానము మనస్సుయొక్క వైషమ్యమునందే (క్రమభంగము) కని పెట్టనగునా? అట్లేని, ఎటువంటి మానసవైషమ్యము చెమటకాయ, గొంతునొప్పి యిటువంటి వ్యాధులను గల్గించును ?”

ఎందఱు జనులు రోగగ్రస్తు లగుదురో, అన్ని హేతువులు ఒకరోగమునకు గలవు. ఒక్కొక్క రోగమునకును హేతువివరణము వేఱుగ నుండును. “ఈ వ్యాధియో ఆవ్యాధియో నాకేల వచ్చిన” దని నీ వడుగుదు వేని దానికి హేతువును జూచి నేను చెప్పగలను, కాని ఒక సామాన్యవిధి లేదు.

శారీరకవ్యాధులు మనస్సునందలి క్రమభంగమువల్ల, విసంవాదము (వైషమ్యము)వల్ల, అయుక్తమైన ప్రవృత్తి వల్లనే ఎప్పుడును గల్గునవి కావు. రోగమునకు మూలము మానసమం దేదిగ నైన నుండవచ్చును, ప్రాణమం దేదిగ

నైన నుండవచ్చును, బాహ్యస్పర్శముచేత గలుగు వ్యాధులయందువలె, ఇంచుమించుగ భౌతికముగ నేదైన నుండవచ్చును. మఱియు, ఈ క్షోభము యోగమునందలి యొక గతివిశేషముయొక్క ఫలముగ నుండవచ్చును. అట్లయినను గూడ, సంభావ్యహేతువులు అనేకములు గలవు.

యోగమువల్ల రానగు రోగములను దీసికొందము, మనకు సాక్షాత్తుగను ఆత్యంతికముగను వానితోనే గదా ముఖ్యసంబంధము? ఇచ్చట ఒకరోగవిశేషమునకు ఒక హేతువును జెప్పుటకు వీలు గాకున్నను, ఆ వ్యాధులను ఉత్థాపించు హేతువుల స్వభావము ననుసరించి వానిని వివిధవర్గములుగ మనము వేఱుపఱచవచ్చును.

యోగము ననుష్ఠించువానికి వచ్చెడిదియు పరివర్తనమున కుపకారిగ నుండునదియు నగు శక్తి నానావిధ పద్ధతుల బనిచేయును, దాని ఫలితములు గూడ దానిం గ్రహించు స్వభావమును కర్తవ్యకార్యమును అనుసరించి నానావిధములుగ నుండును. మొట్టమొదట, (మనఃప్రాణ శరీరములతో గూడిన) పురుషునియందు పరివర్తనమునకు

తయారుగనున్న సర్వభాగములయొక్క పరివర్తనను త్వర పఱచును. వాడు ఉన్మీలితుడై మనస్సు గ్రహణసమర్థముగ నుండునేని, యోగశక్తి సంపర్కమువల్ల మనస్సు మాఱి వేగిరముగ పైకిబోవ దొడంగును. ప్రాణమయ ప్రజ్ఞయందుగూడ, నది తయారుగ నున్నయెడల, అంత వేగముతో మార్పుగల్గవచ్చును, దేహమందు గూడ (అట్లే కావచ్చును). కాని, దేహమందు యోగముయొక్క పరివర్తనశక్తి కొంతవఱకే కార్యకారిగ నుండును. ఏలన దేహమునకు గ్రహణసామర్థ్యము మితమైనది. ఈ విశ్వమందలి అత్యంత భౌతిక(జడ)మయిన కఠష్ట భూయిష్ఠమైన ప్రతిరోధములు గ్రహణసామర్థ్యమును మిశ్రితమైన ఒక స్థితియందున్నది. పురుషునియందు ఒకభాగముయొక్క శీఘ్రాభివృద్ధిని ఇతరభాగములును సమానాభివృద్ధితో ననుసరించకబోవునేని, స్వభావమునందు విసంవాదము (వైషమ్యము) కలుగును, ఎచ్చటనైన స్థానచ్యుతి (ఏ తావున నేది యుండవలెనో అట్లుగాక ఆ తావునుండి జారుట) కల్గును; కావున ఎచ్చటనైన నెప్పుడైన ఈ స్థానభ్రంశ మేర్పడునేని, అది వ్యాధిగ పరిణమించును. వ్యాధి

స్వరూపము స్థానచ్యుతి (స్థానభ్రంశము)యొక్క స్వరూపముపై నాధారపడియున్నది. ఒకవిధమైన విసంవాదము మనస్సును బాధించును, అది గల్గించు నాకులత ఉన్మాదమువఱకు గొనిపోవవచ్చును; మఱియొకవిధము శరీరమును బాధించును, జ్వరముగనో చెమటకాయగనో, మఱేదైన గొప్పవైషమ్యముగనో అల్పవైషమ్యముగనో వెలువడును.

ఒకప్రక్క, పురుషునియందు వ్యాపరించుశక్తికి ఏభాగములు ఉద్బుద్ధములై దానిని గ్రహించుటకు తయారుగనున్నవో, ఆభాగములయందు యోగశక్తుల వ్యాపారము వానికి పరివర్తన మొనర్చు ప్రవృత్తిని త్వరపఱచును. ఈరీతిగ, యోగముచేత కాలలాభము గల్గును. ప్రపంచమంతయు క్రమక్రమముగ నభివృద్ధి జెందు పరివర్తనవిధాన మందున్నది. నీవు యోగసాధనమును స్వీకరించినయెడల, ఈవిధానము నీయెడ త్వరితముగ జరుగును. సాధారణముగ బహువత్సరసాధ్యమైన యొక వ్యాపారము కొన్ని దినములలో, కొన్ని గడియలలో సాధ్యమగును. కాని, త్వరపఱచు ప్రచోదనకు లోబడి

విధేయముగ నున్నది నీ యంతఃప్రజ్ఞయే; ఏలన, నీ సత్త యందు ఉత్కృష్టతరమైన భాగములు యోగముయొక్క సత్వరమైన యేకాగ్రప్రవృత్తిని అనుసరించుచు, అనవరతము ఆవశ్యక మగుచున్న సమాధానమును, పొందిక యున్నట్లు కూడికను, సులభముగ ఘటించుకొనును. దేహమన్ననో సాధారణముగ ఘనముగ నిశ్చేష్టముగ ఉదాసీనముగ (నిఃస్పృహముగ)నుండును. నీకు ఈభాగమందు ఏదైన నుద్బోధము లేకుండు నేని, ఇచ్చట ప్రతిబంధముండు నేని, హేతు వేమనగా, దేహము తక్కినభాగములతో నంత వేగముగ బోవ నశక్తమైయున్నది. దానికి కాలము పట్టును, సామాన్య జీవితమందు తన సొంతనడకలో బోవునట్లే అది నడవవలెను. ఏ మగుచున్నదనగా, ప్రాయమైనపెద్దలు వేగముగ నడుచునపుడు వారితోనున్న బిడ్డ లంత వేగముగ నడవలేక వెనుక మెల్లగ నడచుదురు. పెద్దలు తమ్ము వెంబడించి వచ్చు బిడ్డ తమకడకువచ్చి చేరు వఱకు తా మాగి కాచుకొనియుందురు; అట్లే యిదియు గూడ. అంతస్సత్తయొక్క క్రమాభివృద్ధికిని జడమైన దేహమునకును గల విభిన్నత కాయవ్యూహమునందు వైషమ్య

మును (స్థానచ్యుతిని) గల్గించుచున్నది, అదియే ఒక రోగ
ముగ బయల్పడును. ఈ కారణమువల్లనే యోగమును
స్వీకరించువారు ప్రారంభమున అడుగడుగునకు శరీరమం
దసౌఖ్యమునో ఆకులతనో అనుభవింతురు. వారు అప్ర
మత్తులై సావధానముగ నుండినయెడల, ఇది సంభవించ
నక్కఱలేదు. లేదా, శరీరమందు అసాధారణమైన గొప్ప
గ్రహణసామర్థ్య మున్నచో, నప్పుడును తప్పించు
కొందురు. కాని దేహము యోగవిధానమునకై పూర్వ
మే తయారైనదిగా నుండినం దప్ప, శారీరకభాగములు
అంతరపరివర్తనమును నిరంతరముగ ననుసరించునట్లు చేయు
గ్రహణశక్తి అసంమిశ్రముగ నుండుట యసాధ్యము.

మనుజుని సామాన్యజీవితమందు క్రమక్రమముగ
స్థానచ్యుతి(వైషమ్యము) ఏర్పడుట విధి. మానవుని ప్రాణ
మయ మనోమయ సత్త్వములు బ్రహ్మాండశక్తులయొక్క
గతిని యథాశక్తి యనుసరించును. ప్రపంచముయొక్క
అంతరపరివర్తనపరిణామముల ప్రవాహము వానిని గొంత
దూరము కొనిపోవును; కాని, అత్యంత భౌతికప్రకృతి
ధర్మమునకు (నియతికి) గట్టుపడిన దేహము చాల మంద

ముగ కదలుచున్నది. కొన్ని సంవత్సరములకు పిదప, డెబ్బ దియో ఎనుబదియో, ఒక వందయో రెండువందలో__ ఇదియే పరమావధిగ నుండవచ్చును__ అయినపిదప వైషమ్యము (స్థానచ్యుతి) తీవ్రమై బాహ్యసత్త(దేహము) శిథిలమై పడిపోవును. అపేక్షితమునకును (ఎంత అవశ్య ముగ కావలయునో దానికిని), లబ్ధమునకును (దొరకునది ఎంతయో దానికిని) గల అంతరము (తారతమ్యము), క్రమక్రమముగ నేర్పడు దేహముయొక్క బలక్షయము, పొందుపాటులేమియు మరణసంభవమును సాధించు చున్నది. సృష్టియందు మందముగ అనవరతము జరుగు నంతరపరివర్తనమును యోగము ప్రబలముం గావించి త్వరపఱచును; కాని, బాహ్యపరివర్తనముయొక్క గతి వేగముమాత్రము, సాధారణ జీవితమందువలెనే నిలు చును. దేహము అంతరగతిని సాధ్యమైనంతవఱకు సమీ పించి యనుసరించుటకు పాయపడెడి యొక రక్షణమును బొంది పూర్వోపాయములం గైకొనిన దప్ప, అంత స్సత్త కును బాహ్యసత్తకును గల విసంవాదము (పొందికలేమి) ఇంకను ఎక్కువ యగుటయే దీని ఫలిత మగును. అప్పటి

కిని, నిన్ను వెనుదీయ జేయుటయే దేహముయొక్క సహజ ధర్మము. ఈ కారణముంబట్టియే మేము "లాగవలదు, త్వరపడవలదు; దేహము వెంబడించుటకై దానికి నీవు కాల మియ్యవలెను" అని పలువురకు జెప్పవలసియున్నది; (మేము) కొందఱను అధికముగ జేయనీయక చాల దూర మభివృద్ధి జెందనీయక సంవత్సరములుగ వెనుక నుంచవలసి యున్నది. కొన్ని వేళలలో ఈ వైషమ్యమును తప్పించుట యసాధ్య మగుచున్నది; అపుడు నీకు గలుగు కలత నీవు నిరోధించువిధము ననుసరించియు, నీ వెంత జాగ్రత్తతో, లేదా, అజాగ్రత్తతో నున్నావో దాని ననుసరించియు వివిధముగ నుండును. ఈ హేతువుంబట్టి యే ఒక్కొక్కమారును ఒక బలమైన యభివృద్ధి ప్రవర్తించునపుడు, తోడనే దానికి పిదప ఒకస్థావరత్వము (చలనము లేమి) తఱుచుగ తప్పక ఏర్పడుచున్నది; అది, ఎవరికి పూర్వమే ఎచ్చరిక జేయబడలేదో, వారికి అభివృద్ధి యంతయు నిలిచిపోయినట్లుగాను ఒక వంధ్యము గాను చలనములేమిగాను అధైర్యపఱచుటగాను దోచును. వారు ఔత్సుక్యముతో "విషయ మేమి? నా కాలమం

తయు వ్యర్థ మగుచున్నదా ? ఏదియు జరుగలేదే?" అని చింతిల్లుదురు. కాని సత్యమేమనగా, అది పరిపాకమయి సహజమగుటకు కావలసిన కాలము; శరీర మున్మీలితమై ఎక్కువగ గ్రహణసామర్థ్యమొంది లోపలి చేతన బొంది యున్న మట్టమును సమీపించుటకై, దానికి ఆ విరామ మేర్పడును. మాతా పితలు చాలదూరము ముందుగా నడుచుచున్నారు; వెనుకపడిన బిడ్డ పరుగెత్తి వారింజేరి చేతిం బట్టికొనుటకై వారు నిలువవలయును; అప్పుడే వారు చేరి ప్రయాణమునకై బయలుదేర నగును.

దేహమం దొక్కొక్క స్థలమును లోపల గలుగు గతివిశేషమును సూచించు సంకేతమై యున్నది; అచ్చట సూక్ష్మములైన సాదృశ్యసూచక సంబంధములు గలవు. కాని ఇది దీర్ఘము సంకీర్ణము నగు (చిక్కు) విషయము; తద్విస్తరమున కిపుడు దిగలేము. దేహమం దే స్థానవిశేషము రోగగ్రస్తమైనదో అది లోపల విసంవాదము (వైషమ్యము)యొక్క స్వభావమును సూచించును. అది రోగమూలమును జూపును, రోగహేతువున కది యొక చిహ్నము. ఆధారము సమస్తము (మనఃప్రాణశరీరము

లతోఁగూడిన పురుషుడు) ఒకే మాదిరి వేగముతో వృద్ధి బొందుటను ఏది ఆటంకపఱచు చున్నదో, ఆ నిరోధము యొక్క స్వరూపమును అది తెలుపును. వ్యాధిచికిత్సను తన్నివారణమును అది సూచించును. ఎచ్చట పొరబాటు అని ఒకడు పరిపూర్ణముగ నెఱుగ గలడేని, ఎయ్యది (ఏభాగము) గ్రహణశక్తిలేనిదై యుండియున్నదని కన్పట్టి ఆ భాగమును తెలిచి యందు శక్తిని ప్రకాశమును ఉంచగలడేని, బాధితమైన సంవాదమును (సామ్యమును) ఒకక్షణమున మరల స్థాపించుటకు వలనుపడును, వ్యాధియు తోడనే తొలగును.

రోగముయొక్క ఉత్పత్తిస్థానము మనస్సునం దుండవచ్చును; అది ప్రాణమం దుండవచ్చును, సత్త్వయం దేభాగమందైన నుండవచ్చును. ఒకే వ్యాధి నానావిధ హేతువులవల్ల రా నగును. వేలువేలు మనుజులయందు వేలువేలు వైషమ్య (విసంవాద) మూలములనుండి అది (వ్యాధి) కలుగవచ్చును. నిజముగ రోగములేకయే యుండుచోట రోగ మున్నట్లుకూడ తోచును. అట్లయిన, నీకు చాలినంత యెఱుకగలదేని, ఎచ్చటనో ఒకఘర్షణము

(ఒరయిక), ప్రవృత్తియందు ఒక విరామము, కలిగినదని నీవు చూడగలవు; దానిని సమకూర్చుటచేత నీవు తోడనే స్వస్థుడవు కాగలవు. ఈ విధమైన రోగమునకు శారీరకఫలితములు కల్గినట్లు తోచినను, అందు సత్య మేదియు లేదు. అది సగము భావనాకల్పితము, నిజమైన రోగమునకు జడము (దేహము)పై నుండెడి యదే పిడి పట్టు దానికి ఉండదు.

సంగ్రహముగ (జెప్పుదు మేని) రోగములకు మూల కారణములు అనేకములు, గహనములు; ఒక్కొక్కటికిని ఒక హేతుసముదాయ ముండును; కాని, అది సత్త యందు (పురుషునియందు) బలహీనభాగ మెచ్చట ఉన్నదో, దానిని ఎప్పుడును సూచించును.

శారీరకము (భౌతికము)గాని, మానసికముగాని, బాహ్యముగాని, ఆంతరముగాని, వ్యాధి హేతువు ఏదిగా నున్నను, అది దేహమును బాధించుటకు మునుపు పురుషుని చుట్టుకొని రక్షించుచున్న ఒక ఆస్తరమును స్పృశించ వలయును. ఈ సూక్ష్మతరమైన ఆస్తరమును (ఆకాశ దేహము) తేజోవహ దేహము, నాడీచక్రావరణము, అని

పలు పేర్ల పలుబోధనలయందు పిలుతురు. అది యొకసూక్ష్మ దేహము, అయినను ఇంచుమించుగ గోచరమగును. ఇది, మిగుల వేడిగ నావిరి వచ్చుచున్న ఒక వస్తువుంజుట్టి కన బడు స్పందముల (ఇంచుక కంపము)వలె నంత ఘనముగ నుండి, స్థూలదేహమునుండి బయటికి వచ్చి దానిని గప్పు కొనును. బాహ్య ప్రపంచముతో సర్వవ్యవహారములును మధ్యవర్తియగు దీని మూలముననే జరుగును. (ఏరోగ మైనను) దేహమును బాధించుటకు మునుపు మొదట దీనినే ఆక్రమించి దూరవలెను. ఈ ఆవరణము అత్యం తము దృఢముగను అబాధితముగను ఉండునేని, నీవు "ప్లేగు" "కాలరా" (అరిష్టజ్వర విషూచికాది) మొద లైన అతిదుష్టవ్యాధులు వ్యాపించియున్న ప్రదేశము లకు వెళ్లియు నిర్బాధుడవై రోగరహితుడవై యుండు టకు వీలుపడును. ఇది సమస్తమును నిండుగ, తన బంధము (నిర్మితి) నందు చక్కగ పొందికతోను, తనయంశములు లోపములేని సామ్యావస్థలో నుండువరకు, రా దగిన సకలరోగముల యాక్రమణముల నెట్టివేయుటకు సిద్ధమైన రక్షణము.

ఈ దేహము ఒకప్రక్క భౌతిక (శారీరక)మైన యాధారముపై నిర్మితమయి యున్నది. కాని, భౌతిక వస్తువు గాక భౌతికపరిస్థితులచేత (నిర్మితమై యున్నది); మఱియొకప్రక్క అంతఃకరణ దశావిశేషముల స్పందముల వల్ల (నిర్మితమై యున్నది). శాంతి, సమత, దృఢనమ్మకము, ఆరోగ్యమునందు శ్రద్ధ,కలతనొందని విశ్రాంతి,ఉల్లాసము, ఉజ్జ్వలమయిన సంతుష్టి—ఇవియే దానియందు (ఆ దేహమందు) ఘటితమైన అంతఃకరణాంశమై, దానికి బలమును సత్త్వమును ఒసగుచున్నవి. అనాయాసముగ త్వరితమైన ప్రతివ్యాపారములతో శీఘ్రవేదనముగల మధ్యవర్తి యిది(ఈదేహము). ఆటంకము లేక సకలవిధాభిప్రాయములను (సూచనలను) ఇది గ్రహించుకొనును; (కావున) అవి (ఆ యభిప్రాయములు) దీనిని వేగముగ మార్చి, దీనిస్థితికి ఇంచుమించుగ పునస్సంస్కార మొనర్చును. ఒక చెడ్డ సూచన దానిపై ప్రబలముగ బనిచేయును; ఒక మంచి సూచన అదే శక్తితో దానియందు విరుద్ధముగ వ్యాపార మొనర్చును. ఉత్సాహములేమి ధైర్యహానియు ప్రతికూలఫలము నిచ్చును; ఇవి దానియందు దాని ద్రవ్యము

నందు రంధ్రముల జేయునదివోలె, దుర్బలముగను ప్రతి ఘటించనిదిగను దానిం గావించి విపత్ప్రాక్రమణములకు సులభమగు ద్వారమును దెరచును.

మధ్యవర్తిగనున్న ఈ దేహముయొక్క వ్యాపారము, జనులయెడ తరుచుగ స్వయముగ నకారణముగ పరస్పరము ఆకర్షణము విరాగమును ఏల గలుగుచున్న వని ఒక విధముగ దెలుపును. ఈ ప్రతివ్యాపారములకు మొదటి పీఠము రక్షకమైన ఈ (నాడీచక్ర) ఆవరణము నందున్నది. ఈ ఆవరణమునకు క్రొత్తగ బలముం దెచ్చు జనులవద్ద మనకు సులభముగ ఆకర్షణము కలుగుట అనుభవ మగును; దానికి బాధపెట్టి కీడుజేయు వారలవద్ద జుగుప్స కల్గును. దానికి విరివియగు ననుభవమును సంతోషమును సుఖమును ఏది తెచ్చియిచ్చునో, ఏది దానిని సుఖసంతోషభావముతో ప్రతివ్యాపార మొనర్ప జేయునో, అది తోడనే మనపై నొక యాకర్షణమును బ్రయోగించును; ఫలితము (పై జెప్పనదానికి) విరుద్ధముగ నున్నప్పుడు, ఇది (ఈ ఆవరణదేహము) స్వరక్షణార్థమైన విసుగుపాటుతో నుత్తర మిచ్చును. ఈ (ఇటువంటి) వ్యవ

హార మిద్దఱు కలయునప్పుడు పరస్పరము తరుచుగ నుండును. సంబంధముల కిది ఒక్కటియే కారణముకాదు, నిజమే; అయినను తఱుచుగ నిది యొక కారణము.

పురుషునియొక్క సమస్తసత్తయు సమకాలమున విశ్వముయొక్క అంతర్గతిని తద్వేగముతో ననుసరించి క్రమక్రమముగ నగు రూపాంతరపరిణామమందు ముందుగ బోవ నగునేని, రోగములు ఉండవు, మరణమును ఉండదు. కాని పురుషుని సమస్తసత్తయు సమగ్రముగ నత్యున్నత కక్ష్యలు మొదలుకొని క్రింద నత్యంత జడ కక్ష్యవఱకు యథార్థముగ నట్లుండవలెను. (అనగా, విశ్వముయొక్క అంతర్గతిని అనుసరించునదై యుండవలెను); అది యున్నత కక్ష్యలయందు పరివర్తన శక్తులకు గావలసినంత లోబడి మిగుల నమ్యముగ నుండును, జడకక్ష్యయన్ననో స్వాభావికముగ వేగిరముగ సంస్కారమొనర్పు మార్పుకు (అణగక) వంకరగను స్తబ్ధముగను కఠినముగను ఉండును.

కొన్ని స్థలములు కలవు, అవి యితరస్థలములకంటె యోగశక్తివ్యాపారమునకు బలవత్తరముగ ప్రతిరోధ

మొనర్చును; (అటువంటి) వానిని నివారించుట కష్ట తరము. ఆ భాగము అత్యంత జడమయాస్తరములకు జేరి నవి; వానికి సంబంధించినవియే చర్మరోగములు, దంతరోగ ములు మొదలయినవి. ఒకప్పుడు శ్రీఅరవిందులు ఒక యోగినిగురించి చెప్పెను. ఆతడు అరోగదృఢగాత్రుడై మహోజ్జ్వలదేహబంధముతో నర్మదాతీరమున నించు మించుగ నొకశతాబ్దము వసించియుండెను. తన దంత బాధకు ఒకశిష్యుడు ఔషధ మియ్యబోయినప్పుడు, ఆ యోగి దానిని వలదని చెప్పుచు ఆ యొకపల్లు తనకు రెండు శతాబ్దములుగ బాధ నిచ్చియుండినట్లు వచించెను. ఈ యోగి రెండు శతాబ్దములు జీవించియుండుటకు, జడ ప్రకృతిపై నంతటివశము బొందియుండెను, కాని ఆకాల మంతయు ఒక దంతబాధను జయించుట కశక్తుడై యుండె.

అత్యపాయకరము లని తలచబడు కొన్ని రోగ ములు అతిసులభముగ నివార్యములు; అల్పప్రాధాన్యము గల కొన్నిరోగము లెక్కువ నిర్బంధముతో ప్రతిబంధ మొనర్చును.

ఒక రోగమునందు గల అపాయము పదింట తొమ్మిది పాళ్లు భీతినుండి వచ్చుచున్నది. భయము నీ కొక రోగము

యొక్క బాహ్యరూపము నియ్యగలదు; అది నీకు రోగ మునుగూడ ఇయ్యగలదు — దానిఫలితములు అంత దూరము పోనగును. ఈ ఆశ్రమమునకు తఱచుపచ్చెడి యొకనిభార్య, తానేమో యోగ మభ్యసించనిది, పాల వాని యింటిలో (విషూచిక) "కలరా" యుండినట్లు వినెను; ఆమె భయపడెను; మఱునిముసమున ఆ వ్యాధి యొక్క బాహ్యచిహ్నము లన్నియు గనబడ దొడంగె. కాని ఆమెను శీఘ్రముగ స్వస్థపఱచుటకు వీలుపడెను, ఏలన బయటకనబడిన లక్షణములు నిజమైన వ్యాధిగా నీయక నివారితంబు లయ్యె.

యోగభారముయొక్క కార్యములుగ కొన్ని శారీరక గతులు కలవు; అవి కొన్ని సమయములయందు నిరాధారములైన భీతులను గల్గించును; భీతిని నిరాకరించని యెడల, అవి కీడు జేయవచ్చును. ఉదాహరణముగ, ఏదైన నిమీలితముగ నున్నది (మూసికొని యున్నది) ఉన్మీలితము (తెరచుకొన్నది)గా కావలసినప్పుడు విశేషముగ నారంభ దశలలో తలయందు ఒకభార మ్ముండును, అనేకులు దీని ననుభవించియున్నారు; ఈవిషయమైన ప్రశ్న (మునుపే)

వచ్చియున్నది. ఈ అసుఖము ఏమియుజేయదు, రూపాంతరపరిణామమును త్వరపఱచుటకును ఒకఫలమును గల్గించుటకును దేహమునందు ప్రబలముగ నవి (శారీరక గతులు) పనిచేయునపుడు, ఏశక్తులకేసి నీ వున్మీలితుడ వగుచున్నావో ఆశక్తులభారముయొక్క ఫలితమే అది (శిరోభారము)అని నీకు తెలిసినయెడల, నీవు దానిని సులభముగ తరించ వీలుపడును. దానిని నెమ్మదిగ దీసికొన్న యెడల అది అసుఖము లేని వేదనముగ మాఱిపోగలదు. కాని, నీవు భయపడుదువేని చాల చెడ్డతలనొప్పిని నీవు సంపాదించుకొనుట నిశ్చయము; అది జ్వరమువరకుగూడ పోవచ్చును. స్వభావమునందు ఏదోయొక ప్రతిబంధము వల్ల ఈ అసుఖ మేర్పడుచున్నది; ఈప్రతిబంధమును విడిపించుటకు నీకు తెలియునేని, తోడనే నీవు ఆ అసుఖము నుండి విముక్తుడ వగుదువు. కాని నీవు భయపడినయెడల, ఈ అసుఖము ఇంకనేదైన చాలచెడ్డదిగ మాఱవచ్చును నీకుగల యనుభవ మెటువంటిదైనను, నీవు భయమునకు మాత్రము అవకాశ మియ్యరాదు, అవిచాల్యమైన విశ్వాసము నుంచుకొని, సంభవించవలసినదే సంభవించినదని నీవు

చిత్తగించవలెను. ఈ మార్గము నెపుడు వరించితివో, అపుడు నీ వరణమునకు ఆనుషంగికములైన ఫలముల నన్నింటిని ధైర్యముగ నంగీకరించవలయును. నీవు (మార్గమును) వరించిన పిదప వెనుదీసి మరల వరించుచు వెనుదీయుచు వికల్పపడుచు సంశయపడుచు భయపడుచు నుందువేని, నీయందు (నీసత్తయందు) వైషమ్యమును (విసంవాదమును) సృజించెదవు. అది నీయభివృద్ధిని వెనుదీయజేయునది మాత్రమేగాక, నీప్రాణమందును మనస్సునందును పలుకలతలకును దేహమందు అసౌఖ్యరోగములకును జన్మస్థానమై యుండనగును.

# పంద్రెండవ ప్రకరణము

"ఒకయోగి సర్వవిషయములను ఎఱుగదగిన ఒక జ్ఞానస్థితిని (చేతనదశను) బొందగలడా? సకలప్రశ్నలకును, ఉదాహరణముగ, "రిలెటివిటి" సర్వ ద్వంద్వతావాదమువంటి చిక్కులుగల శాస్త్రీయ ప్రశ్నలకు ప్రత్యుత్తర మియ్యదగిన జ్ఞానస్థితిని బొందగలడా?"

సిద్ధాంతముంబట్టియు మూలతత్త్వానుసారముగను ఒకయోగి యెఱుగుటకు వలనుపడనిది యేదియు లేదు; అంతయు యోగిపై నాధారపడియున్నది.

కాని ఒక జ్ఞానమునకును మఱొకజ్ఞానమునకును భేద మున్నది. మనస్సు తెలిసికొనువిధమున యోగి తెలిసికొనడు. అతనికి సర్వము తెలియును, అనగా సాధ్యమైన సకలవృత్తాంతమును అత డెఱుగ నగుననియో, ఆతని మనస్సునందు ప్రపంచమును గురించిన సకలవిషయములును గలవనియో, అతనిప్రజ్ఞ ఒకవిధమైన

అద్భుతమైన సర్వవిద్యాకోశ మనియో అర్థము గాదు. వస్తువులను పురుషులను శక్తులను తనయందుంచుకొనదగినదైన తాదాత్మ్య సామర్థ్యము చేత, లేదా, వానితో తీవ్రముగ క్రియోన్ముఖమైన తాదాత్మ్య సామర్థ్యము చేత యోగి (ఏ విషయమునుగాని) ఎఱుగును. లేకపోయిన, సత్యము జ్ఞానమును గల ఒక చేతనకక్ష్యయందో, ఒక చేతన సంపర్కముతోనో ఉన్నందున నతడెఱుగును.

నీవు సత్యమైన ప్రజ్ఞలో ఉందువేని, నీకు గలుగు జ్ఞానము కూడ సత్యముం జేరినదిగనే యుండును. అప్పటికిని, నీవు దేనిని దెలిసికొందువో దానితో నైక్యముం బొందియుండుట చేతనే, సాక్షాత్తుగ నెఱుగుదువు. నీవు తీర్చవలసిన ప్రశ్న ఒకటియున్నను, ఉద్దిష్టమైన యొక విషయమును గురించి చేయవలసినదేమని నీవు అడుగబడినను, అపుడు నీవు చాలినంత సావధానముగ నేకాగ్రతతో జూచుట చేత స్వయంప్రేరితముగ కావలసిన జ్ఞానము నిజమైన ప్రత్యుత్తరమును గ్రహించగలవు. ఏదైన నొక సిద్ధాంతమతమును జాగ్రత్తతో ప్రయోగించుటవలనగాని దానిని మానసపద్ధతిమూలమున సాధిం

చుటవలన గాని, నీవు జ్ఞానమును పొందవు. భౌతిక శాస్త్రీయమైన మనస్సు తన సిద్ధాంతనిర్ణయములకు వచ్చుట కీ మార్గములు ఆవశ్యకము లగును. కాని యోగియొక్క జ్ఞానము సాక్షాద్ జ్ఞానము, సాధనాంతరము లేనిది, అనుమితిజన్యము కానిది. ఒక వాస్తువిద్యా విచక్షణుడు "ఎన్జినీర్" ఒక "కమాన్" వృత్తఖండనిర్మాణమునకు సరియైన స్థానమును, వక్ర రేఖను, ద్వారముయొక్క ప్రమాణమును నిర్దేశించవలయునేని, వాడు గణితము వేసి, సవిస్తరముగ తారతమ్య పరీక్ష జేసి, తనయందుగల విషయములను ఆధారముగ గొని అనుమానించుటచేత నిర్దేశించును. కాని, యోగికి ఇవేవియు నక్కఱలేదు; అతడు చూచును, విషయమును గుఱించిన దర్శన మతనికి గలదు, ఈ విధముననే చేయవలెను, వేఱువిధమున జేయరాదని యతడు చూచును. (ఇట్లు చూచుటయే) ఈ చూపే అతని జ్ఞానము.

ఒకయోగి తన దర్శనక్షేత్రమునుండి, ప్రజ్ఞాభూమినుండి, సకలవిషయముల నెఱుగగల డనియు సర్వప్రశ్నలకు నుత్తర మియ్యగల డనియు చెప్పుట సామాన్యవిధ

మున నొక యభిప్రాయమునందు నిజమే యయ్యును, అతడు ప్రత్యుత్తర మియ్యలేని, లేదా, ఇయ్యరాని ప్రశ్నలు ఎటువంటివియు లేవు అనుట న్యాయానుసారము కాదు. సాక్షాద్ జ్ఞానముగల, నిజమైన వస్తుతత్త్వ జ్ఞానముగల ఒకయోగి, మానవుల మానస కల్పనా రాజ్యమునకు బొత్తిగ సంబంధించిన ప్రశ్నల కుత్తరమిచ్చుటకు లక్ష్యపెట్టడు. లేదా, ఒకవేళ ఉత్తరమిచ్చుట ఆతనికి కష్టముగాను ఉండవచ్చును. వస్తువుల భ్రాంతి రూపములకును బాహ్యరూపములకును సంబంధించిన ప్రశ్నలను కష్టములను, నీవు దెలుపువానిని, విడదీయ నాతనికి ఇచ్ఛలేకయో శక్తిలేకయో పోవచ్చును. మనస్సునందు గాదు, అతని జ్ఞానముయొక్క వ్యాపారము. అటువంటి మానసికమైన మూఢప్రశ్నను నీవు వేయుదువేని ఒకవేళ నతడుత్తరమియ్య నిష్టపడక పోవచ్చును. ఒక పెద్ద పాఠశాలోపాధ్యాయుని ప్రశ్నించునట్లు అతనికి ఏదైన నొక యవివేక (గర్భితమైన) ప్రశ్నను వేసినను, లేదా, భూతభవిష్యద్వర్తమానములం గురించిన నేవిధవిషయము నడిగినను అతడు ఉత్తరమియ్య బద్ధు

డనియు చాల సామాన్యమైన తలంపు కలదు; ఇది యొక మూఢాభిప్రాయము. నీచమైన బహిర్ముఖ మనస్సుగల వారలను దృష్టిపఱచి వా రాశ్చర్యముతో నోరు తెరచుకొని యున్నట్లు జేయు నత్యద్భుత చేష్టితములను ఒక ఆధ్యాత్మికపురుషునివద్దనుండి ప్రతీక్షించుట ఎట్లనుచితమో, అట్లే ఇదియు.

మఱియు, "యోగి" అను శబ్దము స్పష్టార్థము గాక విశాలముగ నున్నది. యోగుల తరగతు లనేకములు. అధ్యాత్మ పరిశ్రమ గాని గూఢవిద్యాపరిశ్రమ గాని పలుగతులయందు పలువరుసలయందు నడుచును, సిద్ధియందును ఉన్నతులు వేఱుపడును. మనస్సుయొక్క మట్టమును మీఱిపోవని శక్తులు కొన్ని గలవు; మఱికొన్ని దాని నతిక్రమించి పోయియున్నవియు గలవు. ప్రయత్న క్షేత్రముంబట్టి తత్స్వభావముం బట్టియు, వారు (యోగులు) పొందియున్న ఉన్నతింబట్టియు, ఏ ప్రజ్ఞతో సంపర్కమొంది దానియందు ప్రవేశింతురో దానిం బట్టియు, అంతయు నున్నది.

"ప్రకృతిశాస్త్రవేత్తలు కొన్నిసమయములయందు మానస కక్ష్య నతిక్రమించిపోలేదా? "ఐన్‌స్టైయిన్" అను నాతడు తన

సర్వద్వంద్వతాసిద్ధాంతమును (థియరి ఆఫ్ రెలెటివిటి) ఆలోచనపద్ధతి మూలమున గాక, యాదృచ్ఛికమైన యొక ఆవేశము మూలమున కనిపెట్టెనని చెప్పబడియున్నది. ఈ ఆవేశమునకు "విజ్ఞానము" (సూపర్మైండ్)తో నేసంబంధమైన గలదా?"

ఒక క్రొత్తసత్యమును వెల్లడించు నావేశమును పొందు నొక ప్రకృతిశాస్త్రవేత్త దానిని అంతఃస్ఫూర్తి గల మనస్సునుండి గ్రహించును. ఆ జ్ఞానము, ఇంకను చాల పైగనున్న మఱొకజ్యోతిచేత ప్రకాశమొందిన యున్నత మనోమయకక్ష్యయందు ఒక సాక్షాద్దర్శనముగ వచ్చుచున్నది. కాని, దాని కంతకు "విజ్ఞానము" యొక్క కార్యముతో నేసంబంధము లేదు; మఱియు నీయున్నత తరమైన మానసమట్టము "వైజ్ఞానిక" కక్ష్యకు చాల దూరమున నున్నది. మానవులు సామాన్యమైన మట్టము నకు పైగ పోయినమాత్రమున, వారు స్వేచ్ఛముగ దివ్య మైన ప్రదేశములకు ఎక్కియున్నట్లు నమ్ముటకు ఇచ్ఛగిం తురు. సాధారణమైన మానవమానసమునకును "విజ్ఞాన" మునకును మధ్య ననేకదశలు గలవు, అనేక పారంపర్య క్రమములు గలవు, పలు మధ్యవర్తి కక్ష్యలును గలవు. ఒక సాధారణమనిషికి ఈ మధ్యవర్తికక్ష్యలలో దేనితోనైన

సాక్షాత్సంపర్కము గల్గునేని, వాడు తేజః ప్రతిహత నేత్రుడై అంధితుడై అపరిమేయతాబుద్ధి భారమున మర్దితుడగును, లేదా, తన సామ్యావస్థను పోగొట్టుకొనును; అట్లయినను, అది "విజ్ఞానము" కాదు.

'ఒకయోగి సర్వవిషయములును ఎఱుగగలడు, సకల ప్రశ్నల కాతడుత్తరమియ్యగలడు' అను సామాన్యమైన యభిప్రాయమునకు వెనుకనున్న వాస్తవమైన తత్త్వమేమనగా, మనస్సునందొక కక్ష్య కలదు, దానియందు సర్వస్మృతియు నిత్యోపస్థమై యెప్పుడును స్థిరముగనుండును భూమియందలి జీవితమునకు సంబంధించిన సకల మానస ప్రవృత్తులును ఆకక్ష్యలో దాకలు అయియున్నవి. ఎవరు అచ్చట పోవుటకు సామర్థ్యముగలవారై ప్రయాస తీసికొనుటకు లక్ష్యముంచుదురో, వారు తమరు కోరిన దానిని అక్కడ చదువవచ్చును, నేర్చుకొనవచ్చును కాని, ఈప్రదేశము "వైజ్ఞానిక" ప్రస్థములని పొరబాటు బడరాదు. అయినను, అచ్చట జేరుటకు గూడ జడమయమైన స్థూలమనస్సుయొక్క వృత్తులను ఉపశమింపజేయుటకు నీవు శక్తుడవై యుండవలయును; నీయొక్క యిం

ద్రియవ్యాపారములను దూరముగ విడిచిపెట్టి సాధారణ మనోవృత్తులను, అవి ఏవయినను, నిలుపవలయును; ప్రాణ మయ వృత్తినుండి బయట రావలెను; దేహదాస్యము నుండి విడుదల బొందవలయును. అపుడే ఆప్రదేశముం బ్రవేశించి నీవు చూడగలవు. కాని, ఈ ప్రయత్నముం జేయుటకు నీకు చాలినంత అక్కఱ యుండునేని, నీవు అచ్చట పోగలవు, భూమియొక్క స్మృతియందు లిఖిత మయిన దానిని నీవు చదువనగును.

ఈలాగున, నీవు లోతుగ మౌనమునకు పోదు వేని, చేతనయం దొకమట్టమును అందుదువు, అచ్చట నీ యొక్క సకల ప్రశ్నలకును ఉత్తరములను గ్రహించుట అసాధ్యము కాదు. ఒకడు "విజ్ఞానము" యొక్క పరి పూర్ణసత్యమునకు ఉన్మీలితుడై దానితో నిరంతరసంప ర్కము గలవాడై యుండునేని, "వైజ్ఞానికజ్యోతి"నుండి ప్రత్యుత్తరమునకు అర్హమైన ఏప్రశ్నకైనను తప్పక యుత్తర మియ్యగలడు. అడుగుప్రశ్నలు వస్తువులకు వెనుక నుండు సత్యమును యాథార్థ్యమును గుఱించిన యొక బుద్ధినుండి రావలయును. పలుప్రశ్నలు, మిక్కిలి

వివాదగ్రస్త మయినవి, కేవల మానసిక భావముల చేత కల్పితములయిన చిక్కులుగ నుండును, లేదా, అవి వస్తువుల భ్రాంతిరూపైన బాహ్యవిషయముం గుఱించియు నుండును. ఇవి యథార్థమైన జ్ఞానమునకు సంబంధించినవి కావు; ఇవి జ్ఞానముయొక్క వైరూప్యము, వీని సత్త్వము (సారాంశము) అవిద్యకు జేరినది. మనస్సుయొక్క అజ్ఞానముచేత వేయబడిన ప్రశ్నలకు "వైజ్ఞానిక" జ్ఞానము ఉత్తరమును, తన సొంతయుత్తరమును తప్పక ఇయ్యవచ్చును; కాని, అది మానసమట్టమునుండి యడుగువారలకు తృప్తికరముగ నుండకపోవచ్చును, బోధ్యముకూడ గాకుండ బోవచ్చును. మనస్సుయొక్క రీతిని "విజ్ఞానము" పనిచేయవలెనని నీవు ప్రతీక్షించరాదు, లేకపోయిన, సత్యమందలి జ్ఞానము అవిద్యయందలి ఖండజ్ఞానముతో జేరిపోవుట శక్తమై యుండవలెనని గాని, నీవు నిర్బంధించరాదు. మనస్సుయొక్క పద్ధతి ఒక విధము, "విజ్ఞానము" వేఱువిధము. ఇది మానసపద్ధతి యొక్క ఆవశ్యకతలకు తన్ను యుక్తముం గావించుకొనునేని, విజ్ఞానముగనే యుండకపోవును. రెంటికిని

సమానమైన పరిమాణము లేనందున, వానిని గూడ చేర్చగూడదు.

"ప్రజ్ఞ 'వైజ్ఞానిక' సంతుష్టులను బొందియున్నప్పుడు, అది మనస్సునకు సంబంధించిన విషయములో నక్కఱ నుంచునా?"

మానసికవిషయములయందు మనస్సున కేవిధమున నక్కఱ యున్నదో, యట్లు విజ్ఞానమున కుండదు. సకల విశ్వప్రవృత్తులయందును దానికి సొంతమైన ఒక యక్కఱ యుండును; కాని ఆయక్కఱ వేఱువిధముగ జూచుట నుండి కల్గును, వేఱుదృష్టితో గల్గును. దానికి ప్రపంచము బొత్తిగ వేఱుగ గనబడును. అవేక్ష(బయటిదృష్టి) తల క్రిందుగ మాఱిపోవును. అచ్చటనుండి చూడబడున దొక్కొక్కటియు మనస్సు చూచుదానికి వేఱుగను, తఱుచుగ విరుద్ధముగను గూడ నుండును. విషయములకు అర్థము వేఱుగనుండును; వాని రూపము,చలనము, విధానము, వానిం గుఱించిన సకలమును వేఱుకండ్లతో నిరీక్షిత మగును. ఇచ్చట ప్రతిదానిని "విజ్ఞానము" గమనించుచున్నది; దానికి, మనోవృత్తులయందును, తక్కువగాగాక ప్రాణవృత్తులయందును, జడముయొక్క వృత్తులయం

దును, సమస్తవిశ్వలీలయందును, మిక్కిలి యగాధమైన యపేక్షకలదు, కాని అది వేఱువిధము. బొమ్మలనాడించు వానికిని బొమ్మలాటను జూచువానికిని గల అక్కఱయందు ఏ భేదముకలదో అదే భేదము ఇచ్చట గూడ. బొమ్మల నాడించువాడు సూత్రములను తాను పట్టుకొనుచు, అవి యేమిచేయవలె ననియు, తన యిచ్ఛయే వానిని ఆడించు చున్నదనియు, తనయిచ్ఛ వానిని దేనిం జేయనిచ్చునో దానినే యవి చేయు ననియు ఎఱుగును; బొమ్మలాటను చూచువాడు ఒక్కొక్కనిముసమును జరుగుదానినే చూచునుగాని మఱేమియు నెఱుగడు. ఆటను గమనించు చున్నవాడు రహస్యమునకు బాహ్యుడై యున్నాడు; వానికి బలవత్తరమైన ఔత్సుక్యముతో నత్యుత్కటమైన యక్కఱ కల్గును; వాడు అప్రతీక్షితమైన యాదృచ్ఛిక సంభవములను తత్తరపడి గమనించును. మఱియొకడు సూత్రములను బట్టుకొని ఆటను నడుపువాడు, ప్రశాంతుడై చలించక యుండును. అవిద్యనుండి గలుగు నక్కఱ యందు ఒకతీవ్రత యున్నది, అది భ్రాంతితో బంధపడి యున్నది; నీవు అవిద్యనుండి బయటికి వచ్చునపు డది

తొలగవలెను. విషయములయందు మానవులకు గల అక్కఱ భ్రాంతియందు ప్రతిష్ఠితమై యున్నది; ఆభ్రాంతిని తొలగించినవారికి ఆటయందుగల అక్కఱ యుండనే యుండదు; అది వారికి నీరసముగ నిరానందముగ ఉండును. అందువలననే, ఈ యజ్ఞానమంతయు ఈభ్రాంతి యంతయు నింత దీర్ఘ కాలము నుండి వచ్చియున్నది. మానవులు దీనిని కోరుటవల్లను, దానియందును దానియొక్క యొకవిధ వశీకరణమందును సక్తులయి యున్నందునను, అది యింతకాల మున్నది.

"ఒకమనిషి తనదేహస్థితిని మార్చుకొని ఏదైన నొక శారీరక లోపమును దిద్దుకొనుటకు గాని తీర్చుకొనుటకు గాని కోరువాడు చేయవలసిన దేమి? వాడు సాధించవలసిన లక్ష్యముపై నేకాగ్రతతోనుండి తన యిచ్ఛాబలమును బ్రయోగించవలెనా, లేదా, అది (తప్పక) కావలసినట్లు అగును అను విశ్వాసముతో మాత్ర ముండవలెనా, లేదా, దైవశక్తి తన కుచితమైన కాలమున తన కుచితమైన మార్గమున, అభీష్ట సిద్ధిని దెచ్చి యిచ్చునని నమ్మియుండవలెనా?"

ఇవన్నియు ఒకే విషయముం జేయుటకు పలుమార్గములు, ఒక్కొక్కటియు వేలువేలు పరిస్థితులయందు కార్యసాధకముగ నుండును. ఏ పద్ధతిచేత నీ వత్యంతము

జయముం గాంచుదువో, అది నీయందు ఉపచితమైన ప్రజ్ఞనుం బట్టియు, నీవు కార్యమునకు దీసికొని రాగల శక్తులస్వభావముం బట్టియు నున్నది. స్వస్థతగాని మార్పు గాని సమాప్తమయినదను ప్రజ్ఞయందు నీవుండి, నీలోపలి యా ప్రజ్ఞారచనయొక్క బలముచేత మెల్లగ వెలుపలి మార్పును సాధించవచ్చును. లేదా, వీనిని సాధించగల శక్తి నీకు దెలియునేని, తద్దర్శన ముండునేని, దాని నుపయోగించుటకు కౌశల ముండునేని, నీవు దానిని క్రిందికి బిలిచి దానికార్యము ఏభాగములకు అవశ్యమో అచ్చట దానిని బ్రయోగించదగును; అప్పుడది మార్పును సాధించును. లేదా, మఱియు, నీకష్టమును దైవమునకు దెలిపి దైవశక్తియందు దృఢవిశ్వాస ముంచి రోగనివృత్తిని అడుగవచ్చును.

కాని నీ వేమి చేసినను, నీవు ఉపయోగించు విధాన మేదైనను, నీవు దానియందు గొప్పకౌశలమును శక్తిని సంపాదించియున్న వాడవయినను, ఫలమును దైవవశమునందే అప్పగించవలెను. నీవు ఎప్పుడును ప్రయత్నము చేయవచ్చును, కాని నీప్రయత్నఫలము నిచ్చుటయో ఇయ్యకుండుటయో, అది దైవగతము. అచ్చటనే నీసొంత

శక్తి (పురుషకారము) నిలుచును; ఫలము వచ్చిన, దానిం దెచ్చియిచ్చునది దైవశక్తి కాని నీశక్తి కాదు. ఈవిషయము లకై దైవము నడుగుట సరియా యని నీవు అడుగుదువు. ధర్మవిషయమైన యొక దోషమును దొలగించుటకై దైవ ప్రార్థన యెట్లు కీడుగాదో, అట్లే శారీరకలోపనివారణకై దైవమునకేసి తిరుగుటయు. కాని నీవే మడిగినను ఏప్రయ త్నము జేసినను, ఎక్కువగా ప్రయత్నించుచు, జ్ఞానము నుపయోగించుచు, శక్తిని వెలిపఱచుచు నున్నప్పుడును గూడ, ఫలము దైవకృపపై నాధారపడియున్నదని నీకు వేదన ముండవలెను. ఎప్పుడు నీవు యోగమును దీసి కొంటివో, పిమ్మట నీవు చేయుదానినంతను సంపూర్ణ ప్రపత్తిభావముతో జేయవలయును. నీ భావము ఇ ట్లుండవలెను—"నేను తీవ్రముగ కాంక్షించెద, నాలోప ములను దీర్చుకొన యత్నించెద, యథాశక్తి చేసెద. ఫలమునకు మాత్రము నన్ను బొత్తిగ దైవహస్తము లయం దుంచుకొనెద" అని.

"'ఫలమును గుఱించి నాకు నిశ్చయమున్నది, ఈశ్వరేచ్ఛ నే గోరుదాని నిచ్చునని నాకు దెలియును' అని చెప్పిన, నది సాయ పడునా?"

నీవు ఆవిధమున అనుకొనవచ్చును. నీశ్రద్ధయొక్క తీవ్రతకు, నీశ్రద్ధ దేనియం దున్నదో దానిని సాధించుటకు దైవము మునుపే ఇచ్ఛగించియున్నదని యర్థము కావచ్చును. అవిచాల్యమైన శ్రద్ధ దైవేచ్ఛాసాన్నిధ్యమునకు ఒక లింగము (చిహ్నము), భవితవ్యమునకు (జరుగవలసినదానికి) ఒక ప్రమాణము.

"ఒకడు మానసంపన్నమైన ధ్యానమునం దున్నప్పుడు, ఏ శక్తులు వ్యాపారము చేయుచున్నవి?"

అది ధ్యానము చేయువానిపై నాధారపడియున్నది.

"మానముగల ధ్యానమం దొకడు తన్ను బొత్తిగ శూన్యముగా జేసికొనడా? అట్లయిన, నేదిగాని వానిపై నెట్లు ఆధారపడియుండును?"

నీవు నిన్ను సంపూర్ణశూన్యముగ జేసికొన్నను, అది నీ ఉత్కాంక్షయొక్క స్వరూపమును గాని తద్వ్యాపార క్షేత్రమును గాని మార్చదు. కొందఱయందు ఉత్కాంక్ష మానసమట్టములయందో ప్రాణమయ క్షేత్రములయందో చరించును; కొందఱకు ఆధ్యాత్మిక-ఉత్కాంక్ష కలదు. ఏ శక్తి ప్రత్యుత్తరమిచ్చి పనిచేయుటకు వచ్చునో అది ఉత్కాంక్షయొక్క స్వరూపముపై నాధారపడియున్నది.

ధ్యానమందు నిన్ను శూన్యముగా జేసికొనుట ఒక అంత ర్జ్ఞానమును గల్గించును; నీవు అభావమయితి వని గాని మృతమై నిష్క్రియమైన జడమయితి వనిగాని దానికి అర్థము కాదు. వట్టిపాత్రగా ని న్నొనర్చుకొనుచు, దానిని ఎయ్యది నింపవలయునో దానిని నీవు పిలిచెదవు; అనగా, నీయంతఃప్రజ్ఞయొక్క భారమును సిద్ధికేసి విడి పించెదవు అని భావము. ప్రజ్ఞయొక్క స్వరూపము తద్భారముయొక్క దశావిశేషమును, ఈ రెండును నీవు కార్యమునకు దీసికొనివచ్చు శక్తులను—అవి సాయ పడునా పూర్తిజేయునా, విఫలమగునా, కీడుగూడ జేయునా, అడ్డపడునా—అనుటను నిర్ణయించును.

అనేకవిధపరిస్థితులయందు నీవు ధ్యానము జేయ వచ్చును. వాని ఫలితము (కార్యము) క్రింద తీసికొని రాబడి లోపల ప్రవేశించియున్న శక్తులయందును, తద్వ్యాపారమందును ఉండును. నీవు ఏకాంతముగ కూర్చు న్నచో,నీయొక్క బాహ్యాభ్యంతర పరిస్థితియే ముఖ్యము. ఇతరులతో కూర్చుందువేని, ప్రథమప్రాధాన్యము సామా న్యపరిస్థితికి ఉండును. కాని ఈ రెంటియందును పరి

స్థితులు వేలుపడును; ప్రత్యుత్తర మిచ్చు శక్తులును రెండుమారులు ఒకేవిధముగ నుండవు. (అనేకులు ఒక చోటచేరి) ఏకీభవించి సరిగ సాధించు నేకాగ్రత ఒక గొప్పశక్తి కాగలదు. ఆర్జవముతో పంద్రెండుగులు ఆర్జవముగలవారు తమయిచ్ఛను ఉత్కాంక్షను ఏకముంగావించి దైవముం బిలిచినయెడల, దైవము తప్పక ఆవిర్భవించునని యొక ప్రాచీనోక్తి కలదు. కాని ఇచ్ఛ (దృఢసంకల్పము)ఏకలక్ష్యమై యుండవలెను. ఉత్కాంక్ష ఋజువుగ నుండవలెను. ఏలన, ఎవరీప్రయత్నము చేయుదురో వారు నిశ్చేష్టతయందు (తామసత్వమందు) ఏకీభవించ వచ్చును. లేదా, తప్పిదమయిన లేక విపరీతమైన కోరికయందు ఐక్యపడవచ్చును, ఫలముగూడ అనర్థకరముగనే కావచ్చును.

నీ ధ్యానమందు మొట్టమొదట అత్యంతావశ్యకమేమనగా, సమస్తప్రజ్ఞయందును సంపూర్ణమైన ఆర్జవము. నిన్ను నీవు వంచించుకొనరాదు, ఇతరులను వంచింపరాదు, ఇతరులు నిన్ను వంచింపనీయరాదు, ఇది యవశ్యము. తఱుచుగ జనులకొక కోరిక యుండును.

ఒక మనోభీష్టము, ఒక జీవితమునకు జేరిన కామన యుండును. ఒక ఉద్దిష్టమైన విధమున అనుభవము రావలెననియో, లేదా, తమ యభిప్రాయములనో కోరికలనో అభిమతములనో తృప్తిపఱచువిధమున దిరుగవలెననియో వారు కోరుదురు. పిదప జరుగునది నీకు పట్టకపోవునేని నీవు మోసపోవుట సులభమగును. ఒకదానిని నీవు చూతువు, దానిని కొంచెము మెలిబెట్టి వేఱొకదానినిగా మార్చివేయుదువు. లేదా, సామాన్యముగను ఋజువుగను ఉన్న నొకదానిని వికారపఱచి, లేదా, ఒక యసాధారణమైన యనుభవమని దానిని పెద్దదిగా జేయుదువు. ధ్యానమున గూర్చున్నపుడు నీవు నిర్వ్యాజముగను సరళముగను బిడ్డవలె నుండవలయును, నీ బాహ్యమనస్సుతో మధ్య ప్రవర్తించక, ఏదానినైన నెదురుచూడక, బలాత్కరించక యుండవలెను. ఈస్థితి (ధ్యానమునందు) యెప్పుడున్నదో, తక్కినదంతయు లోతుగ నీయందున్న ఉత్కాంక్షనుబట్టి యుండును. లోపలనుండి నీవు శాంతి కావలెనని యడిగినచో నది వచ్చును, బలము శక్తి జ్ఞానము ఇవి కావలెనన్న అవియును వచ్చును—

కాని అన్నియు గ్రహణసామర్థ్యప్రమాణానుసారముగ (వచ్చును). మఱియు నీపిలుపు దైవము నందునని ఒప్పుకొందము. అనగా దైవము నందుటకు నీపిలుపు చాలినంతవఱకు శుద్ధముగను దృఢముగ నున్నదని భావము; అట్లయిన నీవు దైవము నాహ్వానించుదువేని, దైవము నుండి నీకు ప్రత్యుత్తరము వచ్చును.

# పదుమూడవ ప్రకరణము

"తేలు పాములవంటి కొన్ని జంతువులపై మనకు సహజముగ నుండు జుగుప్సకు ఆధార మెయ్యది?"

ఈ జుగుప్సగాని ఆ జుగుప్సగాని యుండుట ఒక అనివార్యమైన యావశ్యకత కాదు. ఏ జుగుప్సయు లేకయే యుండుట యోగముయొక్క ప్రధానసిద్ధులలో నొకటి.

నీవు జెప్పు జుగుప్స భీతినుండి వచ్చును; భయము లేనియెడల, అది యుండదు. ఈ భీతి కాధారముగా హేతు వేదియు లేదు. (కారణము లేకయే ఈ భీతియుం డును), ఇది సహజముగనే యుండును; ఇది వ్యక్తిగతము కాదు, మఱి జాతిగతము. అది సామాన్యమైన సూచన (అభిప్రాయము), సమస్తమానుష్యకముయొక్క ప్రజ్ఞకు చేరినది. ఒకడు మానవదేహమును స్వీకరించునపుడే,

దానితో నీ సామాన్యములైన యభిప్రాయసూచనలను, జాతికి సంబంధించిన భావములను, మానుష్యకముయొక్క జాతీయ వేదనములను, సాహచర్యములను, ఆకర్షణలను, జుగుప్సలను, భీతులను అంగీకరించును.

కాని, వేఱువిధముగ జూచినయెడల, ఆకర్షణ యొక్క స్వభావమందు గాని జుగుప్సయొక్క స్వభావమందు గాని పురుషవ్యక్తికి సంబంధించినది కొంతయున్నది; ఏలన ఈ ప్రవృత్తు లందఱకును ఒకేమాదిరిగ గాక వేఱువేఱు జనులయందు వారి ప్రాణమయసత్తయొక్క స్పందనరీతిపై ప్రాయికముగ నాధారపడియున్నది. కొందఱు మనుజు లున్నారు, వారికి పాములవంటి జంతువులవద్ద జుగుప్స లేదనుట మాత్రమే గాక, వానియందు వారికి ఒక ప్రీతిగూడకలదు. అది ఒక ప్రాణమయమైన ఆకర్షణ, అభిమతము.

ప్రపంచమునందు ప్రీతికరముగ గాని, సుందరముగ గాని, లేకున్న విషయములు నిండియున్నవి; కాని, ఈ విషయములయందు జుగుప్సాభావముతో సంతతము నీ వుండెవలె ననుటకు అది కారణము గాదు. మానవ

మానసమును కలత నొందించి దుర్బలపఱచెడి సకలసంకోచ బీభత్స భీతిభావములను మనము జయించ వీలగును. ఈ ప్రతివ్యాపారములను యోగి జయించవలెను. ఏలన, ఎల్ల సత్త్వముల,వస్తువుల, సంభవముల (ఘటనల) సమక్షమున నీవు సంపూర్ణసమతతో నుండవలసినది యోగమునకు ఆవశ్యకమయిన మొదటిమెట్టు. ఎప్పుడును నీవు నెమ్మదిగను అబాధితుడవుగను అచాలితుడవుగను ఉండవలెను; అక్కడనే యున్నది యోగియొక్క బలము. ఒకని శ్రేష్ఠమైన నిశ్చలతయు అచంచలతయు నిన్నుఎదుర్కొనెడి అపాయకరములును అతిక్రూరములు నైన జంతువులను గూడ శమింపజేయును.

జుగుప్స ఒక అవిద్యాప్రవృత్తి. అది స్వరక్షణకై అశిక్షితముగ సహజముగ వచ్చునొకచేష్ట. కాని అపాయమునుండి నిన్ను బొత్తిగ రక్షించునది జ్ఞానమే కాని ఆలోచించక వచ్చు జుగుప్స కాదు. అజ్ఞానము అపాయము యొక్క స్వరూపముం గుఱించినది, అపాయమును తొలగించునదైన, లేదా, దానిని నిరర్థకముం గావించునదైన ఉపాయమును ఎఱుకతో ప్రయోగించుటయే. ఈ ప్రవృ

త్తులకు ఉదయస్థానమగు నవిద్య ఒక సామాన్యమైన మానవస్థితి, దానిని జయించుట శక్యము; మనలను జుట్టి యెల్లెడల నున్నదియు మన బాహ్యాసత్తకు మూలముగ నున్నదియు నైన అసంస్కృత మానవస్వభావమునకు మనము బంధపడవలసిన దేమియు లేదు.

వృద్ధియగుచున్న ప్రజ్ఞ యజ్ఞానమును తొలగించును; నీకు కావలసినది ప్రజ్ఞ, ఎల్లప్పుడును అత్యధికముగ ప్రజ్ఞ, శుద్ధమును సరళమును ప్రకాశము నగు ప్రజ్ఞ. పరిపక్వమ యిన యీ ప్రజ్ఞయొక్క వెలుతురులో విషయము లున్నవి యున్నట్లు కనబడునే గాని, ఎట్లు కనబడగోరునో యట్లు కనబడవు. ఎల్లవిషయములును జరుగుచున్నపుడు, వానిని ఉన్నవియున్నట్లు దాకలు చేసెడి ఒక తెరవలె నున్నది యీ ప్రజ్ఞ. ఏది తేజోమయముగనో అంధకారమయముగనో యున్నదో, ఏది తిన్నగనో వంకరగనో యున్నదో దాని నంతయు నీవు జూతువు. నీ ప్రజ్ఞ (రూపగ్రాహియగు) ఒక తెరగానో, అద్దముగానో యగును; కాని నీవు ఒక ధ్యానస్థితిలో కేవలద్రష్టగా నున్నప్పుడే యిది యి ట్లగును; నీవు క్రియాపరుడవై యున్నప్పుడు, అది యొక

శోధనదీపము. నీవు ఏ విషయమును ఏ స్థలమందుగాని ప్రకాశమున జూచి లోపలప్రవేశించి పరీక్షించగోరుదు వేని, దానిని (శోధనదీపమును) త్రిప్పిన, చాలును.

ఈ పరిపక్వప్రజ్ఞను బొందుటకు మార్గ మేమన, నీయొక్క వ్యావహారికప్రజ్ఞను దాని ప్రణాలికలనుండియు మేరలనుండియు బయటికి దీసి వృద్ధిపఱచి నేర్పించి దైవ జ్యోతికేసి ఉన్మీలితముం గావించి దైవజ్యోతిని దాని యందు పూర్ణముగను స్వతంత్రముగను పనిచేయనీయ వలసినదే. నీవు వాంఛనంతను భయమంతను వదలి నప్పుడే, నిన్ను అప్రకాశునిగా నుంచి బంధపఱచెడి మానసములైన పక్షపాతములు ప్రాణమయములైన యభి మతములు శారీరకములైన భయములు ఆకర్షణములు, ఇవన్నియు నీకు లేకుండ పోవునపుడే, ఆజ్యోతి తన పూర్ణమైన నిర్విఘ్నమైన కార్యము నొనర్చును.

జుగుప్స దౌర్బల్యముయొక్క ఒక ప్రవృత్తి నీవు స్పృశించబడి పీడితుడవై నిన్ను పీడించుదానినుండి మరలుట వలన, భీతి గలుగుచున్నది. ఒకసత్త్వమో మనుజుడో మృగమో తదుద్భవములో, వానియొక్క వాతావార

ణము ఇతరులకు కీడుజేయునట్లు తోచకపోయినను, నీకు కీడుజేయవచ్చును; అది నిన్ను తాకినతోడనే, దానినుండి నీవు సంకోచ మొంది మరలుదువు. కాని నీవు చాలినంత వఱకు దృఢముగ నున్నచో, అది నీకడకు వచ్చి నిన్ను పీడించనీయక, దూరమునుండియే దానిని నిలుపగలవు. ఏలన, అచ్చట నేదో అపాయకరమున్నదని చూచి తెలిసి కొని నిన్నుజుట్టి రక్షణార్థమైన ప్రాకారమును వేసి కొందువు; మఱియు, నది నీదగ్గఱ వచ్చినప్పటికిని నిన్ను తాకుటకు అశక్తమగును; దాని సాన్నిధ్యముచేత నీవు పీడితుడవు గాక అవిచాలితుడవై యుందువు.

"ప్రేమస్వరూపమైన దైవము సృష్టికి మూలమగునేని, భూమి యందు నిండియున్న యెల్లచెడుపులును ఎచ్చటనుండి వచ్చియున్నవి?"

సర్వమును దైవమునుండియే వచ్చును; కాని ఆ "ఏకమైన చైతన్యము", "పరము" (పరమపురుషుడు) ప్రపంచమును తనవద్దనుండి సాక్షాత్తుగ సృజించలేదు. దానినుండి ఒక శక్తి వెడలి తనకార్యములయందు క్రమక్రమముగ దిగి అధికారికులను పలువురను గడచి వచ్చియున్నది. అనేకులు ఈ ప్రపంచసృష్టికి అధ్యక్షులై కర్తలై యుండి

యున్నారు; కర్తలు అనుటకంటె "కల్పకులు" రూపనిర్మా తలు (అనవచ్చును). వారు మధ్యవర్తులైన అధికారికులు, వారలను సృష్టికర్తలని పిలువక రూపనిర్మాతలనియే నే బిలుతును; ఏలన, వారు చేసియున్న దేమనగా, జడ (భౌతిక) వస్తువునకు రూపును పోకడను స్వభావమును ఒసగియుండుటయే. అనేకులు ఉండియున్నారు; (వార లలో) కొందఱు సంవాదయుక్తములును హితకరములు నగు వస్తువులను రూపెత్తజేసిరి, మఱికొందఱు అహిత కరముగను కుత్సితముగను వస్తువుల రూపరచన నొనర్చిరి. మఱికొందఱు నిర్మాతలుగా గాక వికారపఱచు వారలు గాను ఉండియున్నారు; ఏలన, ఇతరులు బాగుగ ప్రారం భించినదానిని, వీరు మధ్యప్రవేశించి చెడిపియున్నారు.

"లోకవ్యవస్థాత్మకమయిన సృష్టిక్రమమునందు ఈ అన్నమయ (జడ)లోకము చాల క్రిందగ నుండలేదా ?"

మనది అత్యంతజడమయమైన లోకము ; కాని అది "చాల క్రిందిది" అనుట అవశ్యము కాదు. లేదా, ఆ కారణమువలన (అట్లు) కాదు. అది చాల క్రిందనున్న, అప్రకాశముగను అజ్ఞముగను ఉన్నందుననేగాని జడ

ముగ నున్నదను హేతువువల్ల గాదు. మఱియు మనము వసించులోకము జడలోకమొక్కటియే కాదు. ఏకకాలమున మనము వసించు పలులోకములలో నది యొక్కటి, ఒకవిధమున అన్నిటిలోను ముఖ్యమైనది. ఏలన, ఈజడమయలోకము సకలలోకములకును ఏకాగ్రమైన లక్ష్యస్థానము, సకలలోకములయొక్క ఘనీభావమునకు క్షేత్రము. ఈ స్థానమందే ఎల్లలోకములును వెలివడవలయును. ఇప్పు డది సంవాదములేక ప్రకాశములేక ఉన్నది, కాని ఇది యొక యదృచ్ఛాసంభవము, తప్పయిన ప్రారంభము. ఒకనాడు ఇది సుందరముగను, లయసంపన్నముగను, ప్రకాశపూరితముగను అగును. ఏలన, ఆ పరిసమాప్తికొఱకే అది సృజింపబడెను.

# పదునాల్గవ ప్రకరణము

"ఒక యోగి కలావంతుడు గా నగునా, లేక, ఒక కలా వంతుడు యోగి గా నగునా? కళకు యోగముతో సంబంధ మేమి?"

నీవు తలంచునట్లు ఈ రెండును అంతగా విరుద్ధములు కావు ఒక యోగి కలావంతు డగుటకుగాని ఒక కలావంతుడు యోగి యగుటకుగాని అడ్డపడున దేమియు లేదు కాని నీవు యోగమునం దున్నప్పుడు, విషయముల మదింపు, ఎల్లవిషయముల మదింపువలె కళయొక్క మదింపును అతిగంభీరమైన మార్పు బొందును; నీవు వేఱొక స్థితినుండి కళను జూడ దొడంగుదువు ఇక నీవు అదియే శ్రేష్ఠమని తత్పరాయణుడవై యుండవు, నీకు అదియే ఒకలక్ష్యముగా నుండదు. కళ ఒకసాధనము కాని సాధ్యము (లక్ష్యము) కాదు, అది ఆవిష్కృతికి ఒకయుపాయము. అపుడు కలావంతుడు తాను చేయుచున్న దాని చుట్టు ప్రపంచమంతయు ప్రదక్షిణము చేయుచున్నదని

నమ్ముటను మానును. లేదా, ఇంతవఱ కెప్పుడుగాని జేయబడినవానిలో నత్యంత ముఖ్యమైనది తన కృతియని గాని నమ్ముటను మానును. ఇక వాని (వ్య_క్తి)మూ_ర్తిత్వ మునకు ప్రాధాన్యము లేదు; వాడు ఒక క్రియాకారి, ఒక ప్రణాళి; వానికళ దైవముతో తన సంబంధములను వెలిపఱచుటకు ఒకయుపాయము. వాడు తన స్వభావ మందలి శక్తుల యంశముగ నున్న యితరోపాయములను ఎట్లు ఉపయోగించియుండునో, అట్లే దీనిని (కళను)గూడ తదర్థము ఉపయోగించును.

"కలావంతుడు యోగము తీసికొనినప్పుడు, (కళను) సృజించు టకు వాని కేదైన ప్రేరణ గల్గునా?"

వాని కెందుకు ప్రేరణ గల్గగూడదు ? ఇతరవిధ మునవలె, కలారీతియందును దైవముతో తన సంబంధ మును వెలిపరచ వచ్చును. కళ యథార్థమైన నత్యుత్తమ కళగా నుండవలయునేని, అది యీ జడప్రపంచమునకు దీసికొనివచ్చిన దివ్యలోకముయొక్క ఆవిష్కృతిగా నుండవలెను. సరియైన కలావంతుల కందఱకును ఈవిధ మైన యొక భావ ముండును, ఒక ఊర్ధ్వలోకమునకును

ఈ స్థూల (సత్తు) జగమునకును తాము మధ్యవర్తుల మనునొక బుద్ధియుండును. ఈ దృష్టితో నీవు విచారింతు వేని కళ యోగముకంటె వేఱుగాదు. కాని మిగుల తఱుచుగ కళావంతునకు ఒక యనిశ్చితమైన భావ ముండునే గాని జ్ఞాన ముండదు. అయినను, అది (జ్ఞానము) యుండిన కొందఱను నేను జూచియున్నాను. వారు జ్ఞానముతో తమ కళయందు ప్రజ్ఞాపూర్వకముగ ప్రవర్తించిరి. వారు తమ సృష్టియందు (కళానిర్మితియందు) తమ (వ్యక్తి) మూర్తిత్వమును ఒక ప్రధానాంశముగ ముందఱ బెట్టలేదు; వారు తమ కృతిని దైవమునకు అర్పణముగ భావించిరి, దైవముతో తమ సంబంధమును దాని మూలమున వెలిపఱచ యత్నించిరి.

మధ్యకాలమున (యూరోపుఖండమున) ఇదియే కళ యొక్క ప్రకటమైన వ్యాపారముగ నుండెను. "ప్రాథమిక" చిత్రకారులకు, మధ్యకాలపు యూరోపునందు ఆలయములను నిర్మించినవారలకు, కళను గుఱించి వేఱు ఏభావము నుండలేదు. భారతభూమియందు సకలశిల్పము, ప్రతిమాతక్షణము (ప్రతిమలను చెక్కుట), చిత్రము, వీని

కన్నింటికి మూలము అదియే (ఆభావమే), వీని నన్నింటిని ప్రేరణజేసిన యాదర్శ మదియే. మిరాబాయి యొక్క గీతములు, త్యాగారాజుయొక్క సంగీతము, భారతీయు లైన భక్తులు, యతులు, ఋషులు, వీరు నిర్మించిన కవితా సాహిత్యము ఈ లోకముయొక్క మహత్తమ కలా సంపత్తులలో స్థానము వహించును.

"కాని, యోగము చేసినయెడల, కలావంతుని కళ వృద్ధి జెందునా?"

కలాభ్యాసమునకును యోగాభ్యాసమునకును మూలతత్త్వ మొక్కటియే. రెంటియందును ఉత్తరోత్తర ముగ ఎఱుక గల్గుటయే లక్ష్యము; రెంటియందును నీవు సాధారణదృష్టిని భావమును అతిక్రమించియున్న యొక దానిని యనుభవించి చూచుటకును, లోపలికి పోయి అచ్చట నున్న అగాధవిషయములను తీసికొనివచ్చుట కును నేర్చుకొనవలయును. చిత్రకారులు తమచాక్షుష ప్రజ్ఞాభివృద్ధికై (చూపునందు ఎఱుక పెరుగుటకై) ఒక శిక్షను బొందవలయును, అదియే ఒకయోగ మగును. వారు యథార్థముగ కలావంతు లగుదురేని, (కనబడు

దానిని) గడచి చూచి అంతర ప్రపంచమును స్పష్టపఱచు టకు తమకళలను ఉపయోగింప ప్రయత్నింతురేని, ఈ ఏకాగ్రతచేత వారి ప్రజ్ఞ వర్ధిల్లును, ఇదియు యోగము వల్ల ప్రాప్తమగు ప్రజ్ఞకంటె వేఱుకాదు. కాబట్టి, యోగ మునకు సంబంధించిన ప్రజ్ఞ కలానిర్మితికి ఏల సాయముగ నుండగూడదు? అత్యల్పమయిన శిక్షయు కౌశలమును గల కొందఱను నేను చూచి (ఎఱిగి)యున్నాను; అట్లుం డియు వారు విషయరచనయందును చిత్రరచనయందును చక్కని సామర్థ్యమును సంపాదించికొనిరి. మీకు నేను రెండు దృష్టాంతము లుదాహరించగలను. మొదటిది: ఏవిద్యగాని లేనిదైన యొక బాలిక యుండెను, ఆమె నర్తకి, ఒకవిధముగ చక్కగనే నటించెను. ఆమె యోగ ముం దీసికొన్నతర్వాత తన మిత్రములకు మాత్రమే నటిం చెను; కాని ఆమెనర్తనమునకు తత్పూర్వము ఎప్పుడును లేని ఒక యగాధ స్పష్టభావము సౌందర్యమును గల్గెను. ఆమె విద్యాహీనరాయై యుండినను, అద్భుతమయిన విషయ ముల రచియించ దొడంగెను; ఏలన, ఆమెకు దర్శనములు గలిగెను, వానిని అతిసుందరమైన భాషయందు వెల్ల

డించెను. కాని, ఆమెయొక్క యోగమందు (పాతోత్పాత ములు) ఉచ్చగతులును నీచగతులును ఉండెను, మంచిస్థితి యందుండినప్పుడు ఆమె రమణీయముగ వ్రాసెను. అట్లు కానిచో నామె, చాల మందముగను మూఢముగను, నిర్మించలేనిదిగాను ఉండెను. రెండవదృష్టాంతము కళను స్వల్పముగనే నేర్చుకొనియుండిన ఒక బాలునిగురించి నది. వాడు ఒక రాజ్యతంత్రజ్ఞుని కుమారుడు, రాజ్య తంత్రజ్ఞపదవికై వాడు శిక్షబొందియుండెను. సుఖజీవను డైనందున వాని చదువు చాలదూరము పోలేదు. అట్లు న్నను, వాడు యోగము తీసికొన్నతోడనే, (దైవ) ప్రేరితములైన చిత్రములను నిర్మించెను, వానియందు (చిత్రములయందు) అంతరజ్ఞానము పరిస్ఫుటమయ్యెను, అవి (గూఢార్థములను దెలుపు) సంకేత విశిష్టమై యుం డెను; కడపట వాడొక గొప్పకలావంతుడయ్యెను.

"కలావంతులు సామాన్యముగ నేల తమ చర్యయందు నియ మము లేనివారుగను గుణమందు దుర్వృత్తులుగను ఉన్నారు?"

వారట్లున్నచో, దానికి కారణము వారు సాధా రణముగ ప్రాణమయకక్ష్యయందు వసించెదరనుటయే;

వారియందు ప్రాణమయాంశము ఆలోకపు శక్తులను సులభముగ గ్రహించునదియై సకలవిధ సంస్కారములను ప్రేరణలను తీసికొనుచున్నది; ఈ సంస్కారప్రేరణలను వశపఱచుశక్తి వారలకు (కళావంతులకు) లేదు. మఱియు తఱుచుగ వారు స్వతంత్రమానసులై సాధారణజనుల జీవితములను విధించెడి యల్పములైన సాంఘిక సంప్రదాయములయందు నీతుల (ధర్మముల)యందును విశ్వసింపరు. వాడుకగానున్న ఆచారవిధులకు తాము కట్టుపడవలెనని వారెంచరు, ఆస్థానమున నుండవలసిన ఒక అంతరధర్మమును ఇంకను వారు కనిపట్టియుండ లేదు. వారి యిచ్ఛామయ (సత్తయొక్క) ప్రవృత్తులను నియమించుట కేమియు లేదు, సుఖముగ స్వచ్ఛంద జీవితమును నడుపుచున్నారు. కాని అందఱకును ఇట్లు సంభవించదు. నేను పదిసంవత్సరములు కళావంతులమధ్య నివసించితిని, వారు బొత్తిగ మధ్యజాతి కులస్థులని కనుగొంటిని. వారు వివాహముచేసికొని కుదురుపడినవారు, మంచితండ్రులు, మంచిభర్తలు; ఏది చేయదగునో ఏది చేయదగదో దానివిషయమైన ధార్మికాభిప్రాయానుసారముగ తప్పక నడచుకొనిరి.

ఒకమార్గము కలదు; అందు యోగము కలావం తునియొక్క ఉత్పాదకప్రేరణను నిలుపవచ్చును. కళ యొక్కమూలము ప్రాణలోకమం దుండునేని, కలావం తుడు యోగిగ నయినతోడనే, తన యావేశమును గోల్పోవును. లేదా, ఏమూలమునుండి వానికి ఆవేశము వచ్చుచుండెనో అది వానిని ప్రేరించకయే పోవును; ఏలన అపుడు ప్రాణలోకము తన నిజస్వరూపమున గనబడును ; తన యథార్థమైన మదింపును చూపును, ఆమదింపు చాల వరకు (తారతమ్య) సాపేక్షము. కలావంతులని తమ్ము జెప్పుకొనువారలలో పెక్కండ్రు ప్రాణలోకమునుండియే ఆవేశమును గ్రహించెదరు; దానికి ఉత్కృష్టమైన గొప్ప యర్థసూచన ఏమియు లేదు. నిజమైన కలావంతుడు, తన కలాసృష్టిమూలమును ఊర్ధ్వలోకమున నన్వేషించు వాడు, యోగమునకై తిరుగునపుడు, తనకు యావేశము సాక్షాత్తుగను శక్తిమంతముగను అగుచున్నదనియు, తన యావిష్కృతి ప్రసన్నతరముగను అత్యగాధముగను అగుచున్నదనియు కనుగొనును. నిజమైన మదింపుగల వారలయొక్క మదింపును యోగశక్తి వృద్ధిపఱచును,

కాని అబద్ధమైన కలావేషము దాల్చువానివద్దనుంచి ఆ వేషముగూడ కనబడక పోవును, లేదా, దాని ఆకర్షణ తొలగును. యోగమునందుత్సుకుడై యున్న వాని యున్మీలనమగు దృష్టికి పడెడి సరళమైన మొదటి సత్య మేమనగా, విశ్వావిష్కృతితో, విశ్వప్రవృత్తితో, తన యావిష్కృతిని తారతమ్యాపేక్ష చేత చూచినయెడల అది ఎంతసామాన్యము (సాపేక్షము) అనుటయే. కాని ఒక కలావంతుడు సాధారణముగ వృథాభిమానము గలవాడై తన్ను ఒక అత్యంత ప్రధానపురుషునిగాను, మానుషలోకమున ఒకవిధమైన దేవయోనివిశేషునిగాను తలచుకొనును. తాము చేయునది అత్యంత ప్రధానమని నమ్మనియెడల వారు దానిని చేయుటకే వలనుపడదని పలువురు కలావంతులు చెప్పెదరు. కాని, నేను కొందఱను తెలిసికొనియున్నాను. వారికి ఆవేశము ఒక ఊర్ధ్వలోకమునుండియే వచ్చెడిది. అట్లుండియు, వారు చేసిన దానికి అంతగా నమితమైన ప్రాధాన్య ముండినట్లు వారు నమ్మలేదు. అదియే యథార్థమైన కళయొక్క భావమునకు సమీపమగును. ఒక మనిషి తన్ను కళయందు నిజముగ

నావిష్కరించుకొనవలసివచ్చునేని, దైవము తన్ను వాని యందు వెలిపఱచుటకు వరించిన మార్గము అది; పిదప యోగమువల్ల వానికి లాభమే కాని నష్టము లేదు. కాని, ప్రశ్న యంతయు నిది; కలావంతుడు దైవముచేత నియుక్తుడా, స్వయం నియుక్తుడా ?

"కాని ఒకడు యోగముచేయునెడల, షేక్స్పియర్ లేక షెల్లి, పొందినటువంటి ఉన్నతులకు పోగలడా ? అటువంటి యుదాహరణ మేమియు లేదే."

ఏల లేదు ? రామాయణము మహాభారతమును షేక్స్పియర్ గాని మఱి యేకవిగాని సృజించిన దేనికిని తగ్గిపోయినవి కావు, సంశయము లేదు ; మఱియు నవి యోగ-తపస్య నాచరించిన ఋషులకృతి యని చెప్పబడి యున్నది. గీతకు, ఉపనిషత్తులకువలె, మహాత్తమసాహిత్య గ్రంథములలోను ఆధ్యాత్మికగ్రంథములలోను స్థానము కలదు; అట్టిగీతను యోగానుభవము లేనివాడు రచించ లేదు. భరతఖండములోను పారసీకములోను యతులు, "సూఫీ"లు, భక్తులు అని విదితులైన పురుషులు రచించిన కావ్యములు నీ "మిల్టను" కంటెను "షెల్లి" కంటెను

ఎక్కడ తీసిపోయినవి? మఱియు, నీకు యోగులందఱను వారికృతియు తెలియునా? కవులలోను కళాస్రష్టలలోను ఎవరికి దైవముతో ప్రజ్ఞాపూర్వకసంబంధ ముండెను, ఎవరికిలేదు, అని నీవు చెప్పగలవా? కొందఱున్నారు, వారికి యోగులను అధికారపట్టము లేదు, వారు గురువులు కారు, వారికి శిష్యులు లేరు; వా రేమిచేయుదురో అది లోకమునకు తెలియదు; వారికి కీర్తియందు ఔత్సుక్యము లేదు, మఱియు వారు తమకడకు మనుజుల గమనమును (అవధానము) ఆకర్షించరు; కాని వారికి పరతరప్రజ్ఞ కలదు, దైవశక్తితో సంపర్కము కలదు; వారు సృజించు నపుడు అచ్చటనుండియే సృజించెదరు. భరతఖండమందు గల శ్రేష్ఠములైన చిత్రములను, శ్రేష్ఠములైన ప్రతిమా శిల్పములలోను నిర్మాణశిల్పములలోను అధికభాగమును బౌద్ధభిక్షువులు సాధించిరి; వీరు తమ జీవితములను ఆధ్యాత్మిక ధ్యానాభ్యాసములయందు గడపినవారు. వీరు అత్యుత్తమమైన కలాకార్యము నొనర్చిరి గాని తమ పేర్లను సంతతికి దెలియనీయ లక్ష్యపెట్టలేదు. యోగులు సాధారణముగ తమకళచేత విదితులు కారనుటకు ముఖ్య

కారణ మేమనగా, ఒక కేవల కలావంతునివలె వారు తమ కలావిష్కృతిని తమ జీవితమందలి ముఖ్యాంశముగ భావించి దానికై అంత యధికకాలమును శక్తిని ఉపయోగించరు. మఱియు వారు చేయునది ఎప్పుడును మహాజనము నందదు. గొప్పవిషయములం జేసి ప్రపంచమునకు ప్రకటించకుండువారు ఎందఱు కలరు!

"యోగులు 'షేక్స్పియరు' కంటె గొప్పనాటకములను రచియించి యున్నారా?"

నాటకము కళలలో శ్రేష్ఠమైనది కాదు. నాటకము ఏకళకంటెను గొప్పదనియు, జీవితముకంటె కళ గొప్పదనియు ఒకడు చెప్పియున్నాడు. కాని అది బొత్తిగ నట్లు కాదు. కలావంతుని పొరపాటు ఏమనగా, కలాసృష్టి స్వయముగనే యుండి తనకొఱకే తక్కిన జగత్తు నాశ్రయించక స్వతంత్రముగ నున్నదని నమ్ముటయే. ఈ కళావంతులు తెలిసికొన్నకళ విశాలమైన క్షేత్రమునందు పుట్టిగొడుగువంటిది, (క్షణభంగురము), ఆగంతుకము, బాహ్యము, జీవితమునకు ఆత్యంతికమైనదిగాదు; అగాధములుగను చిరస్థాయులుగనున్న సత్యములను అది స్పృశిం

చదు, అందదు; అది సద్భావమునుండి వియోజించరాని సహజమైన అంశముగా కాజాలదు. సౌందర్యము నా విష్కరించుటకే నిజమైనకళ ఏర్పడియున్నది; కాని, దానికి విశ్వగతితో దృఢసంసర్గము గలిగి యుండవలెను. మహా త్తమజాతులు, ఉత్తమసంస్కారము గల (సభ్యతగల) జాతులు కళను జీవితముయొక్క ఒక యంశముగ నెంచి, జీవితాధీనముగా నొనర్చిరి. "జపాను" దేశమునందు అత్యుత్తమకాలములయందు కళ అట్లే యుండెను, కళ యొక్క చరిత్రమునందు సర్వోత్తమ కాలములయందు అట్లే. కాని కలావంతులు పెక్కండ్రు జీవితముయొక్క తీరమున (ప్రాంతమున) పరోపజీవులుగ (వృక్షముపై మొలచు బదనికవలె) నున్నారు; కళ జీవితమందు, జీవిత మూలమున, దైవముయొక్క యావిష్కృతిగ నుండవలె నని వారికి తెలిసినట్లు లేదు. ప్రతివిషయమందును, ఎచ్చటను సర్వసంబంధములయందును సత్యము తన సర్వాశ్లేషకమైన లయతో (సంగీతమునందు వాద్యముల సామ్యము వలె పొందుపడుట) నావిష్కృతము కావలెను; మఱియు, జీవితముయొక్క ఒక్కొక్క ప్రవృత్తియు సౌందర్యసంవా

దముల స్పష్టభావముగ నుండవలెను. కౌశలము కళ గాదు, బుద్ధి కళగాదు. కళ యనునది సర్వసద్భావప్రవృత్తు లయందును స్పష్టముకావలసిన సామరస్యము, సౌంద ర్యము. ఈ సౌందర్య సంవాదావిష్కారము భూమి యందు దైవసాక్షాత్కారమున ఒక యంశము, భూ యిష్ఠాంశ మనవచ్చును.

వైజ్ఞానిక దృష్టియందు సౌందర్య సామరస్యము లకు, దైవముయొక్క యితరావిష్కృతుల కెంత ప్రాధా న్యముకలదో, అంత ప్రాధాన్యము కలదు. కాని, వానిని పృథక్కరించి, తక్కిన యెల్ల సంబంధములనుండి వేఱుగ నొకమూలనుంచి సమస్తమునుండి తీసివేయరాదు. జీవిత ముయొక్క సమస్తావిష్కృతితో నొక్కటిగా నవి యుండ వలెను. ఒక కలావంతుడు ఇతరమనుజులలో నొక్కడుగ నుండక పృథక్కుగ నొకవర్గమునకు జేరిన యసాధారణ పురు షుడుగ నుండవలెననియు, వాని కళకూడ ప్రత్యేకముగ నేదోయొక యసాధారణమైన దనియు,జగమందలి సాధా రణ విషయములతో కలిపివేయరాదనియు నన్నట్లువలె జనులు తలచి "ఓ, అతడు ఒక కలావంతుడు" అని చెప్పు వాడుక కలదు. "కళకొఱకే కళ" (కళకు కళయే ప్రయో

జనము) అను వచనము ఈ పొరబాటునే ఒకసత్యముగ బోధించి దృఢపఱచుచున్నది. మనుజులు, అభ్యాగతులు వచ్చు గదులనడుమ చట్టమువేసిన ఒక చిత్రపటమును, సామానులతోను గోడలతోను ఏ సంబంధమును లేని దానిని, కలాసంపన్నమయిన (సుందరమైన) వస్తువు అను కారణమువల్లనే యుంచినయెడల, అది యెట్లు ఒక పొరబాటగునో అట్లే ఇదియుగూడ (కలార్థమే కళయనుట) ఒక పొరబాటు.

నిజమైన కళ సమస్తము కృత్స్నము నగును; అది యొక్కటియే, జీవితముతో కలిసి యొక్కటిగనే యుండును. నీవు ప్రాచీన గ్రీసు దేశమందును ప్రాచీన ఈజిప్టు దేశమందును ఈ రూఢమైనసాకల్యమును కొంత జూతువు; ఏలన నచ్చట చిత్రపటములు ప్రతిమలు సకల సుందర వస్తువులును (కలావస్తువులు) నిర్మాణశిల్పవిధానమందు భాగముగ, ప్రతివిస్తరాంశమును సమస్తముయొక్క వ్యస్త భాగముగ రచితములై యేర్పఱుపబడెను. జపాను దేశమందు ఇట్లే యుండును; అధమపక్షమున, మొన్నటివఱకు ఇట్లే యుండెను, అనగా ప్రయోజనప్రధానమై వ్యావ

హారపరమైన నవనాగరికత (ఆధునికత) దండెత్తివచ్చుటకు మునుపు (ఇట్లే యుండెను). ఒక జపానీయగృహము అద్భుతమైన కలాసామగ్రి; ఎప్పుడును సరియైన వస్తువు సరియైన స్థలమందుండును; ఏదియు తప్పుగ నుంచబడదు, ఏదియు నత్యధికము గాదు, ఏదియు నత్యల్పము గాదు. ప్రతియొక్కటియు ఎట్లుండవలెనో అట్లేయుండును; గృహమును చుట్టునున్న ప్రకృతితో నత్యద్భుతముగ జేరిపోవును. భరతఖండమునందుగూడ చిత్రము, మూర్తి శిల్పము, నిర్మాణశిల్పమును ఒకేసమగ్రమైన రామణీయకముగ ఒకే దైవారాధనవృత్తిగ నుండెను.

అప్పటినుండి ఈ కలారసికతాబుద్ధియందు లోకమున గొప్పక్షీణదశయే వచ్చియున్నది. విక్టోరియాకాలమునుండి, ఫ్రాన్సుదేశమున ద్వితీయసామ్రాజ్యకాలము నుండి క్షీణదశాకాలమునకు వచ్చియున్నాము. చుట్టియుండు వస్తువులకు ఏవిధసంబంధము (అర్థము) లేని చిత్రపటములను గదులలో వ్రేలవేయు నలవాటు పెరిగిపోయియున్నది. ఏ చిత్రపటమునైనను ఏ సుందరవస్తువునైనను (కలావస్తువు) ఎచ్చటనైనను ఇపుడు ఉంచ

వచ్చును; అట్లు చేయుటచేత భేదమేమియు గల్గదు. కళ యిపుడు కౌశలమును చాతుర్యమును మతిప్రభావమును జూపుటకుగాను ఏర్పడియున్నదే గాని, ఒక గృహామందు సౌందర్యసంవాదములయొక్క సమగ్రమైన స్పష్టభావమును మూర్తీకరించుటకు (మూర్తముం గావించుటకు) గాను కాదు.

కాని, సమీపకాలమున, మధ్యజాతీయ (పామర) రుచియందు ఏర్పడిన కళయొక్క భ్రంశావస్థకు ఎదిరింపు వచ్చెను. ఈ ప్రతిఘటన అంత ప్రచండముగ నుండినందున, అది బొత్తిగ మార్గము తప్పి నదివలె తోచెను; కళయే అసంగతమైనదిగా మునిగిపోనున్నట్లు కనబడెను. అయినను, మెల్లగ, ఈ ఆకులస్థితిలోనుండి చాలయుక్తియుక్తముగను, న్యాయానుసారముగను, సంగతముగను, కళయని మరల పేరిడుటకు యోగ్యమైనదిగను ఒకటి బయటపడెను; అది నవతంబొంది పునరుజ్జీవనముం బొందిన కళయగు గాక యని మనము ఆశింతుము.

కళ, తనమూలసత్యమునందు, దైవావిష్కృతియొక్క సౌందర్యాంశముకంటె నేమియు కొఱవడినది

కాదు. ఈస్థితినుండి చూచినయెడల, ఒకవేళ, అత్యల్ప సంఖ్యాకులే కలావంతు లగుపడుదురు; అట్లుండియు, కొందఱు గలరు; వీరలను యోగులనుగా తలపవచ్చును. ఏలన, కలావంతుడు ఒకయోగివలె నావేశమునకై కాచుకొని యుండి దానిం గ్రహించుటకు అగాధధ్యానమునకు పోవును. నిజముగ సుందరమైన నొకదానిని సృజించుటకు, అతడు మొదట లోపల జూచి తన యంతఃప్రజ్ఞ యందు దానిని సమస్తముగ సాక్షాత్కరించవలయును. అట్లు కనిపట్టి చూచి లోపల నుంచుకొన్నపుడే, అతడు దానిని వెలుపల నిర్వాహించగలడు; అతడు ఈ మహాత్తరాంతర్దర్శనానుసారముగ సృజించును. ఇదియు నొకవిధమైన యోగసాధనయే; ఏలన, దానిచేత నాతడు లోపలి లోకములతో నన్యోన్యముగ నేకాంతవ్యవహారమందు ప్రవర్తించును. "లియోనార్డో విన్సి" యను నాతనివంటి మనిషి ఒకయోగియే గాక వేఱేదియు కాడు. మఱియు నతడు మహాత్తమ చిత్రకారుడు గాకపోయినను, అతని కళ చిత్రముతోనే నిలువకున్నను, కనిష్ఠపక్షమున, మహాత్తమచిత్రకారులలో నొకడు.

సంగీతముకూడ సారాంశమున ఒక ఆధ్యాత్మిక కళయే, అది యెప్పుడును మతమునకు (ధర్మమునకు) సంబంధించిన భావముతోను అంతర్జీవితముతోను సంబంధించి యుండి యున్నది. కాని యిచ్చటం గూడ మనము దానిని స్వతంత్రమైనదిగాను, తనకు తానే, చాలినదిగను (అన్యము నపేక్షించక అత్యభిమానముతో నున్నదిగ), సంగీతప్రధానమైన నాటకమందువలె క్షణభంగురమైన (పుట్టగొడుగువంటి) కళగాను మార్చివేసియున్నాము. మనము చూచు కళాసృష్టులలో నత్యధికసంఖ్యాకములు ఇటువంటివే; ఉత్తమపక్షమున, నవి, కళాపరిభాష నపేక్షించిచూచిన, రుచికరముగ నుండును. సంగీతప్రధాన నాటకములయందలి సంగీతమును ఉన్నతతర కళావిష్కృతికి సాధనముగా (మధ్యనున్నదిగా), ఉపయోగించుటకు వీలుపడదని నే ననలేదు; ఏలన, రూప మేదైనను, అది అగాధమైనప్రయోజనమునకు ఉపయోజ్యము కానగును. అంతయు, ఆవిషయముంబట్టియు, అది యెట్లు ఉపయుక్తమగుచున్నది దానికి వెనుక ఏమున్నది అనుటంబట్టియు నున్నది. ఎట్లు ఏదిగాని దైవముగా నటించనగునో, అయినను (క్షణభంగురమైన) పుట్టగొడుగుజాతికి జేరినదిగా

నుండనగునో, అట్లు దైవప్రయోజనమునకై ఉపయో జ్యము కానిది ఏదియు లేదు.

ఆధునిక సంగీతజ్ఞులలో ననేకు లుండియున్నారు, వారు సృజించినప్పుడు తమప్రజ్ఞ ఉన్నతతరప్రజ్ఞతో సంపర్క మొందెను. "సీసర్ ఫ్రాన్క్" అను నాతడు ఆవిష్టునివలె వాద్యము (అనేక సుషిరములుగల పెట్టె వంటి వాద్యము) వాయించెను. అతనికి చైత్యజీవిత మందు ఒక ప్రవేశ ముండెను, దాని నెఱిగి నాతడు చాల వఱకు స్పష్టపఱచెను. "బీతోవెన్" అను నాతడు తొమ్మి దవ "సింఫొని" (సంవాదభూయిష్ఠమైన) గీతమును రచించి నపుడు, ఒక పైలోకముం బ్రవేశించి యచ్చటనుండి భూమికక్ష్యకు దిగుటను దర్శించెను. "వాగ్నర్" అను నాతడు గూఢలోకముల సందేశములను దృఢములును శక్తిమంతములైనవానిని బొందియుండెను. ఆతనికి గుప్త విషయకబుద్ధియు, గుప్తవిద్యావిషయమైన సహజబోధము (అశిక్షితబోధము) నుండెను, తన్మూలమున మహత్తమా వేశములను గ్రహించెను. కాని ఆతడు ప్రాణమయమట్టు మంతు కార్యమొనర్చె. ఆతని మనస్సుకూడ ఎల్లప్పుడును మధ్యప్రవేశించి ఆతని యావేశమును నిర్జీవప్రాయముం

గావించెను. అతని కృతి శక్తిగలదైనను, అత్యధిక భాగము మిశ్రితమై తరుచుగ నప్రకాశమై బరువుగ నుండును. కాని, అతడు ప్రాణమయ మనోమయ మట్టముల దాటి ఒక పైలోకముం జేర నగునప్పుడు ఆతనికి గల్గిన దృష్టిలవములు అసామాన్య సౌందర్యము గలవై యుండెను. "పార్సిఫాల్", "ట్రిస్టాన్", "ఇస్యుల్ట్" అను వానినందలి కొన్ని భాగములు, గొప్పదైన కడపటి యంకమందు అధికభాగము— వీనియందున్నట్లు (అవి అసామాన్య సౌందర్యముగలవై యుండెను).

మఱియు, ఆధునికులు నాట్యము నేమిచేసి యున్నారో చూడుడు. నాట్యముయొక్క యీస్థితికిని పూర్వస్థితికిని తారతమ్యము జూడుడు. ఒకప్పుడు నాట్యము అంతర్జీవితముయొక్క అత్యుత్తమావిష్కారములలో నొక్కటిగా నుండెను; దానికి ధర్మముతో (మతముతో) సాహచర్య ముండెను; పావనకర్మ విధానమందు, ఉత్సవ నిర్వర్తనలయందు, దైవారాధనయందు, అది ప్రధానాంగముగ నుండెను. కొన్ని దేశములయందు అది అత్యున్నత సౌందర్యదశను అసాధారణ పరిపాకమును బొందియుండెను. జపాను దేశమునందు నాట్యమును

ధర్మమునకు సంబంధించిన జీవితమునం దొకయంశముగ పరిపాలించిరి; మఱియు జపానీయులకు సౌందర్యకలా విషయక బోధ స్వాభావికమైన స్వామ్యము; కావున, వారు న్యూనార్థముగను అల్పతరప్రయోజనముగను దానిని (క్షీణదశను) భ్రంశమొంద నీయరైరి. భరత ఖండమందును అట్లే యుండెను. మనకాలమున పురాతన గ్రీకునాట్యమునకును ఇతరనాట్యములకును పునరుజ్జీవన మొనర్చు ప్రయత్నములు జరిగియున్నవనుట నిజమే; కాని ధర్మ(మత)విషయకబుద్ధి యిటువంటి పునరుత్థాపనము లన్నిటియందు కనబడుట లేదు, అవి నాట్యముగ తోచుటకంటె లయతో గూడిన వ్యాయామవిద్యవలె కనబడుచున్నవి.

నేడు రషియాదేశపునాట్యములు ప్రసిద్ధములు; కాని అవి ప్రాణలోకముయొక్క యావిష్కృతులు, వానియందు భయంకరమైన ప్రాణమయాంశముగూడ నుండును. ఆలోకమునుండి మనకడకు వచ్చునన్నింటివలె, అవి మిక్కిలి ఆకర్షకములుగను అతిజుగుప్సార్హములుగను ఉండును; కాని అవి స్వార్థమునకై యుండునేగాని పరతరజీవితముయొక్క యావిష్కృతికై కాదు. రషియ

నుల గుప్తవిషయకమతమే ప్రాణమయవర్గమునకు జేరినది. నాట్యపరిభాషావేత్తలుగా వారు అత్యాశ్చర్యకరులు, కాని పరిభాష ఒక యుపకరణముమాత్రమే. నీ యుపకరణము చక్కగనుండిన, నంతవఱకు మంచిదే; కాని, ఎంత సొగసుగనున్నను అది ఎప్పుడు దైవమున కర్పితముగాదో, అపుడు అత్యుత్తమవిషయ వర్జితమై దైవోద్దేశమునకు ఉపయోగపడుటకు అలవి కాదు. కష్టమే మన, కలావంతులగువారలలో పెక్కండ్రు తాము స్వాశ్రయులై యున్నట్లును దైవమున కేసితిరుగుట తమకు అవశ్యము కాదనియు నమ్మెదరు. ఇది అత్యంత శోచనీయము; ఏలన, దైవావిష్కృతియందు కౌశలము తక్కిన ఎల్లవిషయములవలె ఉపయోగకరమైన యొక యంశము. దైవరచనయందు కౌశలము ఒకభాగము; మహత్తరవిషయములకు తన్ను అధీనముం జేసికొనుటకు మాత్రము దానికి తెలియవలయును.

మనస్సునకు చాలదూరము పైగా నొకప్రదేశము కలదు; దానిని మనము సంవాదలోకము (సామరస్యలోకము) అనవచ్చును. నీవు అచ్చట పోయి చేరనగునేని, ఇంతవఱకు భూమియందు ఏరూపమునగాని ఆవిష్కృత

మయిన సంవాదముయొక్క మూలమును గనుగొన వచ్చును. ఉదాహరణముగ: కొన్ని శ్రేష్ఠస్వరములుగల ఒక సంగీతపద్ధతి కలదు; అది ఒకరికి వెనుక నొకరుగా వచ్చిన ఇద్దఱు కలావంతుల కృతులకు వెనుక (ఆధార ముగ) నుండెను. ఒకటి "బాక్" అనునాతని సంగీతము, మఱియొకటి "బీతోవెన్" అను నాతని సంగీతము. రెండును కాగితమునందు (వ్రాతయందు) సదృశములుగ నుండవు, బాహ్యశ్రవణమునకును వేఱుగనే యుండును, కాని సారాంశమున నొక్కటియే. ఒకే చైతన్యస్ఫురణ, సాకూత (అభిప్రాయగర్భ)మైన యొకే సంవాదతరంగము ఈ యిద్దఱు కలావంతులను స్పృశించెను. "బీతోవెన్" అధికభాగముం గ్రహించెను, కాని అతనివద్ద నది మనస్సు యొక్క మిథ్యాకల్పనలతోను మిథ్యానివేశములతోను అధికముగ మిశ్రితంబయ్యె. "బాక్" కొంచెమే గ్రహిం చెను, కాని వాడు గ్రహించినది శుద్ధముగ నుండెను. ఈ స్ఫురణ, జయముతో చైతన్యము నిర్గమించుట యొక్క స్ఫురణ, (అనగా) చైతన్యము అచేతనస్థితియొక్క గర్భ మును భేదించుకొని గెలుపుతో ఉద్గమించుటయు, జనిం చుటయు నే.

శ్రీ మాతృ వాక్కులు

సర్వకళయొక్క యీమూలమును యోగముచేత బొందుటకు నీవు సమర్థుడవేని, అపుడు, ఇచ్ఛగింతువేని, నీవు సకలకలాధిపతి వగుదువు. ఇంతకు మునుపు అచ్చట ఎవరు పోయియుండవచ్చునో, వారు అచ్చటి సౌందర్యమును ఆనందమును సుఖముగ ననుభవించుచు దానిని వెలిపఱచక, భూమియందు రూపెత్తనీయక, యచ్చటనే యుండిపోవుటకు అది (ఆ సామరస్యలోకము) సౌఖ్యకరముగను, ప్రీతికరముగను హర్షావేశసౌఖ్యపూర్ణముగను ఉండెనేమో. కాని ఈనివృత్తి(ఇచ్చట మరల రాకపోవుట) యోగముయొక్క సర్వసత్యము గాని నిజమైనసత్యము గాని కాదు. ఇది యొకవైరూప్యము, సన్యాసముయొక్క అధికమైన నివృత్తిభావమువలన క్రియోన్ముఖమైన యోగస్వాతంత్ర్యమునకు గల్గిన న్యూనత (తగ్గుదల). దైవేచ్ఛ ఆవిష్కృతియే గాని, నిష్క్రియతయందును అత్యంతమానమందును బొత్తిగ నివృత్తమయి యుండుట గాదు. దైవచేతన, ఆవిష్కరించని యానందముయొక్క క్రియాశూన్యతగా నిజముగ నుండునేని, ఏసృష్టియు గలిగి యుండదు.

# పదునేనవ ప్రకరణము

"ప్రపత్తియు త్యాగమును ఒక్కటియే గాదా ?"

మన యోగమునందు త్యాగమునకు అవకాశము లేదు కాని పదమునకు ఏ యర్థ ముంచెదవో అంతయు దానింబట్టి యున్నది. దైవమునకు నివేదితమయిన యొక యర్పణము, ఒక పావనకార్యము, అని దానియొక్క స్వచ్ఛమైన యర్థము కాని, త్యాగ మనగా నాశకరమైన యేదో యొకటి యని దానికి ఇప్పటి యర్థసూచన. ఈ త్యాగశబ్దము ఒక నిషేధభావమును (లేదు, వలదు అనుటను) వహించును ఈవిధమైన త్యాగము నిర్వాహము (నెఱవేర్చుట) కాదు; అది అపచయము (క్షయము), తన్ను బలి గావించుకొనుట నీకు శక్యములైన వానిని (శక్యతలను) నీవు త్యజించెదవు. అత్యంత జడస్థితి మొదలుకొని అత్యున్నతాధ్యాత్మ స్థితివఱకు నీ మూర్తిత్వముయొక్క సిద్ధులను శక్యతలను (త్యజించెదవు), త్యాగము నిన్ను

సంకుచితునిం గావించును (తగ్గించును). భౌతికస్థితియందు (స్థూలముగ) నీవు ప్రాణమును దేహమును త్యజింతువేని, భౌతిక కక్ష్యయందు నీ శక్యతలను వదలివేసెదవు; భూమి యందు నీ (యునికియొక్క నేతలను) కార్యమంతను ముగించుకొంటివి. అదేవిధమున నీవు ధర్మానుసారముగ జీవితత్యాగ మొనర్చుదగును. నీ లోపలియునికి విస్తా రముం బొందుటను స్వతంత్రముగ నెఱవేఱుటను నీవు వదలివేసెదవు. ఎప్పుడును, ఈ స్వాత్మబలిదాన మను నభి ప్రాయమందు ఒక బలాత్కారబుద్ధి, కాల్పనికమైన భావము, నిర్బంధముతోడి స్వాత్మనిషేధము కలదు. ఈ యాదర్శము జీవుడు అగాధముగను విపులముగను స్వేచ్ఛానుసారముగా వృద్ధియగుటకు స్థల మియ్యదు. ప్రపత్తి యని మన మనునది యిది కాదు; మఱి ఏ యొక మహత్తర చైతన్యముయొక్క యొక యంశముగ నీ వున్నావో, దానికి, ఆ దైవమునకు, నిన్ను స్వయముగ యత్నము లేకుండ ఆత్మదాన మొనర్చుట, నీయొక్క సర్వాత్మ నర్పించుకొనుట. ప్రపత్తి నీకు క్షయ మొసంగదు, వృద్ధి నొసంగును. అది నీ మూర్తిత్వమును తగ్గించి దుర్బల

పఱచి నాశముచేయదు, నిన్ను సురక్షితుం గావించి నీకు అభ్యుదయ మొనర్చును. ప్రపత్తి యనగా ఈవియందు గల సత్యానందముతో స్వేచ్ఛానుసారముగ జేయు సమస్తదానము; అందు త్యాగబుద్ధి లేదు. నీవు త్యాగము జేయుచున్నా వనుభావము ఇంచుకయేని యున్నచో, ఇక నది ప్రపత్తి గాదు. ఏలన, నీవు గాఢభావముతో నున్నా వనియు, లేదా, అనిచ్ఛతోనో వేదనప్రయాసలతోనో యిచ్చుటకు యత్నించుచున్నావనియు, ఈవియందలి యానందము లేక, ఒకవేళ (స్వేచ్ఛతో) నిచ్చుచున్నా వనుభావముగూడ లేకున్నవాడ వనియు దానికి అర్థము. నీసత్త్వము (నీయునికి) సంకోచనమొందిన దనుబుద్ధితో నీ వే పని చేసినను, నీవు తప్పురీతిని దానిం జేయుచున్నా వని దృఢముగ దెలిసికొనుము. నిజమైన ప్రపత్తి నీకు విస్తార మొసంగును, నీసామర్థ్యమును వృద్ధిజేయును. అది గుణమునందును పరిమాణమందును నీకు మహత్తరప్రమాణము నిచ్చును; (ఇటువంటి) దానిని నీవు స్వయముగనే పొందియుండలేవు. గుణపరిమాణములయొక్క యీ నూతనమైన అధికప్రమాణము నీకు దీనికి మునుపు ప్రాప్త

మయిన ఏదానికంటెను వేఱయినది. నీవు ఒక జగమున, ఒక వైశాల్యమున బ్రవేశింతువు; నీవు ప్రపన్నుడవు కావేని, నీకు ఆప్రవేశము కలుగజాలదు. అది కడలి యందు నీటిబొట్టుపడుటం బోలినది; ఇంక నది తన ప్రత్యే కతాద్రూప్యమును (స్వరూపమును) అచ్చట నుంచు కొన్నచో, నీటిబొట్టుగనే నిలుచును గాని మఱేమియు గాదు; శరణు జొచ్చినందున చుట్టనున్న మితిలేని (నీటి) విస్తారముచేత సమ్మర్దిత మగును. కాని, శరణుజొచ్చిన, నది సముద్రముతో కలసి సమస్తసముద్రముయొక్క స్వభావశక్తివైశాల్యముల బాల్గొనును.

ఈ ప్రవృత్తియందు సందిగ్ధతగాని తేటలేమిగాని లేదు, ఇది ప్రసన్నముగను దృఢముగను నిశ్చితముగను ఉన్నది. విశ్వగతమైన దైవమనస్సు ముంగట నల్పమైన మానవమానసము నిలిచి తనప్రత్యేకత (వేఱుగ నుండుట) యందు సక్తమగునేని, అది పరిమితమై యల్పమైనదిగ పరమైన సత్యముయొక్క స్వభావము నెఱుగుటకును తత్సం పర్క మొందుటకును గూడ నసమర్థమై, ఇప్పు డున్నట్లే నిలిచిపోవును. గుణము నపేక్షించియు పరిమాణము నపే

క్షించియు రెండును అన్యోన్యభిన్నములై వేఱుగ నిలుచుచు నుండును. కాని ఈ యల్పమానవమనస్సు ప్రపన్నమగునేని, విశ్వగత దైవమనస్సున మునిగిపోవును, గుణమందును పరిమాణమందును దానితో నేకమై యుండును. తన పరిచ్ఛేదములను రూపవికారములను (వైరూప్యములను) దప్ప మఱి ఏదానినైనను గోల్పోవక, అది దాని నుండి (విశ్వగతదైవమనస్సునుండి) తద్దైవ్యశాల్యమును తదీయ సముజ్జ్వల ప్రసన్నతను గ్రహించుకొనును. ఈ యల్పమైన సత్త (ఉనికి) తన స్వభావమును మార్చుకొనును, ఏ మహత్తరసత్యమును శరణజొచ్చుచున్నదో తదీయ స్వభావముం దాల్చును. అది నిరాకరించి పోరాడినచో, విశ్వగతమనస్సు నెదిరించినచో, నపుడు పోరాటము నిర్బంధభారమును తప్పవు; అందు ఎయ్యది బలహీనము అల్పమునో యది యాశక్తియందును మితిలేమియందును (మహత్తునందును) లాగబడక మానదు. అది ప్రపన్నము గాకపోయిన, దానికి రాగలవేఱుగతి యొక్కటియే, అది లయము, వినాశమును. ఒకమనిషి, దైవమనస్సుతో సంపర్కమొంది శరణు జొచ్చువాడు, తన

మనస్సు తోడనే తామసత్వములను వదలి నిర్మలమగుట కును, విశ్వగత దైవమానసముయొక్క శక్తిజ్ఞానముల భాగమును హరించుకొనుటకుం దొడంగుచున్నదని కనుగొనును. వాడు సమక్షమున నిలిచి వేఱుపడి సంపర్కము లేకున్నయెడల, పరిమితిలేని వైశాల్యమందు ఒక నీటిబొట్టుగా నిపుడున్నట్లే ఉండిపోవును. వాడు ఎదిరించినచో తనమనస్సును పోగొట్టుకొనును; దాని (మనసుయొక్క) శక్తులు తగ్గిపోయి తొలగును. మనస్సును గుఱించిన యీ సత్యమంతయు స్వభావమందలి యితరాంశము లన్నింటికిని సరిపడును. నీకంటె నధిక బలశాలితో నీవు పోరాడునపుడు ఏ మగునో, ఇదియు నట్లే యగును. నీవు పొందులాభమంతయు తల పగులుటయే. లక్ష లక్షల మడుగులు బలవత్తరమైన యొకదానితో నెట్లు నీవు జగడమాడగలవు? ఒక్కొక్కమాఱును నీ వెదిరించినపుడు నీకొక దెబ్బపడును, ఒక్కొక్కప్రహారము నీబలమునందు ఒకభాగము నపహరించును; ఒకడు బలాధికుడైన యెదిరితో మల్లయుద్ధమున దెబ్బపై దెబ్బ తీసికొనుచు, ఒక్కొక్క దెబ్బవలన దుర్బలుడయి కడ

పట నెట్లు పరాజితు డగుచున్నాడో అట్లే యిదియును. (ఇట్లగుటకు విశ్వగత దైవమనస్సు) దృఢేచ్ఛతో ప్రవర్తించ నక్కఱలేదు, కార్యము స్వయముగనే ప్రవర్తించును. నీవు "అమిత"మును (దైవమును) ఎదిరించి ముట్టుకొన్నయెడల, వేఱేమియు గాజాలదు. నీవు నీమూలయందుండి సాధారణజీవితగతి ననుసరించుచున్నంతవఱకు, నీవు తాకబడవు, పీడితుడవు కావు; కాని నీ వెపుడు దైవముతో సంపర్క మొందుదువో, అపుడు నీకు రెండు మార్గములు కలవు. నీవు శరణుజొచ్చి, అందు మునుగుము; నీ ప్రపత్తి నీకు విస్తారమొసంగి, నిన్ను ప్రశంసనీయుం గావించును; లేదా, నీ వెదుర్కొనుము, నీకు శక్యతలు (నీచేత కాదగినవి) అన్నియు క్షయమొంది, నీవు దేనిని విరోధించుచున్నావో దానియందు ఆకృష్టములగును.

ప్రపత్తిని గుఱించి దురభిప్రాయము లనేకములు ప్రచారమం దున్నవి; జను లనేకులు ప్రపత్తిని మూర్తిత్వపరిత్యాగమునుగా భావించునట్లు కనబడుదురు. అది ఒక శోచనీయమైన ప్రమాదము. దైవచైతన్యముయొక్క

యొకయంశమును ఆవిష్కరించుటకే వ్యక్తి యేర్పడెను; తద్విశిష్టగుణావిష్కృతియే మూర్తిత్వమును సృజించును; పిదప దైవవిషయమై సరియైన భావము నుంచుకొనుట చేత ఈ మూర్తిత్వము తన్ను తగ్గించి వికారపఱచెడి అవర (క్రిందటి) ప్రకృతియొక్క వ్యాపారములనుండి నిర్మలమై దృఢతరముగ మూర్తిత్వము గలదియై, తాను అధికమయి, ఇంకను పూర్ణముగను అగును. మూర్తిత్వము యొక్క సత్యము శక్తియు జ్వలించెడి వైశిష్ట్యముతో వెలువడును; దానిగుణము, అప్రకాశతావిద్యలతోను అవర ప్రకృతియొక్క మాలిన్యమిశ్రణములతోను కలిసి నపుడు ఉండగలదానికంటె నెక్కువగ యాథార్థ్యముతో గుర్తించనగును. ఔన్నత్యమును, శ్లాఘనీయతను, సామర్థ్య వివృద్ధిని, తన శక్యతల పరమావధిసిద్ధిని అది గాంచును. కాని యీ యుత్కర్షావహమైన మార్పును బొందుటకు, యథార్థస్వభావమును వికారపఱచి పరిచ్ఛేదించి (దానికి మితిబెట్టి) తమోవృతముం గాంచుటచేత నెయ్యది నీ యథార్థ మూర్తిత్వమును బంధపఱచి అధమమును విరూపమునుం గావించునో దానినంతను వాడు వదలవల

యును; ఎయ్యది, సాధారణమనుజుని యధమములైన యవిద్యాప్రవృత్తులకు జేరినదో, గ్రుడ్డిగను కుంటిగ నున్న యాతని సామాన్యజీవితమునకు జేరినదో, దాని నంతను వాడు తనవద్దనుండి త్రోసివేయవలయును. మఱి యు తన కామన లన్నింటిని మొట్టమొదట మానవలెను; ఏలన, కామనయే అవరప్రకృతియొక్క అత్యంతాప్రకా శమును, అత్యంతాప్రకాశదాయకము నగు ప్రవృత్తి. ఇచ్ఛలు (కామనలు) దౌర్బల్యముయొక్కయు అజ్ఞానము యొక్కయు చలనములు, అవి నీ దౌర్బల్యమునందును నీ యజ్ఞానమునందును నిన్ను సంకెళ్లలో నుంచియున్నవి.

ఇచ్ఛలు లోపల గలుగుచున్నవని జనులకు ఒక భావము కలదు; అవి తమవద్దనుంచి వచ్చుచున్నవనియో, తమయందే ఉదయమగుచున్నవనియో వా రెంచెదరు; కాని ఇది యబద్ధమైన భావము. అప్రకాశమైన యవర ప్రకృతి యనెడి మహాసముద్రపు తరంగములే యిచ్ఛలు; అవి ఒకని నుండి మఱొకనికడకు పోవును. మనుజులు ఇచ్ఛ లను తమయందు జనింపజేయరు, కాని ఈ యలలే వారి పై వీచును. ఎవడు గాని రక్షలేకుండ నిరావరణుడై

యున్నాడో, వాడు అందు తగులుకొని యిట నట ఊచ
బడుచున్నాడు. ఇచ్ఛ వానిని ఆక్రమించి ఆవేశించుట
చేత విచారసామర్థ్యశూన్యుం గావించి తన్ను వెలిపఱ
చుట వాని స్వభావమందలి యంశ మను భావమును వాని
కొసంగును. యథార్థముగ, వాని నిజమైన స్వభావముతో
దాని కే సంబంధము లేదు; ఇట్లే ఈర్ష్యాసూయా ద్వేష
హింసాదులయిన ఎల్ల యవరప్రకృతి సాహసములకును
(ప్రేరణలకును) నిజమైన స్వభావముతో నే సంబంధము
లేదు. ఇవి కూడ నిన్నుపట్టుకొను ప్రవృత్తులు, ని
న్నాక్రమించి నీపై దండెత్తు తరంగములు. అవి వైకల్య
మొనర్చును, అవి నీ నిజమైన గుణమునకును నిజమైన
స్వభావమునకును జేరినవి కావు. అవి నీయొక్క సహజ
మైన యంశము గాని అవియోజ్యమైన (వేఱుపఱచ
రాని) యంశములు గాని కావు; మఱి అవరప్రకృతి
శక్తులు ఎచ్చట చలించుచున్నవో, చుట్టుకొనియున్న యా
యప్రకాశసముద్రమునుండి అవి బయట వచ్చుచున్నవి.
ఈ యిచ్ఛలకు ఈ భావవికారములకు మూర్తిత్వము
లేదు, వానియందుగాని వాని కార్యమందుగాని నీకు

మాత్రము విశిష్టమైనది ఏదియు లేదు, అవి ప్రతియొక్కని యందును అదేవిధమున బయల్పడుచున్నవి. మనస్సు యొక్క యప్రకాశవృత్తులుగూడ, మూర్తిత్వము నావరించి తద్విస్తారనిర్వాహములను తగ్గించెడి సంశయ ప్రమాదసంకటములును, ఇదేమూలమునుండి వచ్చును. అవి పోవుచు నున్న యలలు, తగులుకొని యంధోపకరణముగ నుపయోగపడుటకు తయారుగనున్న నెవనినిగాని పట్టుకొనును. అట్లుండియు, ఈ ప్రవృత్తులు తనలోని భాగమనియు, స్వతంత్రమైన తన సొంతమూర్తిత్వము యొక్క మహార్ఘమయిన యుత్పత్తి యనియు, ఒక్కొక్కడును నమ్ముచున్నాడు. జనులు తా మనుకొను స్వాతంత్ర్యమునకు చిహ్నమనియో తత్సారాంశ మనియో వీని యందును వీని యసామర్థ్యములందును ఆసక్తులయి యుండుటనుగూడ మనము చూచెదము.

ఇది నీకు బోధమయినచో, అధ్యాత్మభావమునకును ధర్మమునకును (నైతికవిధానము)గల భేదమును, గొప్పభేదమును, బోధపఱచుకొనుటకు తయారుగ నుందువు—ఈ రెండును (జనుల యభిప్రాయమందు) ఒక

టితో నొకటి కలిసి కలతపడియున్నవి. అధ్యాత్మజీవితమునకు దైవచైతన్యముగా నగు (దానియందు సమాప్తమగు) అభివృద్ధియే లక్ష్యము; దానికి ఫలము, నీయందున్న దానికి పరిశుద్ధిని, గాఢతను, శ్లాఘ్యతను, పరిపక్వతను ఒసంగుటయే. అది నిన్ను దైవముయొక్క ఒక యావిష్కరణశక్తిగా జేయును; అది ఒక్కొక్క మూర్తిత్వముయొక్క గుణమును దానియొక్క పూర్ణమైన మదింపును ఉద్ధరించుచున్నది; దానియొక్క పరమావధికమైన ఆవిష్కృతికి తీసికొనివచ్చును; ఏలన నిది దైవ సంవిధానమందలి యంశము. ధర్మము (నైతికవిధి) మానస కల్పనచేత ప్రవర్తించును; ఎది మంచిది, ఎది మంచిది కాదు అనుటంగూర్చి కొన్ని యభిప్రాయములతో ఒక ఆదర్శభూతమైన * ప్రతిమానమును స్థాపించును, అందు నందఱును తామే బలవంతముగ ఇమిడిపోవలెను. ధర్మ

* ఇంగ్లీషుపదము "టైప్"; అనేకములకు మూలముగ నుదాహరించ దగినదిగ నున్న ఆకృతివిశేషము.

దీనిని నిదర్శనము, ప్రతిమానము, ప్రతిరూప మనియుం జెప్పనగు. ఇది జాతిగాదు, వ్యక్తియొక్క యాకృతికే ఇది నిదర్శనముగ

సంబంధిరయైన ఈ యాదర్శము తన వ్యస్తాంశముల యందును సాకల్యమునందును వేఱువేఱు కాలముల యందు వేఱువేఱు దేశములయందు వేఱుపడును. అట్లుండియు నది తాను అద్వితీయమైన నిదర్శనమని (ఉదాహార్యమైన విశిష్టగుణము గలది), సునిశ్చితమై అన్యనిరపేక్షమనియు ఘోషించుకొనును. అది తనలో నొక మాఱుపాటునుగూడ నొప్పుకొనదు. అందఱును దాని యొక్క యొక యాదర్శప్రతిమానమున కనుగుణముగ రూపెత్తుకొనవలెను, ఒక్కొక్కరును ఒకేరూపముగ నిర్దోషముగ ఒకేవిధముగ నుండవలయును. ధర్మవిధి యిట్లు కఠోరమైన అయథార్థస్వభావము గలదిగ నున్నందున, అది తన మూలతత్త్వమునందును నిర్వాహమందును అధ్యాత్మజీవితమునకు ప్రతికూల మయినది. అధ్యాత్మజీవితము సర్వమునందు ఏకమైన సారాంశమును వెలిపఱచును, మఱియు దానియొక్క అనంతవైవిధ్యముం

---

నుండును. తెనుగున "అచ్చు" అను పదమును ఈ యర్థమున వాడవచ్చును. దినుసు, రకము ఈపదములు, అన్యదేశ్యములు, అనింద్యములై వాడుకలో గలవు.

గూడ ప్రకాశపఱచును; అది ఏకత్వమునందు వైవిధ్యమునకై ఆ వైవిధ్యమునందు పరిపూర్తికై పాటుపడును. ధర్మము చేతనయొక్క (ఆత్మయొక్క) స్వతంత్రతకును జీవితముయొక్క నానావిధత్వమునకును విరుద్ధముగ కాల్పనిక ప్రమాణమును స్థాపించును. మానసికమును స్థిరమును పరిచ్ఛిన్నము నగు నొకదానిని సృజించుచు, దానికి అందఱును అనురూపులయి యుండవలెనని యది యాదేశించును. అందఱును సమానములైన గుణములను సమానమైన యాదర్శభూతమైన స్వభావమును సంపాదించుకొొన ప్రయాసపడవలయును. ధర్మవిధానము దివ్యము గాదు, దైవమునకు జేరినది గాదు. అది మానుషము, మానవునకు జేరినది. ధర్మవిధి, మంచిది చెడ్డది యని ఒక నియతమైన విభాగమును తనకు ఆధారమైన మూలాంశముగ తీసికొనును; కాని యిది ఒక నిరంకుశమైన యభిప్రాయము, అన్యసాపేక్షములయిన విషయములను అన్యనిరపేక్షములుగ (ద్వంద్వాత్మకములను నిర్ద్వంద్వములుగ) నిర్బంధపెట్టబూనుచున్నది. ఏలన, ఈ మంచిదియు ఈ చెడ్డదియు, వేఱువేఱు శీతోష్ణస్థితిగల

స్థలములలోను కాలములలోను యుగములలోను దేశ ములలోను వేఱుపడును. ధర్మవిధివిషయకమైన బుద్ధి, మంచి కోరికలు చెడ్డకోరిక లనికూడ కలవని చెప్పునంత వఱకు పోవును; ఒకటిని ఒప్పుకొని మఱియొక్కటిని వద లివేయు మనియు విధించును. అధ్యాత్మజీవిత మన్ననో నీవు ఎల్లకోరికలను బొత్తిగ మానవలెనని దృఢముగ నపేక్షించును. దాని నియతవిధి యేమన, దైవమునుండి నిన్ను దూరస్థుం గావించు ప్రవృత్తు లన్నింటిని నీవు త్రోసి వేయవలయు ననుటయే. నీవు వానిని నిరాకరించవలెను. అవి స్వతః చెడ్డవి అను హేతువువలన గాదు. ఏలన, ఇం కొకనికి ఇంకొకవిషయమందు అవి మంచివిగనే యుండ వచ్చును—మఱి యే హేతువువలన ననగా, అవి ప్రకాశిత ములు గాక జ్ఞానములేనివై, నీయొక్క దైవసామీ ప్యమునకు అడ్డపడెడి ప్రేరణలకును, శక్తులకును జేరినవి. అవి (ఆ ప్రవృత్తులు) చెడ్డవిగాని మంచివిగాని ఎల్లకోర్కె లును ఈ వర్ణనకు విషయము లగును (అంతర్గతము లగును). ఏలన, కోరికయే వెలుగులేని ప్రాణమయసత్త నుండియు, దాని యజ్ఞానమునుండియు నుదయించును.

మఱియేమన, దైవసంపర్కమునకు నిన్ను గొనిపోవు నెల్ల ప్రవృత్తులను నీవు స్వీకరించవలయును. నీవు వానిని అంగీకరించెదవు—అవి స్వతః మంచివను హేతువువలన గాదు, మఱి దైవమునకు నిన్ను గొనిపోవుటవలన. కాబట్టి, నిన్ను దైవమునకు గొనిపోవునన్నింటిని ఒప్పుకొనుము. దైవమునుండి నిన్ను దూరమునబెట్టు నన్నింటిని నిషేధించుము; కాని ఇది మంచిది అది చెడ్డది యని చెప్పి, నీయపేక్షను ఇతరులపై నిర్బంధపెట్ట గడంగకుము; ఏలన, నీవు చెడ్డది యనునదియే నీ ప్రతివాసికి (ఇరుగుపొరుగుల నుండువానికి), దివ్యజీవితమును సాధించ బూనని వానికి, మంచిదిగా నుండవచ్చును.

విషయములపై ధర్మానుసారదృష్టికిని, ఆధ్యాత్మిక దృష్టికిని గల భేదమును ఉదాహరించెదము. సాధారణ సాంఘికాశయములు రెండువర్గముల మనుజులను, ఉదారులు లోభులు అని విభజించును. లుబ్ధుడైన మనిషి తిరస్కృతుడు నిందింతుడు నగును; ఉదారపురుషు డన్ననో స్వార్థము లేనివాడై సంఘమునకు ఉపయోగము గల వాడని వానిని (లోకులు) పాటించి వాని (ఉదార)గుణ

మున్నకై స్తుతించెదరు. కాని యధ్యాత్మదృష్టికి, ఇద్దఱును ఒకమట్టములోనే నిలుచువారు, ఒకని ఔదార్యము మఱొకని లోభమును ఒక యున్నతసత్యముయొక్క, ఒక మహత్తర దివ్యశక్తియొక్క వైరూప్యములు. ఒకశక్తి, ఒక దివ్యప్రవృత్తి, కలదు; అది వ్యాపించి ప్రసరించి, ప్రకృతియొక్క యెల్లమట్టములయందును జడకక్ష్య మొదలుకొని యధ్యాత్మకక్ష్యవఱకు గల శక్తులను వస్తువులను ఇంక తనవద్దనున్న యేదానినైనను ధారాళముగ విసరివేయును; ఉదారపురుషునకు వాని యౌదార్యమునకును వెనుక ఆప్రవృత్తిని వెల్లడించు నొక ఆత్మవిధము (రకము) కలదు; ప్రసరించుటకును, విరివిగ విభజించి యిచ్చుటకును, వా డొక శక్తిగ నున్నాడు. ఇంకొక శక్తి, ఒక దివ్యప్రవృత్తి కలదు, అది (చెదిరియున్న వానిని) ప్రోగుచేసి రాశిగ బెట్టును, క్రిందికక్ష్యలనుండి పైకక్ష్యలవఱకు శక్తులను వస్తువులను మఱియు నుండదగిన సర్వస్వామ్యములను సమాహరించి చేర్చిబెట్టును. ఎవనిని నీవు లోభావిష్టుడని నిందింతువో, వాడే యీ ప్రవృత్తి కుపకరణము. ఇద్దఱును ముఖ్యులు, సంపూర్ణ

సంవిధానమందు ఇద్దఱును ఆవశ్యకులే. రాశిగ జేర్చి యొకచోటబెట్టు ప్రవృత్తి, వ్యాపించి ప్రసరించు ప్రవృత్తి కంటె తక్కువగ నపేక్షితము గాదు. రెండును దైవమున కర్పితము లగునేని, దైవకార్యమునకు ఉపకరణములుగ సమాన ప్రమాణమున సమానమదింపుతో ఉపయోజితములగును. కాని అవి అర్పితములు కానప్పుడు ఇద్దఱును అజ్ఞాన ప్రేరణలచేత చాలితులు. ఒకడు త్రోసివేయుటకు త్రోయబడుచున్నాడు, మఱియొకడు ఉంచుకొనుటకు లాగబడుచున్నాడు. ఇద్దఱును వారి యెఱుకకు ప్రకాశముకాని శక్తులే త్రోయుచున్నవి, ఇద్దఱిలో వరించి తీసికొనుటకు ఏమియు లేదు. ఒకడు యోగముయొక్క యున్నతదృష్టిలో నుండి అతిస్తుతుడైన యుదారపురుషుం జూచి, "నీ యుదారతాప్రేరణలన్నియు చైతన్యము (ఆత్మ)యొక్క మదింపులయందు లేనివే, ఏలన నవి యహంభావమునుండియు అవిద్యాకామననుండియు వచ్చునవి" అని చెప్పవచ్చును. మఱియొకపక్షమున, లోభదోషము ఆరోపితమయినవారలలో నీ వెప్పుడైన నొకమనిషిని, (ధనమును) రాశిగ ప్రోగుచేసియుండువానిని,

తన స్వభావానుసారముగ ప్రాప్తమయిన కర్మయందు నిశ్చలముగ నేకాగ్రతతో దృఢనిశ్చయము నిండియున్న వానిని, జూడగలవు; వాడు ప్రబోధితు డగునపుడు దైవమునకు చాల చక్కని యుపకరణము కావచ్చును. కాని, సాధారణముగ లుబ్ధుడు తనయెదిరి (ఉదారుని) వలె, అహంభావమునుండియు నిచ్ఛనుండియు ప్రవర్తించును; అది అదే యజ్ఞానముయొక్క ఇంకొక ప్రక్కనున్న కొన. ఇద్దఱును, తమకు వెనుకనున్న యుత్కృష్టమైన నొకదానితో సంపర్కమొంది తమ స్వభావాపేక్షితమగు రీతిని దానిని (ఉత్కృష్టమైనదానిని) వెలిపఱచుటకు మునుపు, తమ్ము పరిశుద్ధులం గావించుకొనవలెను.

ఇదేవిధమున ఇతర నిదర్శనము (రకము)లన్నింటిని నీవు తీసికొని దైవశక్తియందు వాని మూలోద్దేశము గుర్తెఱుగవచ్చును. ఒక్కొక్కటియు, దైవోద్దిష్టమైన ప్రతిమానముయొక్క అపహాస్యచిత్రముగను, హ్రాసముగను (తగ్గుదల) ఉండును, మహత్తరమైన యాధ్యాత్మికమైన మదింపుగల విషయములయొక్క మనఃప్రాణకృతవైకల్యముగను ఉండును. వైకల్యమును, ఉప

హాసనీయచిత్రమును సృజించునది యొకతప్పు ప్రవృత్తి. ఎపుడు ఈ మిథ్యాప్రేరణ వశమగునో, సరియైన భావము స్వీకృతమగునో, సరియైన ప్రవృత్తి లబ్ధమగునో, (అపుడు) అన్నియు తమ దివ్యమైన మదింపులను ప్రకాశిపజేచును. అందఱను వారియందలి సత్యము న్యాయయుక్తులం గావించును, అందఱకును సమప్రాధాన్యము, అందఱును సమముగ ఆవశ్యకులు, దైవావిష్కృతికి భిన్నము లయ్యును అనివార్యములైన యుపకరణములు.

చెన్నపురి : 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1941.

# స వ ర ణ



| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౨౩ | ౧౨-౧౩ | అది ప్రవాహాము | అది (ప్రవాహాము) |
| ౩౬ | ౧౦ | తర్వాతయుం | తర్వాతను |
| ౯౩ | ౧౦ | మునగలేవు | మునుగలేవు |
| ౧౦౫ | ౧౪ | సకలసత్త | సకలసత్త, |
| ౧౧౫ | ౯ | ప్రజ్ఞా-అచ్ఛక్తులు | ప్రజ్ఞాతచ్ఛక్తులు |
| ౧౨౫ | ౪ | ఉన్మీలితుడవై | ఉన్మీలితుడవైయుండ |
| ,, | ౫ | నీయెడలో | నీయెడ |
| ౧౨౬ | ౧౬ | పేసికొని | వేసికొని |
| ౧౩౪ | ౮ | ఒకచిన్నసంఘమో మితిసంఖ్యగల | మితసంఖ్యగల ఒక చిన్నసంఘమో |
| ౧౩౭ | ౯ | భౌతికముగమన | భౌతికముగ మన |
| ౧౫౦ | ౯ | షౌఖ్యమందును | సౌఖ్యమందును |
| ౧౬౦ | ౨ | నువ్నదానిని | నున్నదానిని |
| ౧౬౨ | ౨ | హేతవు | హేతువు |
| ౧౯౨ | ౧౦ | ఆధ్యాత్మికత్వ్య | ఆధ్యాత్మికకత్వ్య |
| ౨౩౭ | ౬ | ఒకొక | ఒక |
| ౨౨౯ | ౧౧ | వారి | వారికి |
| ౨౮౪ | ౧౮ | వాతావారణము | వాతావరణము |

